

ఫొటో: కె. భవానిశంకర్


పెచ్చు తీసే పనిలేదు.
ముక్కలు తరగక్కర్లేదు.
శుభ్రం చేసే శ్రమలేదు.
నూరుకునే భారంలేదు.
ఒక్కక్షణం కూడా వృధాకాదు!
ఏ వేళకైనా - ఏ వంటకానికైనా
మీకోసం సంసిద్ధం.
స్వచ్ఛమైన - శుద్ధమైన
ప్రియ అల్లం వెల్లుల్లి
మిశ్రమం.
priya
GINGER & GARLIC
PASTE
తిరుగులేని నాణ్యత కోసం
తాజా పరిమళపు ఘు ఘుమలకోసం
ప్రియ' అల్లం వె మిశ్రమం.
కృత్రిమ పదార్థాలు మచ్చుకైనా లేవు. నూటికి
నూరుపాళ్ళు ప్రకృతి సిద్ధంగా తయారైన సహజ మిశ్రమం.
riya
మా ఎంటర్‌ప్రైజస్ లిమిటెడ్,
ఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాదు - 500 482
Sista's-UEL-609/93 TEL

# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్ చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున, మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలో పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడు జాగ్రత్తపడటం మంచిది.

---------- కూపన్ ----------

**ఆగస్ట్ చతుర నవల ధనకెరటం**

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................

# చతుర కథలు

## వస్త్రాపహరణం

నాటకాల కంపెనీలో చిన్నప్పుడే చేరిన చిన్నారావ్ వయసుతోపాటే చిన్న చిన్న పాత్రల నుంచి ప్రముఖపాత్ర వేసేదాకా ఎదిగాడు.

నటనలోని మెళుకువలెన్నో నేర్చుకుని, అంచెలంచెలుగా ప్రావీణ్యత సంపాదించి మంచి నటుడనిపించుకుంటున్నాడేగానీ, పారితోషికం విషయంలో మాత్రం ప్రొప్రయిటరు మొండిచెయ్యే చూపిస్తున్నాడు.

పాత్రలకి తగ్గ పారితోషికం రాకపోయినా ప్రొప్రయిటర్‌మీద పీకలదాకా కోపం వున్నా... గత్యంతరం లేక అదే ఫీల్డులో, అదే సంస్థలో కొనసాగుతూ వస్తున్నాడు చిన్నారావ్.

అప్పుడప్పుడు తనే సొంతంగా ఓ నాటకాల కంపెనీ పెట్టేసుకుందామనే ఆలోచన వస్తోంది గానీ, దానికి తగ్గ పెట్టుబడి వగైరాలకి భయపడి వూరుకుంటున్నాడతడు. ఓరోజు 'భీష్మ ప్రతిజ్ఞ' నాటకం జరుగుతోంది. అందులో భీష్ముడిగా పాత్రలో లీనమై నటిస్తున్నాడు చిన్నారావ్. తండ్రి శంతనుడి కోసం తాను పెళ్లే చేసుకోనని ప్రతిజ్ఞచేసే ఘట్టంలో బట్టీపట్టిన డైలాగులు, పద్యాలు బాగానే అప్పచెబుతున్నా... మనసులో మాత్రం అంత కష్టమైన పాత్రకి ప్రొప్రయిటరిచ్చే డబ్బు ఎంతో తలుచుకుని కుతకుతలాడిపోతున్నాడు. ఎలాగయినా ప్రొప్రయిటర్‌మీద కసి తీర్చుకోవాలనుకున్నాడు.

సరిగ్గా మళ్లీ వారానికే 'ద్రౌపదీ వస్త్రాపహరణం' నాటకం రిహార్సల్స్ చేస్తున్నారు చిన్నారావ్ ట్రూప్. అనుకోకుండా మలేరియా జ్వరంతో మంచమెక్కేసింది ద్రౌపది పాత్రధారిణి. ప్రొప్రయిటర్‌కి మిన్నువిరిగి మీదపడ్డట్టయింది. ఈ నాటకం కేవలం ఆ పాత్రధారిణి కారణంగానే లోగడ ఎన్నో ప్రశంసలందుకుంది. ఆ హావభావాలు, ఆ డైలాగ్ డెలివరీ ఇంత తక్కువ వ్యవధిలో మరొక కొత్త వ్యక్తికి నేర్పడం కల్లోమాట.

మరి ఎలా...

అప్పుడప్పుడు తనలో ఆడపోలికలు బాగా వున్నాయనీ, నడక, కళ్లు, గొంతు అన్నీ అలాగే వుంటాయనీ అందరూ అనేమాటని నిజంచేస్తూ తానే ద్రౌపదివేషం వేసి నాటకాన్ని విజయవంతం చేయాలనుకున్నాడు ప్రొప్రయిటర్. దాంతో రాత్రింబవళ్లు ఓపిగ్గా ఇంట్లోనే రిహార్సల్స్ వేసుకుని తయారయ్యాడు.

నాటకంరోజు రానేవచ్చింది. దుశ్శాసనుడి పాత్రలో వున్న చిన్నారావ్ ఆవేశపడిపోతూ అవకాశం కోసం ఎదురుచూస్తున్నాడు. ప్రేక్షకులందరి ముందూ ద్రౌపది రూపంలో వున్న ప్రొప్రయిటర్ని నిజంగానే వివస్త్రుణ్ని చేసి అవమానించి కసి తీర్చుకోవాలని చిన్నారావ్ ప్లాన్. ద్రౌపది స్టేజిమీదకొచ్చింది. తెరవెనుకనుంచి చీరలందించే వ్యక్తి చిన్నారావుకి స్నేహితుడే కాబట్టి, కామ్‌గా ఓ మూలకూర్చుని బీడీ కాల్చుకుంటున్నాడు. అవమానం జరిగిన ప్రొప్రయిటర్ అంతగా ఆ తరవాత తనని కేకలేస్తే

ముఖచిత్రం: జగ్‌మోహన్




తనాపాత్రలో లీనమై చేస్తున్నాననీ, మిగతా విషయాలేవీ గమనించలేదనీ చెప్పాలనుకున్న చిన్నారావ్ చీరను స్పీడుగా లాగడం మొదలెట్టాడు.

మూడొంతుల చీర చిన్నారావ్ చేతిలోకొచ్చేసింది. ప్రొప్రయిటర్ ఖంగారుపడుతూ మాటిమాటికీ తెరకున్న చిల్లుల్లోంచి స్టేజి వెనక్కి చూస్తూ, చీరలందించే వ్యక్తిని కాబోలు తిట్టుకుంటూ, పళ్ళునూరుకుంటూ, బి.పి. పేషంటులా ఊగిపోతున్నాడు.

అంతలో హటాత్తుగా ప్రేక్షకులొక్కక్కళ్లే లేవడం మొదలెట్టారు. ఆశ్చర్యంతో నోరెళ్లబెట్టిన చిన్నారావుకేసి చూస్తూ "ఏమయ్యోవ్! ఆ ద్రౌపది వేషంలో వున్నది మగాడని మాకు తెలుసుగానీ అనవసరంగా శ్రమపడమాకు మేం వెళ్లాక తీరిగ్గా విప్పుదుగాని" అంటూ ఒక్కక్కళ్లే బయటకు వెళ్లడం ప్రారంభించారు.

-రాధాశివమోహన్

## ఆచరణ శీలి

**పొ**దుపు ఉద్యమ నాయకురాలిగా జిల్లా మొత్తంమీద అఖండ కీర్తిప్రతిష్ఠల్ని సముపార్జించుకున్న అండాళ్ళమ్మగారు పుట్టెడు దుఃఖాన్ని దిగమింగుకోడానికి విశ్వప్రయత్నం చేస్తున్నారు. కారణం ఆమె భర్త అప్పారావుగారు ఆ క్రితం రాత్రే స్వర్గస్థులయ్యారు. అప్పారావుగారు కూడా పొదుపు ప్రచారోద్యమంలో గణ

నీయమైన కృషి చేసి ఆ భార్యకు తగిన భర్త అన్పించుకున్న ఉద్దండులే! 'మేడ్ ఫర్ ఈచ్ అదర్' అన్నట్లుగా ఆ దంపతులు పొదుపు ఉద్యమానికి అందించిన సేవలు అవిస్మరణనీయమైనవని భావించి ప్రభుత్వం కూడా వారికి తగిన పురస్కారాలు చేసి తన గౌరవాన్ని ఏనాడో ప్రకటించుకుంది.

అప్పారావుగారి మరణవార్త తెలిసి జిల్లా నాలుగు మూలలనుంచి సంతాప సందేశాలు కుప్పలు తెప్పలుగా వచ్చి పడుతున్నాయి. బంధుమిత్రులు ఆత్మీయులు స్వయంగా వచ్చి ఆండాళ్ళమ్మగారికి తమ ప్రగాఢ సానుభూతిని వ్యక్తంచేసి వెడుతున్నారు. బంధుమిత్రుల్ని చూసినప్పుడల్లా ఆమె దుఃఖం కట్టలు తెగుతోంది.

"అక్కా బావ పోయిన సందర్భంగా నిన్ను ఇంటర్వ్యూ చేయాలని పత్రికలవాళ్ళు వచ్చారే, ఒక్కసారి హాల్లోకి వస్తావా?" ఆండాళ్ళమ్మ పడక గదిలోకి వచ్చి అన్నాడు ఆమె తమ్ముడు కుమార్.

మౌనంగా తలాడించి హాల్లోకి నడిచింది ఆండాళ్ళమ్మగారు. ఆమెను చూడగానే ప్రెస్ రిపోర్టర్స్ వినయంగా లేచి నమస్కరించారు.

"మేడం మిమ్మల్ని ఈ పరిస్థితిలో ఇంటర్వ్యూ చేయడం బాధాకరంగానే ఉన్నప్పటికీ రిపోర్టర్స్‌గా మా బాధ్యత నెరవేర్చాలి గనుక తప్పడం లేదు. అయినా మిమ్మల్ని ఎక్కువగా ఇబ్బంది పెట్టకుండా నాలుగైదు ప్రశ్నలతోనే ఇంటర్వ్యూ ముగిస్తాం" అన్నాడొక సీనియర్ రిపోర్టర్.

అలాగే అన్నట్లు తలాడించారు ఆండాళ్ళమ్మగారు.



"అప్పారావుగారితో మీ వివాహమై ఎన్నేళ్ళయింది?"

"పాతికేళ్ళు"

"మీరు పొదుపు ఉద్యమం ఎప్పుడు చేపట్టారు? వివాహానికి ముందా? లేక ఆ తర్వాతా?"

"వివాహానికి ముందే... అసలు మా ఇద్దరినీ కలిపింది పొదుపు ఉద్యమమే. పొదుపుపట్ల మాకున్న అభిరుచే మమ్మల్ని ఒక్కటిచేసింది" నెమ్మదిగా అన్నారు ఆండాళ్ళమ్మ. మరో రిపోర్టర్ కల్పించుకుని-

"ఏ విషయంలోనైనా మీ ఇద్దరి మధ్యా అభిప్రాయ భేదాలు వచ్చేవా?" అని అడిగాడు.

"అదేం లేదు. అయితే పొదుపు పట్ల అభిరుచే తప్ప ఆచరణలో ఆయన ఉదారంగానే వ్యవహరించేవారు. నాకు మాత్రం అది నచ్చదు. ఆ విషయంలో నేను చాలా ఖచ్చితంగా ఉండేదాన్ని"

"సరే చివరి ప్రశ్న... ప్రాణంలో ప్రాణంగా ఉంటూ, మీ అడుగుజాడల్లో నడుస్తూ, పొదుపు ఉద్యమానికి చేదోడు వాదోడుగా సహకరించిన మీ భర్తగారు పోతారని ఏమాత్రం ముందు తెలిసినా మీరు ఎలాంటి జాగ్రత్తలు తీసుకునేవారు?"

"నిన్న సాయంత్రం మా ఇద్దరికీ కాక, నా ఒక్కదానికే వంటచేసుకునేదాన్ని" అంటూ లోనికి నడిచారు ఆండాళ్ళమ్మగారు.

- ప్రతాపచంద్ర

---

# బలహీనత

**మా** కొలీగ్ చిల్లర శ్రీలక్ష్మి అంటే ఆఫీసు మొత్తానికీ చిరపరిచితురాలే! జీయమ్, యండీ అంటే తెలియని వాళ్ళుంటారేమోగానీ శ్రీలక్ష్మి తెలియని వాళ్ళెవరూ మా ఆఫీసులోలేరు. కారణం దాని దగ్గర గుప్పెళ్ల కొద్దీ చిల్లర పైసలుంటాయి. వందరూపాయల చిల్లర కావాలన్నా పర్సులోంచి తీసి చకచక లెక్కబెట్టి పావలాలుగానూ అర్థరూపాయలుగానూ ఇచ్చేస్తుంది.

"ఇంతింత చిల్లర నీకెక్కడనుంచి వస్తుందే మీ అన్నయ్య ఏమన్నా సిటీబస్ కండక్టరా?" అంటూ మేమడిగే ప్రశ్నలకి చిరునవ్వు నవ్వేస్తుందే తప్ప సమాధానం చెప్పదు.

దానికి తగ్గట్టుగానే ఆఫీసులో ఉండే 'రూమర్' అప్పారావులు శ్రీలక్ష్మి చిల్లర విషయమై రకరకాలు పుకార్లు పుట్టించి కడుపు చెక్కలయ్యేలా నవ్వుకునేవాళ్ళు.

ఎవరెలా కామెంట్ చేసినా శ్రీలక్ష్మి మాత్రం నోరు మెదిపేదికాదు. ప్రాణస్నేహితురాలినైనా నరే తన 'చిల్లర రహస్యం' నాకు చెప్పనేలేదు.

తన అక్కగారబ్బాయికి భోగి పళ్లు పోస్తున్నాం రమ్మంటూ పట్టుబట్టిన శ్రీలక్ష్మితో కల్సి ఓసాయంత్రం వాళ్ళింటికి బయలుదేరాను.

బస్ రాగానే 'రావే' అంటూ గబగబ బస్సులోకి దారితీసిందది. ముందు సీట్లు ఆడవాళ్లవి ఖాళీగా ఉన్నా అక్కడ కూర్చోకుండా తిన్నగా వెళ్లి మధ్య సీట్లో కూర్చుంది. అక్కడంతా మగవాళ్ళే!

"సిగరెట్ కంపులు, సకిలింపులు, వెకిలి పలకరింపులు నే భరించలేను... ముందు కూర్చుందాం పదవే" అంటూ నేనెంత చెబుతున్నా విన్పించుకోలేదది. ఏం చేస్తాను తిట్టుకుంటూ వెళ్లి దాని ప్రక్కనే కూర్చున్నాను. ఈలోగా బస్సంతా నిండిపోయింది. మాకు ముందు వెనుక ఎటు చూసినా మగవాళ్లే... మేము కాక ఉన్న ఒకల్లిద్దరూ లేడీస్ ముందు సీట్లలో ఉన్నారు.

అసలంత వరకూ ఆడదాన్నే చూడనట్లు అబ్బాయిలంతా మా వైపు కొరుక్కుతినేలా చూస్తుంటే నాకు ఒకటే కంపరంగా ఉంది.

బస్ బయలుదేరింది.

ఉన్నట్లుండి "అయ్యో డబ్బులు చేతిలోంచి జారిపోయాయే!" అని అరిచింది శ్రీలక్ష్మి.

"ఎంత పోయిందేమిటి?" ఆదుర్దాగా




అన్నాన్నేను.

"సుమారు పది రూపాయలు" అంటూ వెనక్కి తిరిగి వెనక సీటాయనతో, "ప్లీజ్ మీ సీట్ కింద కాయిన్స్ పడ్డాయేమో చూసియివ్వరూ?" అని రిక్వెస్ట్ చేసింది శ్రీలక్ష్మి.

"విత్ ప్లజర్" అంటూ ఆయన తన సీటు క్రింద వెదకి రెండు అర్ధరూపాయలు, ఒక రూపాయి బిళ్ల తీసి ఆమె చేతిలో పెట్టాడు.

"థాంక్యూ" అంది శ్రీలక్ష్మి.

మరోరెండు నిముషాల్లో ఇంకో ముసలాయన "ఇదుగో పాపా! నా దగ్గరకు దొర్లుకుంటూ వచ్చినట్లున్నాయి" అంటూ నాలుగు పావలాలు ఓ అర్ధరూపాయి యిచ్చాడు. తీసుకొంటూ థాంక్స్ చెప్పింది శ్రీలక్ష్మి.

ఆ తర్వాత ఓ యిద్దరు కాలేజీ కుర్రాళ్లు, ఓ మార్వాడీ సేఠ్‌జీ అలా ఇంకా ఎవరో ఎవరో... మేం బస్సుదిగేంత వరకూ ప్రతి రెండు నిముషాలకి నాణేలు తెచ్చి శ్రీలక్ష్మి చేతిలో పెడ్తూనే వున్నారు. అందరికీ నవ్వుతూ కృతజ్ఞతలు చెప్పింది శ్రీలక్ష్మి.

బస్ దిగి లెక్క చూసేసరికి మొత్తం శ్రీలక్ష్మి చేతిలో ఇరవై రూపాయల ముప్పై పైసలు ఉంది.

"అదేంటే నీది పది రూపాయిలేగాపోయింది?" ఆశ్చర్యంతో నోరు తెరిచాను నేను.

"నీ మొహం... పదా పాడా? ఒక్క రూపాయి చిల్లరేనాది. అది కూడా కావాలనే నేను జారవిడిచా..." అంటూ నవ్వింది శ్రీలక్ష్మి.

"ప్రక్కవాడి ప్రాణం పోతున్నా పట్టించుకోని ఈ మగవెధవలు అందమైన అమ్మాయిపట్ల ఎలాంటి అపారమైన దయావర్షాన్ని కురిపిస్తారో చూశావా? అబలహీనతనే నేను ఉపయోగించుకుంటున్నాను తప్పంటావా?" అంటూ ముందుకు కదిలింది.

శ్రీలక్ష్మి చిల్లర రహస్యం అప్పటికిగానీ నాకు తెలియలేదు.

-అన్వేష్

# కత్తి పట్టిన చేతిలోనే కుంచె విన్యాసం



★ ఆస్ట్రేలియాకు చెందిన మోరీ అనే ఈ గజదొంగగారు చేసిన నేరాలు ఇన్నీ అన్నీ కావు. ఇళ్లుదోచుకోవడం, కార్లెత్తు కెళ్ళడం, షాపులు పగలగొట్టడం... ఒక టేమిటీ... లెక్కలేనన్ని నేరాలు చేశాడు. కానీ చిత్రమేమిటంటే ఎన్నిసార్లు జైలు కెళ్లినా ఎలాగోలా తప్పించుకుని ఏదో విధంగా పర్వతప్రాంతాల్లోకి పారిపో తుంటాడు. అక్కడున్న రాళ్ళ మీద సుద్దముక్కతో బొమ్మలు గీయడం ఈయనగారి సరదా. ఆ బొమ్మల్ని చూసిన ఓ ఆర్టిస్టు మోరీని తనతో తీసుకెళ్ళి పెయింటింగ్ నేర్పాడు. ఫలితంగా కత్తులు, పిస్తోళ్లు పట్టిన చేతులే అద్భుత కళాఖండాలను సృష్టించ సాగాయి. దాంతో మోరీ పేరు ప్రఖ్యాతులు మారుమోగిపోయాయి. ఇప్పుడు ఈయనగారి చిత్రాలని లక్షలు పోసి కొనడానికి క్యూలో నిలబడుతున్నారు అభిమానులు. గత పదేళ్లలోనూ మూడువేలదాకా అద్భుత చిత్రాలని గీసిన మోరీకి యూరప్ వెళ్ళి అక్కడి కళాకారులతో పరిచయం పెంచుకోవాలని ఉబలాటంగా వుంది. జీవితంలో ఎప్పటికయినా యూరపు యాత్ర చేస్తానంటున్నాడు ఈ కళాకారుడు.

# ఏరిన ముత్యాలు

★ అస్పృశ్యత ఒక పాపం. నికృష్టమైన నేరం. హిందూమతం ఈ పామును తొందరగా చంపకుంటే అది హిందూమతాన్నే మింగివేస్తుంది.

— గాంధీజీ

★ పుస్తకమనేది నోరుతెరవని ఉపన్యాసకుడు, మౌనం వహించిన మహాకవి, ఒంటరితనాన్ని పోగొట్టే స్నేహితుడు.

— సౌమిత్రీ

★ దారిద్ర్యానికి మించిన నిస్సహాయత వేరొకటి ఉండదు.

— యురిపిడెస్

★ తాము భగవంతుని అవతారాలమని, కారణ జన్ములమని ప్రచారం చేసుకొనే వేదాంతులు కనీసం పంటినొప్పిని కూడా భరించలేరు. ఇతరులకు మాత్రం బాధను ఓర్చుకోవాలని, కష్టాలను సుఖంగా స్వీకరించాలని నీతిబోధ చేస్తారు.

— షేక్స్పియర్

★ చేసిన తప్పు చిన్నదిగానో, పెద్దదిగానో కనిపించేటట్లు చేసుకోవడమనే రెండురకాల ప్రమాదాలే మానవజాతిని పీడిస్తున్నాయి.

— మేరీ బేకర్

★ ఒకరితో స్నేహం చేసేటప్పుడు నెమ్మదిగా ప్రారంభించు. స్నేహం కలిసిన తరువాత మరెన్నడూ విడిచిపెట్టకు.

—సోక్రటీస్

★ ఒకప్పుడు ప్రపంచంలో గొప్పవాళ్ళమనుకున్నవారు, అనిపించుకున్నవారు ఇప్పుడు శ్మశానంలో నామరూపాల్లేకుండా ఉన్నారు.

— క్లీమెన్సో

★ ప్రశంస అనేది పన్నీరులాంటిది. దానిని వాసన చూసి వదిలివేయవలసిందేకాని తాగుతూ కూర్చోకూడదు.

— జాన్‌బిల్లింగ్స్

★ 'ఇల్లు' అనే చిన్నమాటలో ఎంత మహత్యం ఇమిడి ఉంది. అక్కడే మరెక్కడా కానరాని సౌకర్యాలు, సుగుణాలు ఇమిడి ఉన్నాయి.

— సేతే

★ హృదయాలు మృగ్యమైతే గృహమే లేదు.

— బైరన్

సేకరణ: **నలబెల్లి శ్రీమన్నారాయణ**

# చతుర

సంపుటి: 16 సంచిక: 7 ఆగస్టు: 1993


ప్రపంచాన్ని ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలుతూ, మనిషిని సంస్కారం మరిచి ప్రవర్తించేలా చేస్తోంది 'డబ్బు' నేటి సమాజంలో. ధన సంపాదనకి మార్గాలు కోకొల్లలు. అక్షర జ్ఞానం లేకపోయినా, అఖండ మేథాశక్తితో డబ్బుకోసం అతడెన్నుకున్న మార్గాలు అతితక్కువ వ్యవధిలో అతణ్ణి అందని శిఖరాలకి చేర్చాయి. ఆనందడోలికలలో ఓలలాడించాయి. పేదరికంలో మగ్గుతున్న ఓ సామాన్యుడు, పైసా పెట్టుబడి లేకుండా కోటీశ్వరుడయిన కథాకమామిషు ఎలాంటిది? అటు పైన అతనికి ఎదురయిన అనుభవాలు ఎలాంటివి?

ప్రఖ్యాత రచయిత ఆర్.కె. నారాయణ్ నవలకు జె.వి.బి. నాగేశ్వరరావు స్వేచ్ఛానువాదం 'ధనకెరటం' ఈ నెల చతుర సమర్పణ.



కృష్ణభగవానుడి పేరే అతని తల్లిదండ్రులు నామకరణంనాడు అతనికి పెట్టేరు. కానీ ఆ పేరు ఎవ్వరికీ తెలీదు.

అంతా అతన్ని వీరయ్యా అనే పిలుస్తారు.

అతనూ ఆ పిలుపుకి బాగా అలవాటు పడిపోయి తన సంతకం కూడా వీరయ్యా అనే చేయటం మొదలుపెట్టేడు.

ఆ గ్రామానికి చుట్టుపక్కల వున్న పల్లెప్రజల్లోనహా చాలామంది అతని సహాయ, సహకారాలు ఎప్పుడో ఒకప్పుడు పొందినవాళ్లే.

ఆ ఊళ్లో వున్న పెద్ద భవంతుల్లో 'సెంట్రల్ కోపరేటివ్ భూమి తనఖా బాంకు' ఒకటి. ఆ భవనం ఎనభయ్యేళ్లనాటిది. జీవితం మొత్తం 'సహకార బాంకుల' స్థాపనకోసం కృషిచేసి, ఎటువంటి ఫలితాన్నీ కన్నులారా కానకుండానే మరణించిన ఒక దొరవారి పేరిట దాన్ని కట్టేరు. అతను తన విల్లులో యావదాస్తీ మరణానంతరం బేంకు నిర్మాణానికై వ్రాసిపోయిన సంగతి తెలిసి, ప్రభుత్వం వెంటనే అక్కడ బేంకు ప్రారంభించటానికి అనుమతి ఇచ్చింది.

ప్రస్తుతం అతని చిత్రం బేంకు హాల్లో ఎత్తుగా, టేకు ఫ్రేములోంచి, వచ్చేపోయేవాళ్ళను తృప్తిగా చూస్తూ వుంటుంది. నైట్ వాచ్ మేన్ మాత్రం రాత్రిళ్లు డ్రాయర్ సొరుగులు లాగిన చప్పుళ్లు, లెడ్జర్లు, ఫైళ్లు తిరగేస్తున్న ధ్వనులు, టేబుళ్లమీద పిడిగుద్దులు వినబడుతుంటాయని కంప్లయింట్ చేస్తుంటాడు. అదీ నిజమే అయివుండొచ్చు. ఆయన తన జీవితకాలమంతా ఏ నియమనిబంధనల నేర్పరచటానికి కృషిచేశాడో, అవన్నీ పట్టపగలే బేంకులోపలా, బేంకు బయటవున్న మర్రిచెట్టుకిందా చీల్చి చెండాడబడుతుంటే ఆయన ఆత్మ రాత్రివేళల్లో తన నిరసననలా తెలియజేస్తుండవచ్చు.

ఆ బేంకు బయటవున్న మర్రిచెట్టు కిందనే మన వీరయ్యా తన వ్యాపార లావాదేవీలను తదేక దీక్షతో నిర్వహిస్తుంటాడు. ఎప్పుడు చూసినా పల్లీయులు అతడి చుట్టూ గుండ్రంగా కూచుని తమ పనులు పూర్తవటంకోసం ఎదురుచూపులు చూస్తూ వుంటారు. వాళ్లందరూ, పెద్దయినా చిన్నయినా, సరే తనకి గౌరవం ఇవ్వవలసిందేనని వీరయ్యా కోరుకుంటాడు. అతని వయస్సింకా నలభైరెండేళ్లే. వాళ్ల దృష్టిలో అతను బేంకునించి అవలీలగా లోన్లని సంపాదించిపెట్టగల మాంత్రికుడు.

సహకార ఉద్యమ ధ్యేయం, బలహీనవర్గాల వున్నతే అనుకుంటే ఆ లక్ష్యం ఆ మర్రిచెట్టు కింద గుడ్డి గవ్వపాటి విలువ చెయ్యదు. వీరయ్యా జీవిక కేవలం సహకార బేంకునుండి, తన దగ్గరకి వచ్చేవాళ్లకి లేదా, వాళ్లమధ్యనే ఒకరినుండి ఒకరికి అప్పు ఇప్పించడంమీదనే ఆధారపడివుంది.

అతని పెట్టె అక్కడక్కడా పెచ్చులు వూడిపోయి, బూడిదరంగులో వుంటుంది. ఆ రేకు పెట్టెను సులభంగా చంకలో పెట్టుకుపోవచ్చు. దానిలో సాధారణంగా అతనికవసరమయ్యే సరంజామా అంతా వుంటుంది. ఒక సిరాబుడ్డీ, పెన్నూ, అద్దుడు కాగితం, ఎన్నెన్నో చిక్కులెక్కలతో గజిబిజిగా వుండే చిఠాపుస్తకం, వేరువేరు బేంకుల లోను దరఖాస్తుఫారాలు దానిలో వుండే వస్తువులు. ఈ దరఖాస్తుఫారాలు సంపాదించడంలో అతని ప్రజ్ఞ అఖండంగా పనిచేస్తుంది. పొద్దున్నే అక్కడికి వచ్చింది లగాయతు రకరకాల మార్గాల ద్వారా వాటిని సేకరించడం మొదలుపెడతాడు.

ఒక గ్రామస్థుడు తనపనిమీద రాగానే అతడు మొదట అడిగేది "అప్లికేషను తీసుకున్నావా?" అని.

"లేదు" అంటే...

"బేంకులోపలకి పోయి అడుగు. వీలయితే ఇంకో రెండు ఫారాలు ఎక్కువే తీసుకురా!" అని పురమాయిస్తాడు.

అయితే ఎప్పుడూ అలా సంపాదించే వీలు లేదు. అక్కడ గుమాస్తాలు రూలు ప్రకారం ఒకటే ఇవ్వటానికి కట్టుబడి వుంటారు. ఇంకోటి అడిగితే కసిరికొడుతుంటారు. అయినా వీరయ్యా తన పట్టు విడవకుండా రోజూ ఎన్నో కొన్ని ఫారాలు అదనంగా సేకరిస్తూనే వుంటాడు. ఎప్పుడైనా, ఎవరికైనా అర్జెంటుగా లోను అవసరమైతే బేంకులో ఆ ఫారాలు లేకపోతే, తన దగ్గిర సిద్ధంగా వున్న ఫారాన్ని వాళ్లకిచ్చి వీరయ్యా దానిమీద కొంత డబ్బు సంపాదిస్తాడు. దరఖాస్తు పూర్తిచేయటానికెలానూ వేరే ఫీజు వసూలు చేస్తాడు.

గుమాస్తాలనుండి గ్రామస్థులకెన్నోరకాల ఇబ్బందు లెదురవుతుంటాయి.

ఉదాహరణకి ఒకతనికి తన ఎకౌంటు వివరాలు కావాలి. పోయి ఎకౌంట్లు చూసే గుమాస్తానడిగితే.

"ఏదీ నీ పాస్‌బుక్?" అని గద్దించి అడుగుతాడు.

ఏ రైతూ తన దగ్గిర ఎప్పుడూ పాస్‌బుక్ వుంచుకోడు. ఒకవేళ వుంచుకున్నా అది చాలా ఎంట్రీలు వేయవలసిందైవుంటుంది. గత్యంతరం లేక ఆ గుమాస్తా దయా, దాక్షిణ్యాలపై ఆధారపడవలసిన పరిస్థితి ఏర్పడుతుంది.

"నా పనైనంతవరకూ ఆగు. నీ ఒక్కడి పనీ చేయటానికే లేన్నేను" అంటాడా గుమాస్తా. ఆ మాట అన్నాక, ఒకటి రెండురోజులు ఆ వ్యవసాయదారుడు బాంకును వదలకుండా తిరగాల్సిందే. ఆ గుమాస్తా మెప్పుకోసం ఏదో ఒకటి సమర్పించుకోవాల్సిందే! అదిగో... అటువంటి పరిస్థితుల్లో వీరయ్యా చేసే సేవ వెలకట్టలేనిది.

కనీసం వందమందిదాకా కస్టమర్లకు సంబంధించిన వివరాలు బాంకు ఎకౌంటు పుస్తకంతో సమాంతరంగా తనూ ఒక పుస్తకంలో జమాఖర్చులు నమోదు చేస్తుంటాడు వీరయ్యా. గుమాస్తాలకు తీరికలేక, ఎకౌంటు త్వరగా తేలనపుడు సులభంగా తన దగ్గిరికి వచ్చినవాళ్లు ఎంత కట్టాలో, లేకపోతే ఎంతలోను తీసుకోవచ్చో క్షణాలమీద తేల్చి చెపుతుంటాడతను. ఎవరైనా ఒక కస్టమరు బాంకు ఆవరణలోకి రాగానే.

"ఏం... మళ్లీ లోనుకి వచ్చేవే. మాలన్నా... నువ్వు రెండొందలయాభై కట్టుకో. ఒకవారం తర్వాత వెయ్యిరూపాయలు లోను తీసుకోవచ్చు. బాంకు బై-లా ప్రకారం పాత అప్పులు సగం తీరిస్తే కొత్త అప్పు మంజూరు చేయించుకోవచ్చు"

"ఎందుకు వీరయ్యా! నేను మళ్లీ వెయ్యిరూపాయలు అప్పు చెయ్యలేను" అని అతనంటే... అప్పుడు వీరయ్యా ప్రారంభిస్తాడు.

"నీకేం కష్టం వుండదులే. నువ్వు ప్రతినెలా వాయిదా మొత్తం కడుతున్నావా? లేదా?"

"ఎందుకు కట్టడంలేదు. అది కట్టలేకే తల ప్రాణం కాళ్లలోకి వస్తుంటే, మళ్లీ అప్పు చేయమంటావెందుకు వీరయ్యా"

"సరే, నాకదంతా అనవసరం. నువ్వెలా కడుతున్నావో... కట్టలేకపోతే ఎప్పుడు మానేస్తావోగానీ, దాంతో నాకు సంబంధం లేదుగా!"

"కట్టక తప్పదుకదా"

"మరే. అలాగే కడుతూవుండు. రేపు ఒక్క పైసా ఎక్కువ కట్టకు. నీకు తెలీదా! నువ్విప్పుడు కడుతున్న వాయిదా సొమ్ముకంటే కూడా రేపు ఎక్కువేం కట్టక్కరలేదు. పైగా ఇప్పుడు మరో వెయ్యిరూపాయలు లోనుగా జేబులో పడతాయి సుమా"

"నాకెందుకు వీరయ్యా వెయ్యి రూపాయలిప్పుడు"

"సరే... నీకు డబ్బక్కర్లేదన్నమాట. అయితే మళ్లీ నా దగ్గిరకెప్పుడూ రాకు. డబ్బక్కర్లేని వాళ్లకి నాతో పనిలేదు. ప్రపంచంలో ఇంకా నీలాంటి వెర్రివాళ్లున్నారన్నమాట" అనగానే చుట్టూ కూర్చున్న వాళ్లంతా పగలబడి నవ్వుతారు.

ఇంక అతనిపని చూడటం మానేసి, ఇంకో వ్యక్తి పనిచూస్తున్నట్లు నటిస్తాడు వీరయ్యా. ముక్కుమీదకి వాలిన కళ్లద్దాలతో ఎంతో తీరికలేనివాడిలా తన ముందున్న కాగితాల్ని పరిశీలించడంలో మునిగిపోతాడు. ఆ కళ్లద్దాల్ని ఈమధ్యనే కొత్తగా సంపాదించేడు. కళ్లద్దాల్ని ధరిస్తే ముసలితనం వచ్చేసినట్లే అని చాలా కాలం నిగ్రహించుకున్నాడుగానీ అతనికి సంక్రమించిన దృష్టిదోషంవల్ల కళ్లద్దాలు తప్పలేదు. సిల్వర్ ఫ్రేమున్న ఆ కళ్లద్దాల్ని వి.యస్. స్టోర్ దగ్గర తీసుకున్నాడు. ఆ దుకాణం యజమానీ, వీరయ్యా చిన్నప్పుడు కలిసి మెలిసి తిరిగినవాళ్లు. ఆ చనువుతో అతని దగ్గరకి వెళ్లి ఆ అద్దాల్ని కొన్నాళ్లు వాడి చూస్తానని చెప్పి తీసుకున్నాడు. తిరిగి మళ్లీ అటువేపు వెళ్లనేలేదు. ఆ తర్వాతెప్పుడో ఓసారి వీరయ్యా కనిపిస్తే అతను ఆ కళ్లద్దాల డబ్బు గురించి అడిగేడు.

వీరయ్యా బాగా కోపం తెచ్చుకుని "డబ్బు సంగతి అడగడానికి సమయం, సందర్భం వుండక్కర్లే" అంటూ అతణ్ణి దులిపేశాడు.

"పొరబాటైంది వీరయ్యా! నిన్నవమానపర

చాలని అడగలేదు. ఏమనుకోకు'' అంటూ బిత్తరపోతూ సంజాయిషీ ఇచ్చుకున్నాడతను.

''ఇంతకంటే అవమానం మరేంవుంది? చూసేవాళ్లేం అనుకుంటారు? నీకు తెలుసా! పొద్దున్న లేచింది మొదలు రాత్రయ్యేదాకా తిండీ తిప్పలూ చూసుకోలేనంత పనుల్లోపడి తిరుగుతున్నానని... నీ షాపుకు రావటానికే తీరికలేదు. సరే... సరే... నీ నైజం తెలిసిపో యింది. ఎవర్నైనా ఇంటికి పంపు. ఆ దిక్కుమాలిన కళ్లద్దాల్ని నేనసలు వాడటమేలేదు. నేను వీలుచూసుకుని ఒకసారి వద్దామను కుంటున్నాను. కానీ...'' అంటూ దబాయించి మాట్లాడేసేడు.

ఎన్నిసార్లడిగినా వీరయ్య ఇదే పద్ధతి అను సరించడంతో ఆ దుకాణం యజమాని మరింక అడగలేక మానేశాడు. దాన్ని తిరిగిరా నిపద్దుల్లో రాసేసుకున్నాడు. ఇలాటివి ఇంకెన్ని బేరాలు తగిలాయో ఏమోగానీ కళ్లద్దాలు వుండవలసిన 'షో'కేసులో ఆ తర్వాత పౌడరు డబ్బాలు, గాజులు మొదలైనవి చోటుచేసుకో వడం మొదలెట్టేయి.

సిల్వర్‌ఫ్రేమ్ కళ్లద్దాలు మాత్రం క్షేమంగా వీరయ్య ముక్కుమీద అలాగే ఉండిపో యాయి.

కళ్లద్దాల్ని చేత్తోతీసి మడతపెట్టి పక్కనపెట్టి మాలన్న సంగతే పూర్తిగా మర్చిపోయినట్లు పక్కకి తిరిగేడు. కుడిపక్క కూచున్న తన్ని చూసి,

''నువ్వు మాత్రం నీ సంగతి తేలాలంటే ఒక్కవారం ఆగాలి'' అన్నాడు.

''అలా అంటే కాదు తమ్ముడూ! చాలా అవసరంలో వున్నాను. నా కూతురి పెళ్లి వచ్చే నెలలోనే. ముహూర్తం కూడా నిశ్చయమైపో యింది. నువ్వే ఏదోదారి చూడాలి'' దీనంగా, కంగారుగా అన్నాడతను.

''నీ కూతురి పెళ్లా?? డబ్బు నేను ఏర్పాటు చేయాలన్నమాట. నీ అవసరం తీరిపోయేక నీకు మరి వీరయ్య ఎవరో గుర్తేవుండదుగ దూ?''

అవతలివ్యక్తి 'ఎంతమాట' అన్నట్టు నోటితో ధ్వనులు చేస్తూ తల అడ్డంగా వూపేడు. అతనిపేరు 'కందా'. పదిహేనుమైళ్ల దూరంలో వున్న గ్రామంనుంచి బయల్దేరి వీరయ్యకోసం పొద్దున్నే వచ్చేడు. ఆ గ్రామంలో అతనికి ఇరవైఎకరాల భూమి, పెద్ద ఇల్లు, పశువులూ వున్నాయి. అవన్నీ తనఖాలోనే వున్నాయి. ఆ తనఖాలన్నిటికీ వీరయ్యే సలహాదారు కూడా. అతనో పెద్ద తాగుబోతు, జూదగాడు. ఎప్పుడు డబ్బు కావాలన్నా కూతురి పెళ్లి అనే అంటా డు. కానీ ఇంతవరకూ ఒక్కకూతురి పెళ్లి చేసినట్లు కనపడడు. వీరయ్య వీలయినంతవ రకూ వాళ్లకీ, వీళ్లకీ ముడిపెట్టి ఎంతో కొంత డబ్బు సర్దుతూనే వున్నాడుగానీ ఈ కందాగారు ఆ డబ్బేం చేస్తున్నాడో మాత్రం ఎప్పుడూ పట్టించుకోలేదు.

''నీకు డబ్బు కావాలంటే నువ్వు మరొకరితో జాయింట్‌లోను తీసుకోవాల్సిందే. మరో మార్గంలేదు. మరి నీతో పార్టనర్‌గా వుండేదెవ రు?'' అంటూ ఆలోచనగా చుట్టూ చేరిన జనం వంక చూసేడువీరయ్య.

''మీరంతా ఈ కోపరేటివ్ సొసైటీ సభ్యులే కదా! మీతోటివాడి అవసరానికి ఒక్కరూ సహాయం చేయలేరా?'' అనడిగేడు.

చాలామంది తలలు పక్కకి తిప్పేశారు. ఒకతను మాత్రం అన్నాడు.

''అదేం వీరయ్యా, అలా అంటావు. స్వంత అన్నకి తమ్ముడికి కూడా జాయింట్‌లోను మీద సంతకం పెట్టడానికి భయపడుతున్నరోజు లివి''

''నిజమే'' ఒప్పుకున్నాడు వీరయ్య.

''స్వంత అన్నదమ్ముల మధ్య జాయింట్‌లో ను ప్రమాదకరమైందే. కాదన్ను. కానీ నేను మీ అన్నదమ్ములకోసం అడగటంలేదు. ఒక మని షిగా తోటివాడికి కష్టం వొచ్చినప్పుడు ఉదార బుద్ధితో సహాయం చేయలేరా? అని అడుగుతు న్నాను'' కంఠం సవరించుకున్నాడు వీరయ్య 'కందా'ని చూపుతూ తన ఉపన్యాసం కొనసా గించేడు.

''ఇదుగో... ఈ పెద్దమనిషిని చూశారా? సోమనూరులో ఇతనికంటే మోతుబరి మరొక రులేడు. కావలసినంత భూమి, పశువులూ, ఆస్తీ వున్నవాడేగానీ, లేనివాడేంకాదు. అయితే బలహీనతలు కొన్నున్నాయి. అవి లేనిదెవరికి చెప్పండి. అతని ఆర్థిక స్థోమత గురించి నాది హామీ. అతని ఆడపిల్ల పెళ్లికి ఒక్క వెయ్యిరూ

పాయలు తక్కువైంది. మీకూ ఆడపిల్లలున్నారు. కట్నాలబాధ తెలీనివాళ్లు కారు. ఎవరైనా దయదలిచి జాయింట్ లోను ఇప్పించగలిగితే ఈ గండం గడిచి బయటపడతాడు''

''నిజమే ఈ కట్నాలబాధ తలుచుకుంటే భయమేస్తుంది'' అన్నాడొకాయన.

''కొంతమంది బతుకులే నాశనమైపోతున్నాయ్'' అన్నాడింకొకాయన.

వీరయ్య మళ్లీ అందుకున్నాడు. ''ఎవరిదాకానో ఎందుకు? నేను లేనూ... నాకు ముగ్గురు అక్కచెల్లెళ్లు. ప్రతి ఆరునెలలకోసారి అయిదు బళ్లనిండా ధాన్యం బస్తాలు మా ఇంటికొచ్చేవి. మా ఇంట్లో మూడు ధాన్యంకొట్లు ఎప్పుడూ నిండుగా వుండేవి. మరి అవి ఇప్పుడున్నాయా? ఒక్క గింజలేదుమరి.

ఎక్కడికి పోయాయనుకున్నారు? మా అక్కచెల్లెళ్ల పెళ్లిళ్లుచేసి సాగనంపేసరికి మాకు తినడానికి తిండే లేకుండాపోయింది''

అలాగ వాళ్లమాటలు లోకంపోకడమీదా, ప్రజల పరిస్థితులమీదా సాగి, సాగి మళ్లీ మొదటికి వచ్చేవి. వీరయ్య మళ్లీ తన కళ్లద్దాల్ని ధరించి దూరంగా వున్న 'మాలన్న'ను పిలిచేడు.

''ఇటురా! మాలన్నా... ఇలా కూచో'' అంటూ దగ్గరగా చోటుచూపించి గుసగుసగా అన్నాడు

''చూడు మాలన్నా! 'కందా'కి మరెవరూ జాయింట్ లోను ఇచ్చేలా లేరు. ఇప్పుడు అతను ఎలాగో కొంత సొమ్ము దొరికితే చాలునన్నట్టున్నాడు. నువ్వు కానీ అతడికి సహాయం చేసినట్లయితే, నీకు లాభం వుండేలా నేను చూస్తాను. నీ పాతలోను వాయిదా కట్టేసి, కొత్త లోనుకు దరఖాస్తుపెట్టు. ఆ డబ్బు తీసుకో. నీకెలాగూ ఆ డబ్బు అవసరం లేదంటున్నావు కనుక, దాన్ని కందాకి అప్పుగా ఇవ్వు. నీకు అతనిచ్చే వడ్డీడబ్బు, బాంకు వాయిదాల్లో అతనిస్తాడు. నువ్వు వాయిదా కట్టెయ్యగా నీకు పాతికో, పరకో మిగులుతుంది. అతనికి నువ్విచ్చే డబ్బు వసూలు చేసి ఇచ్చే బాధ్యత నాది. దీన్లో నీకేం అనుమానం అక్కర్లేదు. ఏమంటావ్?''

మాలన్న ఈ ప్రతిపాదన గురించి క్షణాల్లో కూలంకషంగా ఆలోచన చేసేశాడు.

''ఒకవేళ అతను తీర్చలేకపోతే''

దెబ్బతిన్నట్టు చూశాడు వీరయ్య. ''నేను హామీ వుంటానన్నా కూడా... నీకు అనుమానమా? మాలన్నా నన్నే నమ్మలేవా?-''

అలాగ కిందామీదా చేసి మాలన్న తన ప్రతిపాదనని అంగీకరించేలా చేసుకున్నాడు వీరయ్య. వెంటనే మాలన్న ఆస్తిపాస్తులను ఇతర వివరాలను ఫారంమీద నింపడంలో నిమగ్నమైపోయేడు. తర్వాత దాన్ని బయటకు చదివి తన ట్రంకు పెట్టెలోంచి, ఇంక్‌పాడ్ బయటకు తీసి, మాలన్న ఎడమచేతి బొటనవేలిముద్రను ఆ ఫారంమీద వత్తించేడు. అలాగే తన పెట్టెలోంచి రెండువందల యాభైరూపాయలుతీసి మాలన్నకిచ్చేడు.

పాతబాకీలో జమచెయ్యమంటూ ఓమాట అన్నాడు. ''నేను నీకు డబ్బు ఇచ్చేనంటే, కాయితం రాయించుకుంటున్నానా? మాలన్నా? నిన్ను నమ్మేకదా''

''ఈ డబ్బు కట్టేసి వెంటనే ఈ లోను దరఖాస్తు వాళ్లకియ్యి''

''వాళ్లు ఇవ్వకపోతే?'' అడిగేడు మాలన్న.

''వాళ్లెవరు వద్దనటానికి? వెంటనే కాదనకుండా తీసుకుంటారు. నువ్వు షేర్‌హోల్డరువు. నీ లోను దరఖాస్తు తీసుకుతీరవలసిందే. వాళ్ళ తాత సొమ్మేం ఇవ్వక్కర్లేదు మాలన్నా. బై-లా స్పష్టంగా నీ హక్కులు చెపుతోంది'' అని ప్రోత్సాహమిచ్చి మరీ అతన్ని బాంకులోపలకి పంపేడు వీరయ్య.

ఇలా ఆ మర్రిచెట్టుకింద ప్రతిరోజూ అనేకరకాలుగా మెలికలువేసి, ముడులుపెట్టి ఒకరితో ఒకరికి అప్పులిప్పించి, బాంకునుంచి లోనులు పెట్టించి, అందరి దగ్గిరనుంచి తన కమీషన్ వసూలు చేసుకుంటూ బతుకుతెరువు లాగించేస్తున్నాడు వీరయ్య.

తన ఆదాయంకోసం తను పడుతున్న కష్టం ఏ ఉద్యోగస్తుడి కష్టానికీ తీసిపోదనీ, అయినా తగిన ప్రతిఫలం మాత్రం లభించటంలేదనీ, తన చుట్టూ అవసరార్థం చేరేవాళ్ల ముందెప్పుడూ వాపోతూవుంటాడు.

సాయంత్రం పడమటి సూర్యుడి కిరణాలు మెడమీదపడి చురుక్కుమనిపించేసరికి తన

సరంజామా అంతా పెట్టెలోకి సర్దేసి, పెట్టెకు తాళంవేసి లేస్తాడు. ఆ నాటికిక వీరయ్య ఆఫీసు మూసేశాడని అక్కడున్నవాళ్ళకి అర్థ మయిపోతుంది.



ముందుగదిలో వున్న బెంచీకింద తన పెట్టె వుంచేడు వీరయ్య.

ఆ చప్పుడు వినగానే వంటగదిలోంచి, బాణంలా రివ్వుమంటూ దూసుకొని వచ్చేడు అతని ఏకైకపుత్రుడు బాలూ.

"నాన్నా...!" సంతోషంగా తండ్రి చేయిపట్టుకుని గట్టిగా ఊపుతూ అడిగేడు. "నా కోసం ఇవేళ ఏంతెచ్చేవు నాన్నా?"

వీరయ్య వాణ్ణి పైకెత్తి భుజంమీద కూచోబెట్టుకున్నాడు.

"రేపు... నీకో కొత్త ఇంజను బుల్లిది కొంటానురా బాలూ"

"ఎంత 'బుల్లిది నాన్నా?"

వీరయ్య తన కుడిచేతి బొటనవేలి దగ్గరగా చూపుడువేలుంచి, "ఇంత చిన్నదిరా! బాలూ! చాలా?!" అడిగేడు.

వాడు ఎంతో ఆనందించి సంతోషంగా తల ఊపేడు. "పోయి. ఆడుకో" అంటూ వాడిని కిందకి దించేశాడు వీరయ్య. ఈ సన్నివేశం ప్రతిరోజు ఇలాగే వుంటుంది సుమారుగా. బాలూకి అన్నీ చిన్న చిన్న బొమ్మలే కావాలి. చిన్న రైలింజను, చిన్న టేబులు, చిన్న చిన్న ఆవులు. అన్నీ ఇలాంటివే.

బాలూను కిందకి దించేక తన భుజంమీద కండువా, చొక్కా విప్పి వంకెకు తగిలించేడు. గోడకు దగ్గరగా వేలాడుతున్న దండెంమీద నుంచి తువ్వాలు తీసుకుని గబగబా పెరట్లోకి నడిచేడు. పెరడు చిన్నదే. నాలుగైదు అరటిచెట్లు గుబురుగా పెరిగివున్నాయి. వాటి పెద్ద పెద్ద ఆకులు గాలికి ఊగుతూ చీకట్లో కూడా కనిపిస్తున్నాయి. అరటి చెట్ల దగ్గరగా రాతికట్టుడుతో వున్న గిలకబావి ఒకటివుంది. ఆకాశంలో ఇంకా చంద్రుడు రాలేదు. నక్షత్రాలు పారిజాతం పువ్వులు జల్లినట్టు నల్లటి ఆకాశంలో మిలమిల మెరుస్తున్నాయి.

నూతి దగ్గర వీరయ్య నిలుచున్నచోట బురదగా వుంది. వాళ్ల రెండిళ్ల వాడుక నీరు అక్కడినుంచే అరటిమొక్కలలోకి పోతుంది. వీరయ్య వాటాకి, తమ్ముడి వాటాకి పెరడు ఒక్కటే. నిజానికి అది ఒకటే ఇల్లు. అయితే అడ్డుగోడ ఒకటి. ఆ ఇంటిని చివరిదాకా వేరు చేస్తూ వుంది.

అసలు ఆ వీధిలో ఆ ఇంటికి ఒక ప్రత్యేకత ఆదినుంచీ వుంది. వీరయ్య తండ్రి ఒక్కడే మొదట అందరూ భయపడే, ఆ ఏకాంత ప్రదేశంలో తన ఇల్లు కట్టుకున్నాడు. ఇంచుమించు శ్మశానాన్ని తాకుతూ వుంటుంది వీళ్ల ఇంటిగోడ. శ్మశానంలో చితిమంటలు ఆ ఇంటి గోడలను కాంతివంతం చేస్తూవుంటాయి. తండ్రి చనిపోయేక అన్నదమ్ములిద్దరికీ, తోడికోడళ్లకీ, చివరికి వాళ్ల పిల్లలకీ కూడా ఒకరంటే ఒకరికి గిట్టకుండా అయిపోయింది. ఒకే ఇంట్లో ఒకరు పీల్చిన గాలి, ఇంకొకరు పీల్చడానికి కూడా చీదరించుకునే రోజులు వచ్చేసరికి, అన్నదమ్ములిద్దరూ తమ తండ్రి వదిలి వెళ్లిన ప్రతీదీ, సమానంగా పంచుకుని విడిపోయారు. ఆ విషయంలో కోర్టు వ్యవహారం కూడా తప్పలేదు. అయితే ఒక్కటే గిలక బావి వుండటంచేతా దాన్ని ముక్కలుచేసి పంచుకోవడం కుదరని పనికావటంవల్లా పంచుకోవటం వీలవలేదు. అది వీరయ్య వాటాలోకి రావటంచేత, అడ్డుగోడ పూర్తిగా కట్టి, తన అన్న కుటుంబం నీళ్లు లేక మలమలమాడేలా చేయాలని అతగాడు సంకల్పించేడు. కానీ ఊరివాళ్ల జోక్యంవలన, అతడు తన హక్కుని వదులుకుని, వాళ్లు కూడా వుమ్మడి హక్కుతో నీళ్లు తోడుకోవటానికి వీలుగా బావివరకు మాత్రమే రెండువైపులా గోడ కట్టించక తప్పలేదు. ప్రస్తుతం ఆ

నుయ్యి ఒక్కటే వాళ్లకు తెరిచివున్న సరిహద్దు.

బకెట్టుకోసం చుట్టూ చూశాడు వీరయ్య. అదెక్కడా కన్పించలేదు.

''బాలూ! బకెట్టు ఎక్కడుందిరా?'' కేకేశాడు. అతను ఇంటికి వచ్చినప్పటినుంచి వీలయినంతవరకూ కొడుకుని వదిలివుండడు. పెళ్లైన పన్నెండేళ్లకు లేక లేక కలిగినవాడంటే అతనికి చాలా ఆపేక్ష.

కొడుకునుంచి సమాధానం రాకపోయేసరికి వాడున్నవైపు చూశాడు. అక్కడ వాడు దీపం దగ్గిర చేరి ఒకకాగితం ముక్కని చిమ్నీలోంచి లోపలికి దూరుస్తున్నాడు. అంతలోనే అది భగ్గుమని మండింది. బెదిరిపోయి చెయ్యి తీసేశాడు. అది కాలి బూడిదైపోయింతర్వాత, చిమ్నీ పైవుండే పొగను ఆపుచేసే మూతను పట్టుకున్నాడు. వీరయ్య ఆగమని కేకవేసేలోపునే వాడు దాన్ని ముట్టుకోవడం, కీచ్‌మని అరవటం, వీరయ్య వాడి పక్కకి చేరటం క్షణాల వ్యవధిలో జరిగిపోయింది. బాలూ కేక విని పొరుగింటికిపోయి అప్పుడే వస్తున్న మీనాక్షి ఒక్క గెంతులో లోపలకి వచ్చిపడింది. ''ఏమిటి? ఏమిటి? ఏమైంది?'' అని పెద్దగా కేకలువేస్తూ. వీరయ్య చికాకుపడిపోయేడు.

''ఏం కొంపలు మునిగిపోయేయని అలా కేకలు వేస్తావు? పక్కవాళ్లు వింటే ఏమనుకుంటారు?''

''ఓహోఁ... పక్కవాళ్లంటే ఎవరూ? మీ మరదలా? ఆఁ వాళ్ల బడాయి భాగోతం ఎవరికి తెలీదు కనుక...'' అంటూ ఏవో బాణాలు వినరబోయిందిగానీ, బాలూ తన కాలిన వేళ్ల వంక ఎవరూ చూడకపోయేసరికి బిగ్గరగా ఏడవటం మొదలుపెట్టేడు. ఆ ఏడుపు వినగానే తల్లి చప్పున కుర్రాడిని, భర్త దగ్గిర్నుంచి లాక్కుంది. వాడి ఏడుపు ఆపటానికి లాలిస్తూ గట్టిగా తనకేసి అదుముకుంది.

ఊపిరందక వాడు కొత్త స్వరాలతో ఏడవటం ప్రారంభించేడు.

వీరయ్య వాణ్ణి తన దగ్గిరకు లాక్కున్నాడు.

''తొందరగా ఆయింట్‌మెంట్ తీసుకురా! ఏదీ వుండాల్సినచోట వుంచవుకదా''

''గట్టిగా కేకవెయ్యకండి'' అంటూనే ఆమె అలమరా దగ్గిరికి వెళ్లి గబగబ ఆయింట్‌మెంట్ కోసం వెతకటం ప్రారంభించింది.

''చెట్టంత మగాడు ఇంట్లో వుండేం లాభం? వాడు దెబ్బలు తగుల్చుకోకుండా చూడటం చేతకాకపోయేక?'' అని గొణుక్కుంది.

''నీకేం తెలుసని మాట్లాడుతున్నావే? నేను బావి దగ్గరకు స్నానానికని వెళ్లేనుగానీ, నేను దగ్గిరేవుంటే వాడి వళ్లు కాలనిస్తానా?'' నోటికొచ్చినట్టు పేలకు'' కోపం ఆపుకోలేకపోయేడతను.

''ఆఁ... ఊళ్లో అందరూ కుళాయినీళ్లు తాగుతూంటే, మనకి మాత్రం బావినీళ్లే గతి'' తన దాడిని మరో వైపునుంచి ప్రారంభించిందామె.

''సర్లే... సర్లే...'' అంటూ సంభాషణని తుంచేస్తూ, తన దృష్టిని వెంటనే కొడుకువేపు మళ్లించేడు.

''ఎప్పుడూ నిప్పు దగ్గిరకి వెళ్లకు. తెలిసిందికదా!'' హెచ్చరించేడు.

తలూపుతూ ''నాకు రేపు చిన్న ఏనుగు కొను నాన్నా!'' అన్నాడు వాడు.

వాడి బుగ్గలింకా కన్నీళ్లతో తడిగానే వున్నాయి.

వీరయ్య భార్య చిన్న గాజుసీసాలో వున్న నల్లటి ఆయింట్‌మెంటును, తన ఒత్తులకోసం దాచుకున్న దూదినితీసి కుర్రాడి వేలికి రాసింది.

అది మండిందో ఏమో, మళ్లీ తారాస్థాయిలో ఏడవటం మొదలుపెట్టేడు. ఈసారి వాడు అడిగాడు...

''నాకో పెద్ద పిప్పరమెంటు ఇప్పుడే కొనూ'' అని.

★ ★ ★

ఆ రాత్రి వీధిలో చప్పుళ్లన్నీ సద్దుమణిగేక తమ మధ్య ఉన్న బాలూ నిద్రపోతుండగా, వాడికి అవతలపక్క పడుకున్న భార్యతో అన్నాడు వీరయ్య.

''పాపం! వెర్రివెధవ. నేను వాడిచేయి కాలకుండా చూడగలిగేవాణ్ణే అయితే వాడేం చేస్తాడో చూద్దామని ఊరికే చూస్తుండిపోవడంవల్ల బాధపడాల్సివచ్చింది వాడు''

'హుఁమ్మని' మూల్గిందామె. ''నేను ముందే

అన్నాను. మీరు ఏం పట్టించుకోరు. కనకనే వాడి వేళ్లు కాలింది. రేపింకేదైనా జరగొచ్చు. వాడొట్టి అల్లరికుంక... మీరు మీరు''

ఆమెకి సరైన పదం దొరక్క పూర్తిచేయలేదు. కాసేపు గడిచేక మళ్లీ తనే అంది.

''వాడితో మధ్యాహ్నాలు వేగలేకపోతున్నాను. రోడ్డుమీదకి పారిపోతుంటాడు. ఒక్కనిమిషం కూడా నాకు తీరికనేది లేకుండాపోతోంది వీడివల్ల''

''ఎందుకలా తిట్టుకుంటావు. చిన్నవాడు! వాడికేం తెలుస్తుంది''

''ఒకసారి ఇంటి దగ్గిరుండి చూస్తే మీకే తెలుస్తుంది. ఏదో సాయంత్రం వేళొచ్చి కాసేపు ముద్దాడితే ఏం తెలుస్తుంది. వాడికి నిద్రొచ్చే వేళయితే-''

''తప్పకుండా అలాగే ఏదీ నా బదులు నువ్వెళ్లి ఊర్లో వాళ్లందరికీ అప్పులు ఇప్పించగలిగితే... నా కంతకన్న సంతోషం మరేముంటుందీ!''

★ ★ ★

ఆ మర్నాడు పొద్దున్నుంచీ బాలూ, తల్లిదండ్రులకు, తన వేళ్లు కాలినందుకు కఠినశిక్ష వేసేశాడు. వాడెవర్నీ తన దగ్గిరకి రానివ్వలేదు. వేలు పైకెత్తి పట్టుకునేవున్నాడు. చొక్కా మార్చటానికి గానీ, అన్నం తినడానికిగానీ, కాలు కిందమోపి నడవటానికిగానీ, సుతరామూ అంగీకరించలేదు. తండ్రో, తల్లో, వాణ్ణి ఎత్తుకు మోయవలసివచ్చింది.

వీరయ్యా కొడుకువేలు పరీక్షించేడు.

''తగ్గిపోయిందిరా! బాగానే వుందిగా'' అన్నాడు.

''ఏంకాదు...'' ఉక్రోషంగా అరిచేడు వాడు.

''నా చేతికి పెద్ద దెబ్బ తగిలింది. నాకో పిప్పరమెంటియ్యి''

వీరయ్యకి పొద్దున్నంతా వాడి వ్రేలుకి మందుపూత పుయ్యడంలో, వాడి నోటినిండా పిప్పరమెంట్లు నింపడంతోనే సరిపోయింది.

''వాడికన్ని పిప్పరమెంట్లు ఇవ్వకండి. జబ్బు చేస్తుంది'' మీనాక్షి మందలించింది.

''ఐతే వాణ్ణి నువ్వే చూసుకో. నావల్ల కాదు'' అన్నాడతను.

''నేను అమ్మ దగ్గిరికిపోను. నీతోనే వుంటాను'' రాగాలు తీశాడు బాలూ.

''వీరయ్యకి పొద్దున్న చేయాల్సిన కొన్ని తప్పనిసరి ఇంటిపనులు వుంటాయి. దుకాణానికిపోయి పచారీ సరుకులు తేవడమో, కట్టెపేళ్లు చీరడమో తప్పదు. లేకపోతే తన సరంజామా వున్న ట్రంకుపెట్టె ముందేసుకుని అందులో వున్న ఎర్రటి అట్టవేసిన చిరాపు స్తకం పేజీలు తిప్పుతూ తన జ్ఞాపకాలను పరిపుష్టం చేసుకుంటూవుంటాడు.

ఈరోజు అవేవీ చేయనివ్వకుండా బాలూ అడ్డుపడ్డాడు.

సాధారణంగా తను బయల్దేరే టైముకన్నా ఆలస్యంగా బయల్దేరాడారోజు. మధ్యాహ్నమయింది ఇల్లు కదిలేసరికి. అదీ బాలూ పెరట్లో నీళ్లబకెట్లో ఆడుకుంటూ మైమరిచివున్నపుడు మాత్రమే బయటికి జారుకోగలిగేడు.

బకెట్లో నీళ్లన్నీ వొలికిపోయేక బాలు ఈ లోకంలోకి వచ్చి ఇల్లంతా చూసి, తండ్రి కనిపించకపోయేసరికి పెట్టిన కేకకి, అవతలి వాటావాళ్లు కూడా జడిసిపోయేరు.

''వయస్సు వాలిపోతూవుండే పుట్టే పిల్లలు అలాగే వుంటారు. గారం ఎక్కువై గాడిదల్లా తయారవుతారు'' అంది పదిమందిని కన్న ఓ తల్లి ఆ కేకలు విని.

★ ★ ★

తనముందున్న నోట్ బుక్‌మీద నీడవడేసరికి వీరయ్యా తలపైకెత్తి చూశాడు. యూనిఫారం వున్న వాడొకడు కనిపించేడు. అతడ్ని వీరయ్యా ఎరుగును. 'అరుల్‌దాస్' అని కిరస్తానీ మతానికి చెందినవాడు. కోపరేటివ్ బాంకులో హెడ్ ఎటెండర్‌గా పనిచేస్తుంటాడు. అతడికళ్ల చుట్టూ ముడతలుంటాయి. సోమరితనం కొట్టొచ్చినట్టు కనపడుతుంది ఆ కళ్ళల్లో. మీసాలు తెల్లగా పండిపోయేయి.

వీరయ్యా మరోమారు అతనివంక చూసి ఆలోచనలో పడ్డాడు. వీడెందుకు వచ్చినట్టు... శత్రువుగానా, మిత్రుడిగానా!

అతనికి తెలును ఆ బేంకులో పనిచేసేవాళ్ళెవరూ అతన్ని మిత్రుడుగా చూడటంలేదని. కాసేపు తటపటాయించి అన్నాడు

''కూర్చోవోయ్ అరుల్‌దాస్!''

అరుల్‌దాస్ తన భుజాలమీంచి వెనక్కి ఆఫీసువైపు చూసేడు.

''నేను నీతో ముచ్చట్లాడుతూ కూచుంటే వూరుకోడయ్యా మా దొర. అంటే తెలుసుకదా! మా సెక్రటరీ... ఆయన ఎందుకోగాని నిన్ను పిలవమని పంపేడు''

''నన్నా!'' వీరయ్య తన చెవుల్ని నమ్మలేక పోతూ అడిగేడు.

''నన్ను సెక్రటరీ రమ్మన్నాడా? నాతో ఏంపన బ్బా ఆయనకి?''

''నాకదంతా తెలీదు. నాతో ఒకటే చెప్పేడు. 'ఫో... పోయి ఆ వీరయ్యనోసారి రమ్మను' అని. వస్తావా? రావా?''

వీరయ్యకి అతనన్నతీరుకి కోపం వచ్చింది.

''వెళ్ళి చెప్పు. నేనేమీ వాళ్ళు జీతమిస్తు న్న...'' అని ఆగిపోయేడు.

'నౌకర్నికాను' అందామనుకున్నాడు. కానీ తను మాట్లాడుతున్నది అటువంటి నౌకరుతోనే అన్న సంగతి జ్ఞాపకం వచ్చింది. అతను బాధపడతాడేమోనని మాట కొంచెం మార్చే డు.

''వాళ్ళు పిలిచినప్పుడల్లా బయల్దేరి రావ టానికి నాకేమన్నా జీతమిస్తున్నారటయ్యా అరుల్‌దాస్!''

''నాకేం తెలీదన్నానుకదా! ఆయన నీకు చెప్పమన్నది చెప్పేను. సెక్రటరీ మాట దాట లేంకదా! నెలకి నాలుగువేల జీతగాడు. ను వ్వూ నేనూ పదేళ్ళు కష్టపడ్డా అంత డబ్బు ఒక్కసారి లెక్కపెట్టలేం''

వీరయ్యలో రక్తం వుడుకెత్తింది. జీవితంలో అతనెదుర్కొన్న కష్టాలు, నష్టాలు వరసగా కళ్ళ ముందు గిర్రున తిరిగేయి. ఆస్తి పంపకంలో అన్న చేసిన దగా, జీవితంలో నిలదొక్కుకోడాని కి తను పడుతోన్న ఇబ్బందులూ అతడిలో ఆవేశం కలిగించేయి. తనకి డబ్బు లేకపోవ డంవల్లే ఈ ప్రపంచం తనని నీచంగా చూ స్తోందన్న సత్యం అతను భరించలేకపోతున్నా డు. కోపం ఆపుకుంటూ నిదానంగా అరుల్ దాస్‌కి బదులుచెప్పేడు

''చూడు అరుల్‌దాస్! నీ సంగతేమో నాకు తెలీదు. నువ్వు చెప్పింది నీకు వర్తిస్తుందికానీ నా సంగతి నువ్వేం చూశావు. నీ జీవితకాలంలో నువ్వేనాడూ వెయ్యి రూపాయలు కళ్ళజూడక పోయినా, నేనుమాత్రం అతి తక్కువకాలంలో అలాటివి చాలా చూస్తాను. ఏమో! ఎవరికి తెలుసు. మీ సెక్రటరీ నా కాళ్ళ దగ్గిరకి వచ్చేరోజు దగ్గరలోనే వుందేమో...''

కొన్ని నిముషాలు పట్టింది అరుల్‌దాస్‌కి ఆ మాటలు అర్థం కావడానికి. ఆ తర్వాత అతను నవ్వటం ప్రారంభించాడు. కళ్ళమ్మట నీళ్ళు కారడం ప్రారంభించాయి.

''నిజం! ఈ బాంకులో ఇరవై తొమ్మిది సంవత్సరాలుగా పనిచేస్తున్నాను కానీ, ఇలాటి వింతమాట ఈనాటివరకూ వినలేదయ్యా వీర య్యా! సరే... సరే...''

మళ్ళీ నవ్వు వచ్చిందతనికి. అలాగే వెనక్కి తిరిగేడు.

దూరమవుతున్న అతనివంక నిస్సహా యంగా చూశాడు వీరయ్య. తల కిందకి దించి తనవంక ఒకసారి చూసుకున్నాడు. నీరుకావి రంగు పంచె, కుక్కనాలికలాగా వేలాడుతున్న కాలర్, మొహంలో వికారంగా కనిపిస్తున్న కళ్ళ ద్దాలు అతనిలో అసంతృప్తిని మరింత పెంచాయి.

''ఈ కళ్ళద్దాలు లేకపోతే బాగుండేది. మరీ అసహ్యంగా ఉన్నాయి. నాకేగనుక బంగారం ఫ్రేము కళ్ళద్దాలుంటే మరికొంచెం గౌరవంగా చూస్తారేమో వీళ్ళు. ఈ సెక్రటరీ నన్ను రమ్మని హుకుం చేయగలడా?''

''ఇటు చూడు అరుల్‌దాస్!'' గొంతెత్తి పిలి చాడు.

వెలిగిపోతున్న మొహంతో అరుల్‌దాస్ ఇటు తిరిగేడు.

''మీ సెక్రటరీతో చెప్పు. అతను ఒట్టి సెక్రట రీమాత్రమే. నేనొక బాంకు ప్రొప్రయిటర్ని. అతనికి నాతో ఏదైనా వ్యవహారముంటే నా దగ్గిరకు వచ్చి మాట్లాడమను''

మరింతగా నవ్వుతూ అడిగాడు అరుల్ దాస్ ''ఈ మాటల్నే చెప్పమంటావా?''

''ఆహాఁ! అక్షరంవిడవకుండాచెప్పు. అన్న ట్టు మరో సంగతి. నిన్నెప్పుడన్నా వాళ్ళు మెడ బట్టి బయటకు గెంటితే నాదగ్గిరకు రా!

వుద్యోగం ఇస్తాను. పాపం... చాలా నిజాయితీగా పనిచేయగలవు కదా!''

అతను ఇంకేం మాట్లాడే అవకాశం లేకుండా వీరయ్యా చుట్టూ జనం చేరడం ప్రారంభమయ్యింది. అరుల్‌దాస్ ఇంకాసేపు అక్కడే తారట్లాడేడుగానీ వీరయ్య తనపనిలో నిమగ్నమవుతూ,

''మంచిది. నువ్వెళ్ళిరా'' అని సెలవిచ్చి పంపేశాడతన్ని.

''చూడు వీరయ్యా! ఆ అరుల్‌దాస్‌తో కొంచెం జాగ్రత్తగా వుండు. వాడు మంచివాడు కాదు'' సలహా యిచ్చాడో ముసిలిరైతు.

''నేనంతకంటే మంచివాణ్ణి కాదు'' తయారుగా అన్నాడు వీరయ్య.

''నేనందుకనలేదు. ఆ సెక్రటరీ వీళ్ళు చెప్పేది వింటాడు. ఒక్క ఫారం కావాలని వెళితే వీడు అర్ధరూపాయి వసూలు చేస్తాడు. అదేమన్నా గవర్నమెంటు రూలా వీరయ్యా!'' ఆ రైతు అమాయకంగా అడిగాడు.

''మీతో వేగలేకపోతున్నాను. ఇంత మట్టిబుర్రలయితే ఎలా? మీలో రవ్వంత ధైర్యంలేదే? మీరు ఎంతకాలం షేర్ హోల్డర్‌లుగా వుంటారో, అంతకాలం మీరేనయ్యా యజమానులు. ఆ బాంకులోవాళ్ళు మీకోసం వున్న నౌకర్లుమాత్రమే''

''నిజమా?'' ఆశ్చర్యపోయాడు అతగాడు. ఇంకా అతనికి వీరయ్య మాటల్లో నమ్మకం కుదరలేదు. ఆ గుంపంతా ఒకరిమొహం ఒకరు వింతగా చూసుకున్నారు. అరుల్‌దాస్‌మీద కోపంతో వీరయ్య అలా అంటున్నాడేమోనన్న భావం వాళ్ళలో కలిగింది. వాళ్ళల్లో దుప్పటి కప్పుకుని, పెద్ద తలపాగా చుట్టుకున్నవాడొకడున్నాడు. ఎర్ర నిక్కరు తొడుక్కున్నాడు. కాళ్ళకి చెప్పుల్లేవు. అతనన్నాడు, ''నువ్వు చెప్పినట్టు మేం యజమానులం అయితే మా మాట ఎవరు వింటున్నారు? బాంకులోకి అడుగు పెట్టాక వాళ్ళు చెప్పినట్టు చేసి వాళ్ళు అడిగినంత ఇస్తేగానీ మాకు డబ్బు రాదే!''

''ఎవరి డబ్బయ్యా వాళ్ళు నీకిచ్చేది? నీడబ్బు నీకెవడికోసం ఇస్తారు?''

''అదంతా మనకెందుకులే వీరయ్యా! ఇతర్లగురించి మనకేల? మనపని మనది'' వీరయ్య ఆవేశం తగ్గించాలని మాటమార్చేశాడతను.

''నిజమే... నిజమే'' వంతపాడేరు మిగిలిన వాళ్ళు. వాళ్ళ ప్రోత్సాహంతో మరికాస్త వుత్సాహం తెచ్చుకున్నాడు ఆ రైతు.

''అనవసరంగా ఇంకోళ్ళ గురించి మాట్లాడటమెందుకు? వాళ్ళు వింటే గనక-''

వీరయ్యకి కళ్ళనిండా కోపం పొంగుకుంటూ వచ్చింది. ''ముందు పొండిక్కణ్ణుంచి'' పెద్దగా అరిచేడు.

''ఎవడు తనని నమ్మడో... ఎవడికి నిజం అక్కర్లేదో... వాడితో నాకు పనిలేదు. మధ్యాహ్నం ఎండప్పుడు నిండా దుప్పటి కప్పుకున్నవాడు ఇంకెలా మాట్లాడతాడు. అన్ని మడతల తలపాగా నెత్తిమీదుండేవాడి బుర్రలో ఇంకేముంటుంది?''

వీరయ్యా కోపానికి జడిసిపోయేడు వాడు. నెమ్మదిగా సణిగేడు, ''నేను మిమ్మల్నానాలని రాలేదయ్యా! మీతో పనుండి వచ్చి మిమ్మల్నంటానా?''

''సరే... సరే... అయిందేదో అయింది. నీకేమైనా పనుందా? చెప్పు...! లేకపోతే నడువ్ ఇక్కణ్నుంచి. సాయంత్రంలోగా ఇంకా చాలా మంది పని చూడాల్సి వుంది. నువ్వొక్కడివే లేవు''

''నాక్కొంచెం లోను ఇప్పించాలి వీరయ్యా!'' అంటూ మొదలుపెట్టాడు ఆ రైతు. ''పాతలోను బాకీ ఎంత కట్టానో చూసి చెప్పు''

''వెళ్ళి అరుల్‌దాస్‌గాణ్ణి అడగలేకపోయేవా?'' ఎకసెక్కంగా అడిగేడు వీరయ్య.

''వాళ్ళ సంగతి నీకు తెలీందేముంది వీరయ్యా! అడిగితే కసిరికొడతారనేకదా! నీదగ్గిరకి ముందొచ్చేది. ఈ ఊళ్ళో అందర్నీ వదిలి నీదగ్గిరకే ఎందుకొస్తాం వీరయ్యా! నువ్వు మమ్మల్నాదుకుంటావనేగా!'' అనునయంగా అన్నాడతను.

వీరయ్య శాంతించేడు.

''తెలుసుకదా! ఇంక అసలువిషయంలోకి రా!'' అంటూ చుట్టుపక్కలవున్నవాళ్ళవంక ప్రశ్నార్థకంగా చూసేసరికి వాళ్ళు గొర్రెల్లా తల లూపేరు.



తర్వాత తల ఎత్తకుండా దీక్షగా తన పనిలో మునిగిపోయాడు వీరయ్య. ఆరోజు పని ఎక్కువ అయింది అతనికి. దరఖాస్తులు నింపడం, అగ్రిమెంటులు రాయించడం, ఒకటిరెండు వేరే విషయాలకు సంబంధించిన పిటిషన్లు రాయడం త్వరత్వరగా సాగించేడు. మధ్యమధ్య క్లయింట్ల వివరాలడగటంకోసం, వాళ్ళకి వివరించడంకోసం మాత్రమే తల పైకెత్తగలిగాడని చెప్పాలి.

మెడమీద పడమటి సూర్యునినుండి జాలువారిన కిరణం తాకగానే సమయం స్ఫురణకివచ్చి ముందుకి దృష్టి సారించేసరికి, చెట్టునీడ పొడుగ్గా సాగి బాంకు గేటుదగ్గిరకు పడుతోంది.

దుకాణం కట్టెయ్యడం మొదలుపెట్టేడు వీరయ్య. కొన్ని అంకెలు వేసిన కాగితాలు నీటుగా మడతలుపెట్టి పెట్టెలో తెల్లకాగితాల పక్కన వుంచేడు. ఎకౌంట్ పుస్తకంలో లెక్కలు ఒకసారి చూసుకున్నాడు. డబ్బు, ఇతర రశీదులూ లెక్కపెట్టుకున్నాడు. అన్నీ ట్రంకుపెట్టెలో చక్కగా సర్ది, పైన కొన్ని లోను దరఖాస్తు ఫారాలు నలగకుండా వుండటానికిగాను పెట్టేడు. పెట్టె మూలలో ఇంకుసీసా, దానిపక్కనే ఎర్రసిరా, పెన్నూ పెట్టాడు. అన్నీ రోజూలాగానే

యథాస్థానంలో అమరిపోయేయి. పెట్టెలో తన వస్తువులు వెదుక్కోవటం చిరాకు అతనికి. కళ్ళు మూసుకుని పెట్టి తెరిచి ఏ వస్తువు కావాలన్నా తడుముకోకుండా తీయగలడతను. ఈ దినం అరుల్‌దాస్‌వల్ల అతని మూడ్ పాడయ్యింది. ఎలాగైనా అరుల్‌దాస్‌కి గుణపాఠం చెపితేనేగాని అతని కోపం చల్లారదు...



ఆ ఆలోచనల్లో వుంటుండగా, దగ్గరవుతున్న అడుగుల చప్పుడు వినిపించి అటు తలతిప్పి చూశాడు.

గోధుమరంగు సూటు వేసుకున్న వ్యక్తొకడు అతనిముందు ఆగేడు. రెండుచేతులూ పాంటు జేబుల్లో దూర్చి పెట్టుకున్నాడు. నల్లకళ్ళద్దాలతో చాలా దర్జాగా వున్నాడతను. అతనికి కొంతదూరంలో, అతి వినయం ప్రదర్శిస్తూ అరుల్‌దాస్ నిలబడి వున్నాడు.

'ఇపుడే దిగిన లండన్‌దొరలా దర్జా వెలిగిస్తున్నాడు' అని లోలోపలే అనుకున్నాడు వీరయ్య. అతనితో పోల్చి చూసుకుంటే ఆవేళ రెండోసారిగా మళ్ళీ తనమీద తనకే చిరాకు కలిగింది. 'ఈ మనిషి చూస్తే అసాధ్యుడిలా వున్నాడు. నేను అరుల్‌దాస్‌తో కొంచెం జాగ్రత్తగా మాట్లాడవలసింది. వాడేభాష్యం వెలిగించాడో... ఏమిటో ఖర్మ' అని మధనపడ్డాడు కాసేపు.

అరుల్‌దాస్‌వంక చూసేసరికి వాడి కళ్ళల్లో కొంటెతనం కనిపించింది. ధైర్యాన్ని కూడదీసుకున్నాడు వీరయ్య. 'నేనేం చిన్నపిల్లాణ్ణి కాదుగా! వీళ్ళు నన్నేం చేస్తారు? అదీ చూస్తాను' అని మనసు దిటవు చేసుకున్నాడు.

పెట్టెలో కాగితాల్ని దగ్గిరగా అదిమిపెట్టి, మూత వేయబోయాడు లేవడానికి ముందుగా. ఇంతలో ఆ వ్యక్తి హఠాత్తుగా ముందుకు వొంగి వీరయ్య పెట్టెలోంచి గుప్పెడు కాగితాల్ని బయటకు తీసేడు.

గట్టిగా వూపుతూ ఆ కాగితాల్ని వీరయ్య మొహంముందు ఆడించి "ఇవి మా బాంకు ఫారాలు... నీకెలా వచ్చాయి?" అన్నాడు.

వీరయ్య ఒక్కనిమిషంపాటు నోట మాట రాక వుండిపోయేడు. వెంటనే తేరుకుని అసహనాన్ని అణచుకుంటూ అన్నాడు,

"వాటిని తీసిన దగ్గిరే పెట్టు. నా పెట్టెలోంచి కాగితాలు తియ్యడానికి నువ్వెవరు? చూడబోతే చదువుకున్నవాడిలా వున్నావు? ఆమాత్రం తెలీదా?" తన ఆవేశంలో అతనికి వళ్ళు తెలీలేదు.

అరుల్‌దాస్ ఒక్కడుగు ముందుకేసి తర్జనితో బెదిరిస్తూ అన్నాడు "జాగ్రత్తగా మాట్లాడు. ఆయన మా బాంకు సెక్రటరీ. తలచుకుంటే క్షణాలమీద నిన్ను పోలీసులకు అప్పజెప్పగలరు. మాట్లాడేముందు కాస్త నోరు అదుపులో వుంచుకో... ఆఁ"

పులిలా గర్జించేడు వీరయ్య.

"నోటికొచ్చింది పేలకు అరుల్‌దాస్. నువ్వేదో నాగుపామునుకొని లేని పడగ ఊపుతున్నట్టున్నావు. పనికిమాలిన వానపామువన్న సంగతి నాకు తెలుసు. మరొక్క మాట మాట్లాడితే, నీ తలా, తోకా కత్తిరించి పారేస్తాను. నోర్మూసుకుని అవతలికి ఫో"

ఆ ధాటికి జడిసి అరుల్‌దాస్ కొంచెం వెనక్కి తగ్గేడు. కానీ వాడూ వెంటనే వదలదలచుకోలేదు. మళ్ళీ మొదలుపెట్టేడు.

"ఆయన మా సెక్రటరీ"

"నువ్వు చెప్పక్కర్లేదు. ఆ మొహం చూస్తే తెలుస్తోంది. ఏం అతనేం మాట్లడలేడా? నువ్వు తప్పుకో. పైసాకి ఠికాణాలేని నువ్వు నన్ను జడిపించాలనుకుంటున్నావా? నీకేమైనా పాత పేంటో, చొక్కాయో కావాలంటే సాయంత్రం కనిపించు. పడేస్తాను. ఇంక దయచెయ్యి"

ఈ తగువంతా తనకేం సంబంధం లేనట్టు ఆ సెక్రటరీ చూస్తూ నిలుచున్నాడు. అరుల్‌దాస్ ఖిన్నుడైపోయేడు. ఏదో అందామని నోరు తెరవబోయేసరికి సెక్రటరీ అతన్ని "నువ్వు ఫో" అని తరిమేశాడు. విధిలేక తప్పుకున్నాడు అరుల్‌దాస్. వీరయ్యకు ఏదో సాధించిన తృప్తి కలిగింది. తనముందున్న సెక్రటరీవంక తిరిగేడు.

"సెక్రటరీ నా కాగితాలు పెట్టెలో పెట్టెయ్యి. లేదా నేనే పోలీసులకు కంప్లయింటు ఇవ్వాల్సి వుంటుంది"

"అలాగే... నేనూ అదేపని చేద్దామనుకుంటున్నాను. మా ఆఫీసు కాగితాలు నీదగ్గిరెందుకున్నాయో తేల్చుకోవటానికి"

"ఇవి... నావి... కావు. మీ షేర్ హోల్డర్లవి" తడబడ్డాడు కొంచెం.

"నువ్వు షేర్‌హోల్డర్‌వా?"

"అంతకన్నా ఎక్కువే"

"అట్టే వాగకు. అబద్ధాలాడితే చిక్కుల్లో ఇరుక్కుంటావు. నీమీద నాకు ఫిర్యాదులు అందేయి. ఆఖరుసారి చెప్తున్నాను. మళ్ళీ నువ్వి

క్కడ కనిపిస్తే నువ్వు ఇంటికికాదు పోయేది. జైలుకి. ఆ సంగతి తెలుసుకో. వెళ్ళు'' అరుల్ దాస్‌ని రమ్మని సైగచేసి ఆ దరఖాస్తు కాగితాలు అతనిచేతికందించాడు సెక్రటరీ. నంబరంగా అందుకున్నాడతను. మరొక్కక్షణం అక్కడ నిలవకుండా గిరుక్కున వెనక్కి తిరిగి త్వరత్వరగా బాంకు బిల్డింగ్ దగ్గరికి నడిచేడు ఆ సెక్రటరీ.



తన సామాన్లు చేతబుచ్చుకుని ఇంటిదారి పట్టేడు వీరయ్య. చంకలో పెట్టెతో, తలనిండా ఆలోచనలతో బజారు రోడ్డులోకి అడుగుపెట్టాడు. రీగల్ హెయిర్ కటింగ్ సెలూన్ ముందున్న నిలువుటద్దం దగ్గిర కాసేపు నిలబడి తన్ను తాను పరీక్షగా చూసుకున్నాడు. ఇంకా అసహ్యంగా తన మొహాన వున్న కళ్ళద్దాల్ని గబగబా తీసి, జేబులో పెట్టేసుకున్నాడు. మరోసారి తన ప్రతిబింబాన్ని చూసేసరికి నిరాశకలిగింది. 'రోడ్డుపక్క క్షవరాలు చేసే మంగలిలా వుంది నా వాలకం' అనుకున్నాడు. 'చంకలో వున్న పెట్టె చూసి ఎవరైనా గడ్డం గీయమని పిలిచినా ఆశ్చర్యంలేదు. ఆ సెక్రటరీగాడు అందుకే అలా అనగలిగేడు. నేనేగాని వాడిలా వుంటే నా పెట్టిలోంచి కాయితాలు తీయగలడా? నేను వాడిలా వుండలేను. నా అవతారం రోడ్డుపక్క మంగలిలాగే వుంటుంది. నా బతుకంతా ఆ బైతుగాళ్ళతో గడిచిపోతోంది'

తనపట్లా, తన జీవితంపట్లా రోత కల్గింది అతనికి.

వెనకనుండి సైకిల్ బెల్ వినిపించగానే రోడ్డుపక్కకి నడిచేడు. అతనికి జీవితం నిస్సారంగా అనిపించింది. న్యూనతాభావంతో తల కిందికి వాలిపోయింది. ఇద్దరు స్టూడెంటు కుర్రాళ్ళు 'ఆనందభవన్'లోంచి నవ్వుకుంటూ బయటకి వచ్చారు. వాళ్ళ నోళ్ళు తాంబూలంతో ఎర్రగా వున్నాయి.

వాళ్ళు నన్ను చూసే నవ్వుతున్నారు. వాళ్ళ రూమ్‌కి వచ్చి క్షవరం చేయమంటారేమో అనుకున్నాడు వీరయ్య వాళ్ళు తనవంకే తదేకంగా చూస్తున్నట్టనిపించి.

బజారు పడమటి చివరన వున్న వి.ఎన్.స్టోర్ యజమాని దుకాణం బయట నిలబడి వున్నాడు ఏదో సర్దుతూ. 'వీడు తప్పకుండా నా జేబులో చెయ్యిపెట్టి కళ్ళజోడైనా లాక్కుంటాడు. లేకపోతే గడ్డమైనా గీసిపొమ్మంటూ అవహేళన చేసి తీరతాడు గానీ విడిచిపెట్టడు అనుకుంటూ పక్కనేవున్న కబీరు వీధిలోకి తోవమార్చేడు.

చేతికింద పెట్టుకున్న ఆ రేకుపెట్టి అతనికి పెద్ద భారంగా తోచింది. బయటికి విసిరిపారేద్దామని ఎంతో బలంగా అనిపిస్తోంది. కానీ తన జీవితాధారం అదేనన్న పరిజ్ఞానం అతన్ని ఆ పని చేయకుండా ఆపుతోంది. ఇరుగ్గా వున్న కబీరు వీధిలో ఇళ్ళన్నీ కిక్కిరిసిపోయినట్లుగా వున్నాయి. ఆ ఇళ్ళల్లోవాళ్ళంతా 'ఏయ్ మంగలీ! పొద్దున్నే రా! మేం స్నానాలకి పోయే ముందే రావాలి సుమా!' అని పిలుస్తున్నట్లనిపించి, త్వరత్వరగా అడుగులు వేసేడు. వినాయక వీధిలోకి అడుగుపెడుతూనే పరుగెడుతున్నట్టుగా నడిచి, గబగబ మెట్లెక్కి ఇంట్లోకి ప్రవేశిస్తూనే పెట్టెని బెంచీకిందకి విసిరేసేడు. పెరట్లో అతని భార్య బాలూకి స్నానం చేయిస్తోంది. తండ్రి వచ్చినట్లు గుర్తించి కొడుకు సంతోషంగా కేకలు పెట్టేడు. తల్లి వాడు రాబోతుంటే ఆపి తువ్వాలుతో తుడుస్తోంది.

''ఏమైందేం? ఇంత తొందరగా వచ్చేరీ వేళ?'' అడిగిందామె భర్తని విచిత్రంగా చూసి.

''తొందరగానా? ఏం? నాకు బుద్ధిపుట్టినప్పుడు రాకూడదా? నేనెవరికిందా నౌకరీ చేయటంలేదు తెలుసా?''

రోజంతా పనిచేసి, అలసటగా కనిపిస్తున్న భార్యను చూసి అంతకంటె మరేం అనలేకపోయాడు. మీనాక్షి అతని కంటికి ఈ రోజు కొత్తగా కనిపించింది. రంగు వెలసిపోయి మాసికలు

కుట్టిన చీర, లూజుగా, ఒకటిరెండుచోట్ల చిరిగిన జాకెట్టుతో, బలహీనంగా పాలిపోయి వుందామె. అవును... ఈ ఇల్లు, ఇల్లాలిని చూసినవారెవ్వరైనా నన్నెందుకు గౌరవిస్తారు - అనుకున్నాడు.

బాలూ వేగంగా వచ్చి తండ్రి చేయిపట్టుకుని తన రొటీన్ ప్రశ్న వేశాడు - "ఈరోజేం తెచ్చావు నాన్నా?" అంటూ.

"కొంచెం మంచిబట్టలు వెయ్యలేకపోయావా వీడికి?"

"వాడికున్నవే నాలుగు జతలు. పొద్దున్న లేచి మూడు జతలు మాపేశాడు. మీకెన్నిసార్లో చెప్పాను వాడికి బట్టలు కొనండి అంటూ"

"సరె... సరె... అదంతా మళ్ళీ మొదలుపెట్టకు. వినే ఓపిక లేదు నాకు"

ఆవిడ పైపంటితో కిందపెదాన్ని నొక్కిపెట్టింది. కుర్రాడు వున్నట్టుండి గట్టిగా అరిచేడు కారణమేదీ లేకుండానే. తల్లి కోపగించుకుని అంది

"మీరు రానంతవరకూ బాగానే వుంటాడు. మీరొస్తే పులైపోతాడు"

"ఇది బాగుంది... ఇంటికి రాక ఎక్కడికి పొమ్మంటావు!" విసుగ్గా అంటూ బట్టలు విడవటం మొదలుపెట్టేడు.

"నేను అలా అనలేదు" కోపంగా వంటింట్లోకి నడిచిందామె.

వాళ్ళ నాన్న జేబులో కళ్ళద్దాలు వాడిచేతికందేసరికి బాలూ ఒక్క కేక పెట్టాడు. వాటిని తన ముక్కుమీద సరిగ్గా పెట్టుకోడానికి తంటాలుపడుతున్నాడు. వంటింట్లోంచి గబగబా వచ్చి మీనాక్షి, ఆ కళ్ళద్దాలను తీసి దాచేసింది. వాడు గించుకుంటూ, కిందపడి దొర్లుతూ, పెద్ద గొంతుకతో ఏడవటం సాగించేడు. వీరయ్య వచ్చి వాడిని బయటకి తీసుకుపోయి చాక్లెట్లు కొనిపెట్టేక శాంతించేడు.

నిశ్శబ్దంగా వున్న రాత్రివేళ వీరయ్య భార్య నడిగేడు, "మనిద్దరం రోజూ ఎందుకు పోట్లాడుకోకుండా వుండలేమో నీకేమైనా తెలుసా?"

"ఆ... తెలుసుగానీ... నన్నిక పడుకోనిస్తారా కాసేపు" అంటూ పక్కకి తిరిగిందామె. తన చెయ్యి చాపి ఆమె భుజాన్నందుకుని బలంగా ఊపుతూ, "కాసేపు నిద్ర ఆపుకో... నీతో చెప్పాల్సింది చాలావుంది" అన్నాడు.

"రేపుదయందాకా ఆగలేరా?"

"ఊఁహూఁ" అంటూ ఆరోజు పొద్దున్నించీ జరిగిన సంఘటనలన్నీ వివరించేడతను. ఆమె మంచంమీద లేచి కూర్చుంది.

"సెక్రటరీ ఎవరు? మిమ్మల్నెందుకు బెదిరించేడు? మీకేమన్నా యజమానా?"

"అతను బెదిరించగలడులే. అతడికి డబ్బు, అధికారం, వేషం, అన్నీ దండిగా వున్నాయి. అతనికున్న డబ్బే ప్రధానం అనుకో. డబ్బుంటే ఎన్నైనా చేయొచ్చు. అదొక్కటే ఈ లోకంలో ముఖ్యమైన విషయం. మన పర్సులో డబ్బు మస్తుగా వుంటే మనం కోరకుండానే అన్నీ వొచ్చి మన వళ్ళో వాలుతాయి"

ఆమె అంది, "అయినా ఆ సెక్రటరీతో మీరంత గట్టిగా మాట్లాడకుండా వుండాల్సింది. వేల రూపాయల జీతగాడితో అలా మాట్లాడతారా?"

"వాడికి ఎన్నివేలు రానీ... నాకు లక్ష్యంలేదు. నేను కూడా డబ్బుసంపాదించగలను. అప్పుడు వీడేమంటాడో చూస్తాను"

భార్య సమక్షంలో అతడి ఆత్మస్థైర్యం పదింతలయింది. నైరాశ్యం, ఆత్మన్యూనతాభావాలు మటుమాయమైపోయాయి. ఆత్మవిశ్వాసం పెరగటంతో జీవితంలోని సౌఖ్యాలన్నిటినీ గుప్పెట పట్టుకోగలననే నమ్మకం ఏర్పడింది. మెదడునిండా అనేక ప్రణాళికలూ, ఆశారేఖలూ, గజిబిజిగా సుళ్ళు తిరుగుతుండగా అతనన్నాడు,

"మనం బాగా ధనవంతులం అయ్యేక నువ్వు నీ పద్ధతి, నాతో నడుచుకునే విధానం మార్చుకోవలసి వుంటుంది. ఇప్పటి లేమిలో నీ మూర్ఖత్వాన్ని నేనర్థం చేసుకోగలను. ఏమైనా నేనా మంగలిపొది మరి ముట్టుకోను. చిరిగిన ధోవతులూ కట్టను. మిగిలిన అందరిలానే నేనూ ఒక మర్యాదస్తుడిలా మెసులుతాను. నేను బాంకులోకి అడుగుపెట్టగానే ఆ సెక్రటరీగాడు లేచి నించొని 'నమస్కారం సార్' అనేలా చేస్తాను. వాడేకాదు ఈ ప్రజలంతా నన్ను తేరిచూడలేని ఎత్తులకి ఎదిగిపోతాను. ఇంట్లో ఈ చిరిగిన చాపలూ, విరిగిన మంచాలూ, మాసిపోయి, మరకలుపడ్డ నీ పాత చీరలూ

వుండటానికి వీల్లేదు. మన బాబు సూటు వేసుకుని కార్లో కాన్వెంటుకెళ్ళేలా చేస్తాను. మన సంపద చూసి ఆ పక్కనున్నాడే మా అన్న వాడి కుటుంబం ఈర్ష్యతో కుళ్ళి కుళ్ళి ఏడవాలి. వాడు నాదగ్గరికే వచ్చి ప్రాధేయపడాలి. ఆ బైతులకీ నాకూ నేటితో చెల్లు'' అతనలా అని పక్కకి తిరిగి చూసేసరికి మీనాక్షి గాఢనిద్రలోవుంది.

★ ★ ★

ఆ మర్నాడు వీరయ్య చిత్రంగా ప్రవర్తించేడు. ఎంతో పరిశోధన చేసి కొత్త విషయం తెలుసుకున్నవాడిలా వుంది అతని ప్రవర్తన. తను నిత్యం పనిచేసే ఆ పాతజాగాను విడిచిపెట్టడం అతనివల్ల కాలేదు. అయితే ఆరోజు అతనక్కడికి వెళ్ళిన తీరుమాత్రం భిన్నంగా వుంది. ఏ శుభకార్యానికైనా ఆహ్వానం వస్తే వెళ్ళటానికి దాచివుంచిన దావుడు బట్టల్ని బయటకి తీసి ధరించేడు. పెట్లో వాటిమధ్య కర్పూరం వుంచినందువల్ల కాబోలు అతను కొట్టుగదిలోంచి బయటకి వస్తూంటే హారతిపళ్ళెం నడిచివచ్చినట్లనిపించింది. ఎందుకోగాని అతడికి కళ్యాణమంటపంలో పీటలమీద కూచున్న తన పెళ్లిరోజు జ్ఞాపకం వచ్చింది. ఎలావుండేవాడు తను! భావిజీవితం గురించి కలలెన్ని కన్నాడు? చూపుడు వేలు కదిపితే చాలు... పదిమందీ వచ్చేవారు ఏం కావాలంటూ... అతనెవరినన్నా దగ్గరికి పిలిచి మాట్లాడితే, ఆ పిల్చినవాళ్లు ఎంతో గర్వపడేవాళ్ళు.

నిజంగా పెళ్లిరోజంత మోసపూరితమైన రోజు మరోటి లేదనిపించింది. కట్నం గురించి తన అన్న అత్తవారితో ఎంత గీసి గీసి బేరమాడేడు. తమ్ముడు తన ప్రాణంకన్న ఎక్కువ అన్నట్టు మాట్లాడేడతనారోజు. పెళ్ళిపెద్దగా తన అన్న చేసిన అట్టహాసం ఆ జ్ఞాపకాల్లోంచి పొడుచుకుంటూ వచ్చింది. ఇప్పటికైనా తనకీ అన్నకీ పెద్దగా విరోధాలేం లేవు. అసలు ఆడంగులవల్లనే వచ్చింది వైరం. ఒకరిపొడంటే ఒకరికి కిట్టని ఆడంగులవల్లనే ఈ ప్రపంచంలో సగం సమస్యలు వస్తున్నాయి అనుకున్నాడు వీరయ్య.

భార్య మొహంలో చిలిపితనం కనిపించిందతనికి.

''ఏదో విశేషమే వుందివ్వాళ! ఎవరిదైనా పెళ్ళికి వెళ్ళాలేం?!''

''అదేం కాదులే. ఇదొక్కటే నాకున్న ఖరీదైన ధోవతి. మళ్ళీ ఆ చిరుగుల బట్టల్లో నేనెవరికీ కనిపించదల్చుకోలేదు. అన్నట్టు ఆ పాతపంచె దాచిపెట్టి అరుల్‌దాస్ కనక వస్తే వాడికివ్వు... వాడు బహుశా వస్తాడు''

తండ్రి కొత్తబట్టలు వేసుకోవడం చూసి కొడుకు ఆనందం పట్టలేకపోయేడు. సంబరంగా రెండుచేతుల్తో చప్పట్లు చరిచేడు. అయితే వాడి దృష్టి అంతా కర్రతో చేసి, లక్కరంగు పూసిన ఏనుగుబొమ్మ ఎలాగ విరగ్గొట్టాలా అన్నదానిమీదే వుండటంతో తండ్రిజోలికి పెద్దగా రాలేదు.

పంచె దక్షిణాదిరీతిలో కాకుండా పూనా పద్ధతిలో విరిచి కట్టి, చెంగులు కనిపించేలా దోపాడు వీరయ్య. ఇంట్లో భార్యతో మాట్లాడిన ప్రతీ మాటా, అప్పుడే విదేశాల్నుంచి దిగివచ్చినవాడిలా హెూదా వుట్టిపడేలా మాట్లాడటం మొదలుపెట్టేడు.

ఆమె అతని ప్రవర్తన చూసి భయపడింది. రోజూ అతను 'అన్నం వుడికిందా! ఇంకా లేదా?' అంటూ పదిసార్లు అడిగి కంచం ముందుపెట్టుకుంటేనేగానీ వడ్డించని ఆమె ఆరోజు చాలా ముందుగానే కంచంలో అన్నం వడ్డించిమరీ భర్తని కేకేసింది

''మీకిష్టమని పెరట్లో వంకాయలు కోసి వండేను'' అంది ప్రేమగా.

''కూర బాగానే వుందిలే'' అని నిర్లక్ష్యంగా బదులిచ్చేడు. బాలూ కూడా నిశ్శబ్దంగా భోజనంచేశాడనే చెప్పాలి. ఒకే ఒక్కసారిమాత్రం తల్లి అడిగినంత నెయ్యి వెయ్యకపోతే, ఏనుగులా ఘీంకారం చేసి పట్టెడన్నం తీసి తల్లి మొహంమీదకి విసిరేశాడు. ఆమె ఎప్పటిలా కాకుండా ఆ పూటమాత్రం వాడినేం అనలేదు. అక్కడితో భోజనాల ఘట్టం ప్రశాంతంగా ముగిసింది.

భోజనం అయ్యాక వీరయ్య తన పళ్ళెం తీసి వంటింట్లో ఓ మూల రోజూలాగానే పెట్టడానికి లేచేడు. అదుర్దాగా భార్య వచ్చి వారించింది-

''వద్దొద్దు నేనున్నదెందుకు? మీరు తియ్యకండి'' అంటూ.

దర్జాగా లేచి చేతులు కడుక్కునేసరికి ఆమే తువ్వాలు అందించింది. సున్నం రాసిన తమలపాకులూ, వక్కలూ అందించి అతను వెళ్ళే వరకు వీధిగుమ్మంలో నిలుచుని సాగనంపిందామె.

వీరయ్య బయటికి వెళ్ళేముందు తన పెట్టె తెరిచి కొన్ని అవసరమైన కాగితాలు మాత్రం చేతిలో పట్టుకుని వెళ్ళేడు. అదే నయమనిపించింది అతడికి. తనకోసం ఏవో కొత్త ద్వారాలు తెరుచుకుంటున్నాయన్న ఊహతో, నవోత్సాహంతో కదిలేడతను.

వీరయ్య ఖాతాదార్లు అతన్ని చూసి ఆశ్చర్యపడ్డారు. ఎప్పటిలా అతను చెట్టుకింద కూర్చోలేదు. నిలబడే వున్నాడు.

''ఏం వీరయ్యా! నిలబడ్డావేం?''

''నేను కూచోదలచలేదు. కనుక''

''ఏం?''

''నాకు నిలబడ్డం ఇష్టం కనుక. మీకెందుకు ఆ సంగతి. మీ పన్లు చెప్పండి? తీవ్రంగా అన్నాడు. అతనికి అనాగరీకంగా వున్నవాళ్ళంటే అయిష్టం కలిగింది. ఒకతని దరఖాస్తు నింపి ఇచ్చేడు ''పోయి ఇది లోపల ఇచ్చి... రా!''

ఇంకో అతన్తో చెప్పేడు ''నీ డబ్బు ఇవ్వాళ అందుతుంది. నేనిచ్చిన ఎడ్వాన్సు, నువ్వివ్వవలసిందీ ఇచ్చెయ్యి'' తనపనంతా కూచోకుండానే చేశాడు వీరయ్య. ఒకతను కొంచెం బాగా పరిచయస్తుడుమాత్రం వీరయ్య వాలకం చూసి అడక్కుండా వుండలేకపోయాడు.

''ఏం వీరయ్యా! ఏదైనా పెళ్ళికిగానీ వెళుతున్నావా?''

''అవునోయ్... ఇకనుంచి ప్రతీరోజూ నాకు పెళ్ళిరోజే. రోజుకో పెళ్ళాం కావాలని మనసు పుట్టింది. ఏం... కుదర్దంటావా?'' అంటూ కులాసాగా కబుర్లాడేడు కొంతసేపు. దగ్గర్లో వున్న ప్రహరీగోడమీద వత్తుపెట్టి నిలబడే రాతపని పూర్తిచేసుకున్నాడు. తలవొంచి రాస్తున్నప్పుడు బయటికి వినిపించేలా స్వగతం మాట్లాడేడు.

'వీళ్ళకి సేవ చేయడం కాదుగానీ నా పన్లన్నీ పాడైపోతున్నాయి. నేరకపోయి ఇరుక్కున్నాను దీన్లో'

ఎవరో ఒక రైతు విని అడిగేడు, ''మీకింకేం పన్లున్నాయి వీరయ్యా!''

''లేకేం... నా కుటుంబం గడవాలంటే నేనేదో ఒకటి చెయ్యొద్దూ!''

''ఈ పన్లో మీకు నాలుగైదు రకాలుగా డబ్బు వస్తోందిగా...!''

''అవును... వస్తోంది. కాదనటంలేదు. కానీ ఆ వచ్చేది ఎంత? నా పొడుం ఖర్చుకే చాలదు'' గర్వంగా అంటూ చిన్న పొడుండబ్బా జేబులోంచి తీసి ఒకసారి పొడుం పట్టు పట్టేడు. కొత్త వుత్సాహం పొటమరించడంతో వాదనకి సిసద్ధపడుతూ అన్నాడు

''మీకోసం ఎంతో చేయాలని వుంది నాకు. మీ డబ్బు సమస్యలన్నీ పరిష్కరించాలని వుంటుంది. ఎందుకో తెలుసా? మీరిచ్చే ఈ దిక్కుమాలిన చిల్లరడబ్బులకోసం కాదు''

వాళ్ళు ఆశ్చర్యంతో నోళ్ళు తెరిచేరు.

''మీ అందరికీ డబ్బు ఇబ్బందులు పోవాలని. ఈ నాగరీకులతో సమానంగా మీరూ సుఖంగా జీవించాలని నా తాపత్రయం అంతా. అందుకే ఆ బోడి బాంకునుండి మీరు పొందగలిగే డబ్బు పొందటానికి నా చేతనైన సాయం నేను చేస్తున్నాను'' కోపరేటివ్ బాంకు వంక చూపిస్తూ అన్నాడు. అందరూ అటువైపు తిరిగి చూసేరు. ఎక్కడినుంచో అప్పుడే బాంకు దగ్గిరకు వస్తున్నాడు అరుల్‌దాస్.

''అడుగో అరుల్‌దాస్!'' అన్నారు కొందరు.

వాళ్ళందరూ తనవైపు తిరిగేసరికి అరుల్‌దాస్ నడక మందగించింది. అరుల్‌దాస్ చూపులు తన చూపులతో కలిసేసరికి వీరయ్యలో కంపరం పుట్టుకొచ్చింది. ఇంకా నశ్యం ప్రభావం పనిచేస్తుండటంతో కేకపెట్టాడు.

''అక్కడ దేనికోసం చూస్తున్నావు అరుల్‌దాస్. నేను కావాలంటే ఇటురా!''

ఆ పిలుపులో ప్రమాదం లేదని పసిగట్టేడు వాడు. వీరయ్యతో విరోధం వాడికి ఇష్టంలేకపోయింది. అందుకే ఆ పిలుపు ఆహ్వానంగా

భావించి వీరయ్యదగ్గరికి వచ్చేడు.

"జాగ్రత్తగా విను అరుల్‌దాస్! ఈ చెట్టు, దాని నీడ దేవుడిచ్చినవి. ఎవడి స్వంతమూ కాదు. నువ్వుగానీ, నీ సెక్రటరీగానీ ఏదైనా ద్రోహం తలపెట్టారో... అందుకు తగిన శాస్తి చేస్తాను. గుర్తుంచుకో..."

ఆ పల్లెటూరి రైతులంతా విస్మయంతో గడ్డ కట్టుకుపోయేరు వీరయ్య అరుల్‌దాస్‌ను బెదిరిస్తున్న తీరుకి.

వీరయ్య ఏం చెయ్యబోతున్నాడో తెలుసుకోవాలని పత్తేదారీ పనికి వచ్చినవాడల్లా ఇరుకున పడ్డట్టయ్యాడు అరుల్‌దాస్. వీరయ్యకానీ చెట్టుకింద తన పెట్టె పెట్టుకుని కూచుని వుంటే, పోయి సెక్రటరీతో నాలుగు ముక్కలు చెప్పేవాడే. ప్రస్తుత పరిస్థితి అలాలేదు. అందరిముందు తను అవమానంపాలయినందుకు వాడు బాధపడిపోతున్నాడు. వెళ్ళిపోవాలని నిశ్చయించుకుని వెనక్కి తిరిగేడు.

"సెక్రటరీగారి కారుగానీ వచ్చిందేమో చూడ్డానికొచ్చేను వీరయ్యా!" సంజాయిషీ చెబుతున్నట్టన్నాడు.

"మన సెక్రటరీకొక కారు కూడా వుందన్న మాట!" కళ్ళెగరేశాడు వీరయ్య.

"నువ్వు చూడలేదూ! ఎర్రకారు. బాంకు ముందుంటుంది!"

"ఆఁ నాకదేపనా యిక్కడ... పోయి మీ సెక్రటరీకి చెప్పు" అని ఆ తర్వాత కాసేపు తటపటాయించేడు. ఆ జోరులో అనకూడని మాటలొచ్చేస్తాయేమోనన్న జంకు కలిగింది.

"అరుల్‌దాస్! నీకేమైనా పాతబట్టలు కావాలంటే పోయి మా ఇంటిదగ్గిర మా ఆవిణ్ణడుగు" అన్నాడు.

ఈ ఆదరణకి ఎదురుచూడలేదేమో అరుల్‌దాస్ మొహం చింకి చేటంత అయింది.

"తప్పకుండా! తప్పకుండా!" అంటూ వెనక్కు వచ్చి వీరయ్య చెవిలో గుసగుసలాడేడు అరుల్‌దాస్. వీరయ్య చెయ్యెత్తి వాడి మొహానికీ, తన మొహానికీ మధ్య అడ్డంగా పెట్టేడు. నీరుల్లి వాసన ఘాటుగా తగిలింది అతని ముక్కుకి. ముక్కు చిట్లిస్తూ అడిగాడు అరుల్‌దాస్‌ని.

"నువ్వు రోజూ పచ్చి ఉల్లిపాయ తింటావా?"

వాడా మాటల్ని ఏమాత్రం పట్టించుకోకుండా తను చెప్పేది కొనసాగించేడు.

"అంచేత నిన్న నేనేమీ నిన్ను అల్లరిపెట్టాలని రాలేదు వీరయ్యా! నన్ను నమ్ము. ఆ సెక్రటరీ చెప్పినట్టు చేసేను. తల అమ్ముకున్నాక తప్పదుకదా!" అన్నాడు ఆఫీసువంక చూపుతూ. ఆ వెంటనే...

"అతడొక దరిద్రుడు. ఆ మాటలు పట్టించుకోకు. నీ ఇష్టం వచ్చినట్టు నువ్వు పనిచేసుకో. వీరయ్యగారూ! మీకేం ఫర్వాలేదు" అని చెప్పి వెనక్కి తిరిగి బాంకులోకి వెళ్లిపోయేడు.

ఆరోజు బజారువెంట నడుస్తున్నంతసేపూ వీరయ్య ఆలోచనలన్నీ డబ్బు సంపాదనమీదే నిలిచిపోయేయి. తన కాతాదార్లతో అతనన్న మాటలే అతనికి స్ఫూర్తినిస్తున్నాయి.

"మీడబ్బు ఇబ్బందులు తొలగించేందుకు నేను నా సమయం అంతా వెచ్చించి చేయగలిగిందంతా చేస్తున్నాను. నాకోసమే అయితే, డబ్బు సంపాదనకోసమే అయితే నేను చేయగలిగే పనులెన్నో వున్నాయి" అంటూ తనన్న మాటలు నిజమేనన్న భ్రమలో పడ్డాడు.

నేనేకాని మాలన్నతో కందాకి అప్పు ఇప్పించకపోతే వాడి బతుకేమయ్యేది. పిల్లకి పెళ్ళి చేయగలిగేవాడా. కొడుకు చదువు సాగేదా? చివరకు వుండటానికి ఇల్లైనా వుండేది కాదే.

డబ్బువల్ల ఎన్ని మంచిపనులు జరుగుతున్నాయో తనకు తెలిసినంతవరకు గుణించుకున్నాడు. డబ్బులేని ప్రపంచం ఊహించలేకపోయేడు. 'జంతువులకీ, మనుషులకీ తేడా ఏముంటుంద'ని పెదవి విరిచాడు.

బజారుమధ్య, నాలుగు రోడ్ల కూడలిదగ్గిర ఫౌంటెన్ ఒకటి వుంది. దానిచుట్టూ చిన్న హద్దుగోడ పద్మాకారంలో కట్టేరు. సాయంకాలం ఆరుగంటలు కావొస్తూంది. వీధంతా పడమటి సూర్యుని కిరణాల కాంతిలో వెలిగిపోతోంది. నడుస్తున్న బాటసారులు, రిక్షాలు, ఒకటేమిటి చరాచర వస్తుజాలం బంగారంతో పోతపోసినట్లు మెరిసిపోతూంటే, ఆ దృశ్యం చూసి వీరయ్య పరవశంచెందిపోయేడు. ఇంతలో చింకిపాతలు ధరించి, జుత్తంతా జడలు కట్టినవాడొ

కడు వీరయ్యముందొక మట్టిపాత్ర చాపేడు. రోడ్డుపక్కనున్న దుప్పటి కప్పినదానివంక చూపుతూ

''అనాధ శవం బాబూ! కనికరించి, దహన క్రియకి సాయంచేసి పుణ్యం కట్టుకోండి'' అన్నాడు.

వీరయ్య భయంగా ఆవంక ఒకసారి చూసేడు. ఒళ్లు జలదరిస్తుంటే జేబులో చెయ్యిపెట్టి ఒక నాణెం తీసి వాడి చిప్పలో వేసేడు. అప్పటికే దాన్లో చాలా నాణేలు పోగుపడి వున్నాయి.

తల పక్కకి తిప్పుకొని వడివడిగా ముందుకు నడిచేడు.

నాలుగడుగులు వేసేసరికి మరొకడు తయారయిపోయేడు. రేకుడబ్బా ఒకటి గలగలలాడిస్తూ ''అనాథప్రేతం బాబూ!'' అంటూ.

''ఫో... ఫో... వయ్యా ఎందరికివ్వాలేమిటి?'' అంటూ వాణ్ణి కసిరికొట్టేడు వీరయ్య.

ఆ రేకుడబ్బాలో కూడా డబ్బు బాగానే చేరడం గమనించేడతను. అతడి మనసంతా అసహ్యంతో నిండిపోయింది. నలుగురైదుగురు కలిసి ఒక అనాథశవాన్ని సంపాదించి ఈరకంగా డబ్బులు దండుకుంటారని తెలును అతడికి. ఎవరైనా అతీ, గతీ లేని నిర్భాగ్యుడు రోడ్డుపక్క చావబోతుంటే, వీళ్ళు అదృష్టం కలిసివచ్చిందని సంబరపడుతుంటారు.

వీరయ్య మనసులో ఆ దృశ్యం బలంగా నాటుకుపోయింది. ప్రాణావసరాలైన నీరూ, గాలీ, ఆహారంలాగా డబ్బుకూడా ముఖ్యం అన్న సంగతీ, అదెంత ఎక్కువ సంపాదిస్తే జీవితం అంత సుఖమయం అవుతుందనే సంగతీ స్పష్టంగా తెలిసివచ్చిందతనికి. ఇంతకుముందు ఆతనికి ఆ విషయం తెలీదనికాదు. బాగానే తెలుసు. అయినా అతని ప్రస్తుత మానసిక పరిస్థితిలో అతనికీ విషయాలన్నీ నూతన కోణాల్నుంచి ఆవిష్కరించబడుతున్నాయి. జీవితాన్ని పునఃప్రారంభించాలన్న బలమైన కోర్కె అతణ్ణి ఊపేస్తోంది.

దూరంగా వున్న కొబ్బరితోటలో ఒక వయస్సుమళ్ళిన వ్యక్తి చెట్టుపైకెగబాకుతున్నాడు. వీరయ్య అతడ్ని చూసి జాలిపడ్డాడు. సమయంతో నిమిత్తం లేకుండా ఒక్క గోచీపాత ధరించి, నూరూ, నూటాయాభై అడుగులు పైకి ఎక్కుతూ, దిగుతూ కాయ దింపే అతడికి దొరికేదెంత? చెట్టుకి రెండురూపాయలు దొరికితే ఎక్కువే. మరా వ్యక్తి తినేదెంత? మిగుల్చుకొనేదెంత? ఆఫీసుల్లో చెమట్లు కక్కుతూ పనిచేసే మనుషులంతా దేనికోసం తాపత్రయపడుతున్నారు? డబ్బు ఎలా సంపాదించాలా! అనే గదా? వాళ్ళు సంపాదించేదెంత? దానికేదైనా హద్దుందా? ఈ ప్రశ్నలతన్ని కలవరపెడుతున్నాయి.

కొంచెం దూరంగా నడిచేడు. అక్కడ బజారురోడ్డు రెండుగా చీలిపోయింది. ఎడమపక్క రోడ్డు దూరంగా నేషనల్ హైవేకు కలుస్తుంది. కుడిపక్క రోడ్డు కొంతదూరం తిన్నగా సాగి అక్కడనుంచి గుబురుగా వున్న తోటలమధ్య నుంచి వంపుతిరిగి మాయమైపోతుంది. ఆ వంపులో కొత్తగా పట్టణంలో ధనవంతులు నివశించటానికి ప్రత్యేకంగా ఒక కాలనీవంటిది నిర్మించుకున్నారు. దాన్ని లాల్‌జీఎక్స్‌టెన్షన్ అనీ, ఆ రోడ్డుని లాల్జీమార్గం అనీ పిలుస్తారు. మున్సిపాలిటీవారు ఆ కుడిపక్క రోడ్డునానుకుని ఒక చిన్న పార్కువంటిది ఏర్పాటుచేసేరు. నాలుగైదు సిమెంటు బెంచీలను వరుసల్లో వేసి చుట్టూ క్రోటన్ మొక్కలను పెంచేరు. లోపల వేసిన చెట్లు ఇంకా పూర్తిగా పెరగలేదు. వాటిని పశువులు పాడుచెయ్యకుండా చుట్టూ రెయిలింగ్ అమర్చేరు. వీరయ్యకు అప్పుడే ఇంటికి వెళ్ళాలనిపించలేదు. ఏకాంతంగా కాసేపు గడపాలనిపించి, ఆ పార్కులోకి పోయి, ఒక సిమెంట్ బెంచీమీద రోడ్డుకభిముఖంగా కూర్చున్నాడు. రోడ్డుమీదనుంచి లాల్జీమార్గంమీదగా కార్లు రివ్వుమంటూ దూసుకుపోతున్నాయి. ఆ పెద్ద పెద్ద కార్లని చూసి వీలయినంత త్వరలో కారు ఒకటి కొనుక్కోవాలి అనుకున్నాడు. ఈ ప్రపంచంలో దేన్నీ సంపాదించడం అసాధ్యంకాదు! తనకు తానే చెప్పుకున్నాడు.

సూర్యుడు అస్తమించేడు. గాలి చల్లగా వీస్తోంది. ఒకటొకటిగా వీధిదీపాలు వెలుగుతున్నాయి. ''నాదగ్గిరే కనక డబ్బుంటే ఆ కళ్ళద్దాల షావుకారుకి భయపడి ఇంకో తోవపట్టను. షావుకారుదగ్గిర అరువుకోసం దేబిరించను. మీనాక్షిని మంచి డాక్టర్‌కి చూపించి, ఖరీదైన మందులు వాడి, మళ్ళీ పూర్వంలా కళకళలా

డేలా చేస్తాను. నా 'బాలూ'కి అడిగిందల్లా కొనిపెడతాను.

అక్కణ్ణుంచి వీరయ్య వూహలు కొడుకు భవిష్యత్తులోకి రెక్కలు చాపుకుని విహ రించేయి. 'జమిందారు బిడ్డలా పెరుగుతాడు వాడు. పందుల పాకలాటి వీధిబళ్ళో కాకుండా ఖరీదైన ఇంగ్లీష్ కాన్వెంట్‌లో చదువుతాడు. జిల్లా కలెక్టర్ కొడుకు, పోలీస్ సూపరెంటెంట్ కొడుకువంటివాళ్ళతో సమానస్థాయిదాలో మాట్లాడగలుగుతాడు. వాడు కాలేజీలో అడుగు పెట్టగానే, వాడికోసం ప్రత్యేకంగా ఒక కారు కొంటాడు. అమెరికాలాంటి దేశాల్లో డిగ్రీలు సంపాదించుకుని వచ్చి ఏ జడ్జీగారి కూతుర్నో పెళ్ళిచేసుకుంటాడు. వాడి తల్లి కోరిన కట్నం వాళ్ళివ్వవలసిందే. తనేం ఆడవాళ్ళ విష యంలో జోక్యం కలిగించుకోడు. కొడుకు, కోడ లుకోసం లాల్‌జీ కాలనీలో పెద్ద బంగ్లా ఒకటి కొని సింపుల్‌గా ఇచ్చేస్తాడు. అలా, అలా అతని ఆలోచనలు మనవలు, ముని మనవల దాకా కళ్ళెంలేని గుర్రాల్లా పరుగెత్తేయి.

ఎవరో ఒక వ్యక్తి లాల్‌జీ మార్గంమీదుగా పార్కుముందుకి రావటం చూసేడు వీరయ్య. దూరంనించి వస్తున్నట్టున్నాడు. మొహం వాడి పోయివుంది. ఒళ్ళంతా తెల్లటి బట్టతో కప్పుకు న్నాడు. తల నున్నగా క్షవరంచేసి వుంది. వెనుకవైపుమాత్రం పిలకలా కొన్ని వెంట్రుకలు వున్నాయి. వాటి చివర ముడివేసి వుంది. నుదుటిమీద ఎర్రగా కుంకుంబొట్టు వుంది. సన్నగా, పొడవుగా, అరవై ఏళ్ళున్నట్లు కని పిస్తున్నతన్ని వీరయ్య గుర్తుపట్టేడు. తమ వీధికి కొంచెం దూరంలో వున్న హనుమాన్ దేవాలయం పూజారి అతడు. అతణ్ణి చూడ గానే వీరయ్య మెదడులో ఏదో ఆలోచన మెరి సింది. ఆ పూజారి ఆజన్మ బ్రహ్మచారనీ, గొప్ప వేద పండితుడనీ, మంచి మహత్తు వున్నవా డనీ ఆ ఊర్లో జనం అనుకోవడం అతనికి తెలుసు. తనకేమైనా సలహా యివ్వగలడేమో అని ఆశపడ్డాడు. చప్పట్లు చరిచి అతన్ని కేకేశాడు. వెనక్కి తిరిగి చూసేడతను. కళ్లు చిట్లించి చూసి గుర్తుపట్టేడు వీరయ్యని.

"ఎవరూ? ఓ వీరయ్యా!! ఇక్కడేం చేస్తు న్నావు?"

"అలసటగా వుంటే కూర్చున్నానులెండి. మన వీధిలోకన్న ఇక్కడ గాలి బాగా వేస్తుంది"

"నిజం... ఇదంతా ధనవంతుల ప్రాంతంకదా! బాగా వెడల్పుగా వుండే రోడ్లు... తోటలూ వున్న ప్రదేశమాయె. మన వినాయకవీ ధిలో ఏముంది? వేసవిలో కాలేపెనం చల్లగా వుంటుంది దానిముందు"

"ఉక్కపోత ఎలానూ వుండనేవుంది. మరి దోమలో..." వీరయ్య మాట కలిపేడు.

"రాత్రిళ్ళు వాటివల్లనే నిద్రపోవటం మానే శాను"

"అవెందుకసలు ఝుమ్మంటూ రొదచే స్తాయో... కావలసినంత రక్తం తాగినా భరించొ చ్చు. ఆ రొదమాత్రం విపరీతం"

ఒక అరగంటవరకు ఇద్దరూ దోమల గు రించీ, ఊళ్ళో వ్యాపిస్తున్న రోగాల గురించీ మాట్లాడుకున్నారు. ఆ గుడి పూజారి కాలగమ నంతో నిమిత్తం లేనివాళ్ళా వున్నాడు. తొంద రగా వెళ్ళాలన్న ఆదుర్దా ఏమీ కనబడటంలే దు అతనిలో. ఆకాశంలో నక్షత్రాలు మిలమిల మెరుస్తున్నాయి. చివరికి వీరయ్యే అడిగేడు

"ఇలా ఎక్కణ్ణుంచి వస్తున్నారు?"

"ఆ బంగ్లాల్లో ఒక ఇంటికి వెళ్ళి పూజ చేసి వస్తున్నాను" లాల్‌జీ కాలనీవున్న వైపు చెయ్యి చూపించి చెప్పేడు.

"మున్సిపల్ కమీషనర్‌గారింటికి నేనే వెళ్ళా లి. ఇంకొకర్ని పంపితే ఆయనకి నచ్చదు. రోజూ సాయంత్రం నేను వారింట్లో పూజ చేసి తిరిగి గుడికి వెళ్ళాలి. కొందరు భక్తులు అక్కడ ఎదురుచూస్తూ వుంటారు. రెండుచోట్ల ఒకేసమయంలో వుండలేంకదా!"

"నిజం చెప్పేరు. మీకు తోడుగా వస్తాను పదండి"

"నేను అప్పుడే గుడికి వెళ్ళటంలేదు. ఇంకో దగ్గిరకి పోయి, అక్కడనుంచి వెళతాను. ఒక్క పదినిముషాలు ఆలస్యం అవుతుంది. అంతే... నాతో రావటానికి అభ్యంతరం ఏదీ లేకపోతే నువ్వూ రావొచ్చు. తోడుగా ఎవరైనా వుండి మాట్లాడుకుంటూ వెళితే బడలిక తెలీదు"

ఇద్దరూ వెనక్కి మళ్ళీ బజారు రోడ్డులోకి మళ్లేరు. బజారు వెనక వున్న ఎన్నో సందులూ, గొందులూ తిప్పి ఆ పూజారి వీరయ్యని ఒక

ఇంటిముందుకు తీసుకువెళ్లేడు.

"నువ్వు కొంచెంసేపు ఈ అరుగుమీద కూచుంటే నేను పని ముగించుకుని వెంటనే వచ్చేస్తాను" అని జవాబుకోసం చూడకుండా ఆ ఇంటి తలుపు తోసుకుని లోపలకి వెళ్ళిపోయాడు. చేసేదేంలేక ఆ ఇంటిముందున్న అరుగుమీద చతికిలపడ్డాడు వీరయ్య.

అతని కాళ్ళకిందనుంచి మురికి కాలవ ప్రవహిస్తోంది. "మా వీధేనయం దీనికన్న" చుట్టూ ముసురుతున్న దోమల్ని తోలుకుంటూ గొణుక్కున్నాడు.

అది చేనేత కార్మికులు నివశించే వీధి. వీధినిండా కర్రచట్రాలకు తగిలించి, ఆరబెట్టి వుంచిన రంగురంగుల చీరలు అందుకు సాక్ష్యంగా కనిపిస్తున్నాయి. ఇంతలో ఎవరో లోపల్నుంచి బయటకు వచ్చి వీరయ్యని రమ్మని పిలిచేరు. ఆ ఆహ్వానానికి సంతోషించి లోపలకి అడుగుపెట్టేడు అతను.

ముందు నడవా చాలా చిన్నది. దాన్లోనే కొయ్యఫ్రేములూ, దొంతర్లుగా మడతబెట్టిన చీరలూ, ఇంట్లో వాళ్ళ వక్కబట్టలూ చిందర వందరగా పడివున్నాయి. ఆ వసారాలోనే ఒక మూల పీటవేసి వుంది. దానిమీద దేవతా విగ్రహాలు కొన్నీ దాని వెనుక వున్న గోడమీద, దేవుడి పటాలు కొన్ని అమర్చి వున్నాయి. ఆ పీటముందు పూజారి కూర్చుని వున్నాడు. అగరొత్తులు దట్టంగా పొగలనిస్తున్నాయి. దీపం ఒకటి నిశ్చలంగా కాంతి వెదజల్లుతోంది. పరిమళం అంతటా వ్యాపించివుంది. తదేక దీక్షతో, కళ్ళు మూసుకుని కూర్చున్న పూజారి మంత్రపఠనం చేస్తున్నాడు. అతనికి కొంచెం దూరంలో ఆ ఇంటి యజమాని తన భార్యాపిల్లలతో, చేతులు జోడించి నిలబడి వున్నాడు. నలుగురు పిల్లలు వున్నారక్కడ. తల్లో, తండ్రో, ఎవరో మధ్యమధ్యలో వాళ్ళని "తప్పు... దేవుడి ముందుగోళ్ళుకొరక్కూడదు" అని మందలిస్తున్నారు.

వాళ్ళ జాగాలో బాలూ వుండివుంటే ఏంచేస్తాడోనన్న ఆలోచన మెదిలింది వీరయ్యలో.

"వాడు వీళ్ళలా వింటాడా! వద్దన్నా వాడి గోళ్ళు కొరకడం మానడు. కనీసం వక్కవాళ్ళ గోళ్ళు కొరక్కపోతే చాలు బుద్ధిగా వున్నట్లే లెక్క. తీర్థప్రసాదాలు పూజకి ముందే చెల్లిపోతాయి"

అక్కడున్న పిల్లలతో తన కొడుకుని పోల్చి, వీళ్ళకన్నా వాడే చురుకైనవాడని నిర్ణయించుకున్నాడు. వెంటనే ఇంటికి పోవాలన్న కోరిక పుట్టింది. ఈరోజు చాలా ఆలస్యమైందే అనుకున్నాడు. హఠాత్తుగా తెలివి వచ్చినట్లయింది వీరయ్యకి. ఎన్నడూ లేంది ఈరోజు ఈ పూజారితో ఎందుకు తిరుగుతున్నానా? అనిపించింది.

ఒక ముసలమ్మ వొళ్ళో చిన్న పిల్లాణ్ణి వేసుకుని దేవుడి పీఠంముందు కూర్చుని వుంది. వాడి వళ్ళంతా బట్టతో కప్పివుంది. కళ్ళుమాత్రం నూనె దీపాలకాంతిలా ఉజ్వలంగా మెరుస్తున్నాయి. ఆ కుర్రాడి ఆరోగ్యస్థితి ఆందోళనకరంగా వుందని గ్రహించేడు వీరయ్య. వాడి వయస్సెంత వుంటుందో తేల్చుకోలేకపోయేడు.

పూజారి పనంతా ముగిసి వాళ్ళు బయటపడేటప్పటికి సమయం తొమ్మిది గంటలవుతోంది. ఆ వీధులన్నిటినీ పూజారి వెనక మౌనంగా నడుస్తూ దాటేడు వీరయ్య. పట్టణంలో ఆ ప్రాంత్రం చాలావరకు నిశ్శబ్దంగా వుంది. రోడ్లమీద వాహనాల సందడి కూడా బాగా తగ్గిపోయింది.

"చాలా ఆలస్యమైంది" నెమ్మదిగా అనుకున్నాడు.

పూజారికి సరిగా వినబడక "ఏమిటి" అని అడిగాడు.

"ఆలస్యమైనట్టుంది" స్పష్టంగా అన్నాడు ఈసారి వినుగ్గా.

"దేనికి ఆలస్యం?"

సమాధానంకోసం తడుముకున్నాడు. "కొంచెంసేపట్లో పనైపోతుందని మీరంటే కాబోలనుకున్నాను. చాలాసేపయింది"

"దేవుడి ప్రార్థన చేసేటప్పుడు గడియారం చూసుకుంటూ చేస్తామా వీరయ్యా! ఆ కుర్రాడు చిన్నప్పటినుంచి జబ్బుపడి లేవలేకుండా వుండేవాడు... ఇప్పుడు చాలా నయం"

"ఆ కుర్రాడి ఆరోగ్యంకోసం పూజ చేశారా మీరిపుడు..."

"అం. ప్రతీ శుక్రవారం ఆ కుర్రాడికోసం

యముడ్ని తప్పించుకోవడంకోసం మార్కండే యుడు చేసిన పూజ చేస్తాను''

"అలాగా!" వీరయ్య ఆశ్చర్యపోయాడు. అతనికా మార్కండేయుడెవరో, అతను చేసిన పూజ ఏమిటో తెలీదు. అయితే తన అజ్ఞానం బయటపెట్టుకోవటం అతనికి బొత్తిగా ఇష్టం లేకపోయింది.

"ప్రతీ పిల్లాడికీ తెలును ఆ కథ" పూజారి పొడిగించేరు.

"అవును... నిజమే" వీరయ్య జాగ్రత్తగా జవాబిచ్చేడు. పొడిముక్కలు కాకుండా మరికా స్త మాట్లాడకపోతే బాగుండదని అనుకున్నా డు. ఇంతలో కొందరు పురోహితులు వాళ్ళకు కుడివేపు వున్న సందులోకి తిరుగుతుండటం చూసి, వాళ్ళని చూపుతూ,

"వాళ్ళకింకా బాగా తెలును ఏది చేస్తే మంచి జరుగుతుందో..." అన్నాడు.

పూజారి అటువైపు తిరస్కారంగా చూసే డు, "వాళ్ళకేకాదు, వాళ్ళ తాతముత్తాతలకు కూడా..."

"నిజమే" అంగీకరించేడు వీరయ్య.

ఈసారి డైరెక్టుగా అడిగేసేడు పూజారి

"మార్కండేయ పురాణంనించి నువ్వేం గ్ర హించేవు వీరయ్యా!"

గొంతులో వెలక్కాయ ఇరుక్కున్నట్లయింది వీరయ్య పరిస్థితి. క్షణం ఆలోచించి అన్నాడు

"నేనెంతవాణ్ణి. మీలాటి పండితులు గ్ర హించగలరు అలాటి విషయాలు"

"సరే... అయితే ముందు మార్కండేయుడి గురించి నీకేం తెలుసో అది చెప్పు"

వీరయ్యకు విసుగేసింది. ఇదెక్కడి పీడరా బాబూ, ఇలా తగుల్చుకున్నాను. నా తెలివి తక్కువతనం బయటపెట్టేవరకు వూరుకోడు కాబోలు ఈ పూజారి అని చిరాకు కలిగింది. ఇంక దీనికి ఫుల్‌స్టాప్ పెట్టేయాలి అనుకున్నా డు.

"అప్పుడెప్పుడో మా నాన్నమ్మ చెప్పింది. మరోసారి మీరు చెప్పండి వింటాను" అన్నా డు.

"అలా అడుగు. ఏదైనా విషయం తెలీక పోతే అడిగి తెలుసుకోవటం తప్పు, అవమానం కాదు" ఉపదేశించాడు. తర్వాత మార్కండే యుడి చరిత్ర బోధించి, అతడు చేసిన పూజే ఈ కుర్రాడికోసం చేస్తున్నాననీ, ఆ పూజామహా త్మ్యం చాలా గొప్పదనీ వివరించేడు.

"ఆ కుర్రాడు బతుకుతాడంటారా?" కుతూ హలం తొంగిచూసింది వీరయ్య స్వరంలో.

"అది మనమెలా చెప్పగలం! పూజ చే యడం మన విధి. ఫలితం నిర్ణయించడానికి మనమెవ్వరం? అదంతా కర్మమీద ఆధారపడి వుంటుంది"

ఆ మాటలకి మరేమనలేక నిజమేనని ఒప్పుకోక తప్పలేదు వీరయ్యకి.

వాళ్ళు గుడి సమీపించేరు. ఆ ఆంజనేయ స్వామి కోవెలకీ, పూజారికీ విడదీయలేని సంబంధం వుంది. ఆ గుడి ఆవరణలోనే చిన్న చెక్కలతో కట్టిన గది ఒకటి వుంది. అందులోనే అతని భోజనం, పడకా అంతా. ఆ కోవెలలో దేవుడి అర్చనా, ఆలనా, పాలనా అంతా చూసే పూజారి అతనే.

వీరయ్య లోనికి వెళ్ళడానికి తటపటా యించాడు.

"నేను వెళతాను. ఇప్పటికే చాలా ఆలస్య మైంది" బలహీనంగా అన్నాడు.

"అంతదూరంనుంచి నాతో వచ్చి దేవుణ్ణి చూడకుండా వెళతావా?" వీరయ్య సంది గ్ధంలో పడ్డాడు.

పూజారే మళ్ళీ అన్నాడు "ఏదో విషయం అడగాలని కాకపోతే నన్ను ఆ పార్కుదగ్గిర నువ్వెందుకు ఆపినట్టు. ఇంతసేపూ నాతో వున్నా నేను నీ సంగతేం అడగలేదు. నువ్వు చెప్పలేదు"

దొరికిపోయినట్టయింది వీరయ్యకి. తప్పు లు వరసగా చేస్తూ మేష్టారికి దొరికిపోయిన స్కూలు విద్యార్థిలా వుంది అతని పరిస్థితి.

"రా! లోపలకి!!"

వీరయ్య బుద్ధిగా అతని వెనకనే తలొంచు కొని గుడిలోపలకి ప్రవేశించాడు. గర్భగుడిలోని ఆంజనేయమూర్తి విగ్రహం దీపాలకాంతిలో అస్పష్టంగా పొడగడుతోంది. భక్తులు అక్కడ విడిచివెళ్ళిన అరటిపళ్ళు, కొబ్బరిచిప్పలూ, చిల్లర డబ్బులూ పూజారి గబగబ ఒక చిన్న బుట్టలోకి ఎత్తుకున్నాడు. అతను వీరయ్య

చేతికి రెండు అరటిపళ్ళూ, ఒక కొబ్బరిచిప్ప అందించేడు.

"నీకు బహుశా బాగా ఆకలి వేస్తుండొచ్చు. ఇవి తిను. ఒక గ్లాసు పాలు కూడా తెస్తాను తాగు" అంటూ తన నివాసంలోకి వెళ్ళి ఒక లోటాతో పాలు తెచ్చి యిచ్చేడు.

గుడి ఆవరణలో గోడకి చేరబడి మఠం వేసుకుని కూర్చున్నాడు వీరయ్య. ఆ రాత్రివేళ ఊరంతా నిద్రలో మునిగినట్టుంది. అందులో ఆ వీధి చివరగా వుండేమో ఎవరూ మసలుతున్న జాడేలేదు. ఎప్పుడూ పెద్దగా అరుస్తూ కొట్లాడుకునే ఊరకుక్కలు కూడా నిద్రపోయినట్లున్నాయి. వాటి మొరుగుళ్ళు ఏవీ వినరావటంలేదు. గుడి ఆవరణలోంచి నిటారుగా పెరిగిన రెండు కొబ్బరిచెట్లుమాత్రం వీస్తున్న చిరుగాలికి ఆకులు అల్లల్లాడిస్తున్నాయి శబ్దరహితంగా. అప్పుడు ప్రపంచంలో అవుతున్న చప్పుడల్లా వీరయ్య కొబ్బరి ముక్కలు నములుతున్నప్పుడు వస్తున్న చప్పుడు మాత్రమే అన్నట్టుగా వుంది. తడి ఇసకనేలమీద ఎడ్లబండి చక్రాలు కదులుతున్నప్పుడు అయ్యే నవ్వడిలా వుంది. తను చేస్తున్న చప్పుడికి వీరయ్య రవంత కించపడి, శబ్దం కాకుండా నమలడానికి ప్రయత్నం చేయబోయాడు. అయితే ఆ ప్రయత్నంలో ఒక కొబ్బరిముక్క శ్వాసనాళంలోకి జొరబడింది. దాన్ని బయటకి పంపడానికి శరీరం చేస్తున్న కృషి మూలంగా ఆ ప్రాంతమంతా 'ఖంగ్, ఖంగ్'మంటూ వీరయ్య దగ్గుతో మారుమోగిపోయింది. ఊపిరి తియ్యడానికి కూడా వీల్లేకుండా దగ్గటంవలన అతను అలసిపోయి రొప్పసాగేడు. చేస్తున్న పని ఆపి తనవంకే తదేకంగా చూస్తున్న పూజారికి జరిగిందేమిటో చెప్పే ప్రయత్నం చేయబోయేడు.

"అది... అది..." అంటూ మాట రాక ప్రయాసపడ్డాడు. అంతలోనే నవ్వు మొహంతో వున్న పూజారిని చూస్తుంటే అతనిలో కోపం రాజుకోసాగింది. నన్ను మాటల్లోపెట్టి, మొహమాటపరచి ఇంత రాత్రివరకు వుంచటానికి ఇతడెవరు? నామీద పెద్ద హక్కుదారుడిలా చలాయిస్తున్నాడే... అన్న భావం వీరయ్యకు కలిగింది.

కాని పూజారి, "ఆ పాలు తాగు. సర్దుకుంటుందిలే" అన్నాడు. నన్నేదో పసివాణ్ణను కుంటున్నట్టున్నాడు. పాలు తాగమంటున్నాడు. తాగకపోతే పట్టి బలవంతాన నోట్లో పోస్తాడు కూడా కాబోలు. ఆకస్మికంగా అతనిలో వ్యక్తిత్వం నిద్రలేచింది.

"నేను పాలు తాగను. నాకు పాలు నయించవు" అంటూ లోటా చేత్తో పక్కకి జరిపేడు.

పాలగ్లాసు అలా చేత్తో నెట్టకూడదు హెచ్చరించేడు అతడు. వీరయ్య ఇక ఏమాత్రం పూజారి ఉపదేశాలను సహించే స్థితిలో లేడు. అందుకే అన్నాడు విసురుగా

"నాకూ తెలును. కానీ ఎవరు పాటిస్తున్నారు లెండి ఆ నియమం"

"తాగకపోతే పోయేవు. కానీ మురికినీళ్ళు అవతల పారబోసినట్లుగా తోసేయడం మంచి పనేనా వీరయ్యా!" స్వరం మృదువుగా మార్చి అడిగేడు పూజారి.

జవాబు తడబడుతూ ఇచ్చేడు వీరయ్య. "కాదు... కాదు... నేను తోసెయ్యలేదు. మీకు దగ్గిరగా పెట్టేను. మీరు తీసుకుంటారని... అంతే..."

వీరయ్య సంజాయిషీ పూర్తిగా వినకుండానే దూరంగా చూస్తూ చెప్పడం మొదలుపెట్టేడు పూజారి. "పాలంటే ఏమిటనుకుంటున్నావు నువ్వు. లక్ష్మీదేవి ప్రతిరూపం. అంటే ఐశ్వర్యచిహ్నం అన్నమాట. నువ్వు పాలను ఇష్టపడటంలేదంటే... ఆ గ్లాసును దూరంగా తోసేశావంటే, నీకు లక్ష్మి అవసరం లేదన్నమాట. లక్ష్మీదేవి ఎప్పుడూ, ఎక్కడున్నా తన మునివేళ్ళ మీదనే వుంటుంది. అవకాశం వస్తేచాలు కదిలిపోవటానికి వీలుగా. ఆమెను లాలించి, బుజ్జగించి, నిలుపు చేసుకునే మార్గాలు కొన్నే వున్నాయి తెలుసా. ఆమెను ఆ మార్గాలద్వారా ప్రసన్నం చేసుకున్నవాడి ఇల్లు సకల సంపదలతో తులతూగుతుంది. ఆ సంగతి తెలీనివాళ్ళు ఆమెను ఇట్టే దూరంచేసుకుంటారు"

ఇంకా అతను చెప్పడం పూర్తికాకుండానే వీరయ్య ఎంతో భక్తిశ్రద్ధలతో ఆ పాలగ్లాసు అందుకుని ఒక్క చుక్క కూడా కిందపడకుండా పూర్తిగా తాగేశాడు.

"అదీ... మంచిలక్షణం" ఆ వృద్ధుడు అన్నాడు "పూర్వం ఇలాగే కుబేరుడు ఒకసారి

తన భవనంలో నేలమీద ఒక చుక్క పాలను వొలకబోసినందుకు విపరీతమైన క్లేశానికి గురయ్యేడు. ఆ కథ తెలుసా నీకు?'' కథ మొదలు పెట్టి పూర్తి చేసేసరికి వీరయ్య తన మనసులో మాట మరి దాచుకోలేకపోయాడు. కొంచెం సిగ్గుపడుతూనే బయటపెట్టేడు

''నాకు అయిశ్వర్యవంతుణ్ణి కావాలనుంది. ఏదైనా మార్గం చెప్పండి. మీరేం చెపితే అది చేస్తాను. ఎంత కష్టమైనాసరే...''

''ఏదైనా చేస్తావా...?'' వెంటనే గుచ్చి అడిగేడు అతను.

ముందు వీరయ్య తొట్రుపాటు పడ్డాడు. కాస్త ఆలోచించి అన్నాడు, ''ఏదైనా... అంటే తప్పు కానిది. నా వుద్దేశం మీకు అర్థమైందనుకుంటాను''

''నువ్వనుకుంటున్నదేదో నాకు తెలీదు. సగం మనసుపెట్టి చేసే పనులెప్పుడూ సగంలోనే ఆగిపోతాయి. ఏకాగ్రతతో, లక్ష్యశుద్ధితో పనిచేసేవాళ్ళనే విజయాలు వరిస్తాయి'' నిశ్చయంగా అన్నాడు పూజారి.

వీరయ్యకెందుకో భయం కలిగింది. 'నేరకపోయి వచ్చేన్రా దేవుడా! ఈ పూజారేదో మంత్రగాడో, రసవాదో కాబోలు' అనుకున్నాడు. లోపల భయం, ఆ నీరవమైన వాతావరణంలో ఎక్కువవుతూంటే, ఒకసారి తనముందు కూర్చున్న అతనివంకా, అతని నివాసంవంకా అనుమానంగా చూసేడు. 'పాలల్లో ఏం కలిపాడో ఏమో! ఒకవేళ ఆ కుటీరంలోకి తీసుకుపోయి బలిచ్చేస్తాడో ఏమిటో' అని వణికిపోయేడు. వెంటనే లేచి పారిపోదామనుకున్నాడు. మసక నక్షత్రాల వెలుగులో ఆ పూజారి అతని కంటికి వేరే లోకానికి చెందిన మనిషిలా కనిపించేడు. నిశ్శబ్దంగా వున్న ఆ రాత్రివేళ అతని స్వరం వింటుంటే ప్రేతాత్మతో మాట్లాడుతున్నట్లనిపించింది.

''అర్థరాత్రయినట్లుంది. బహుశా తెల్లవారిపోవచ్చేమో... నేను ఇంటికి వెళ్ళాలి'' అంటూ హఠాత్తుగా లేచి నిలబడ్డాడు వీరయ్య.

అతన్నేం ఆపకుండా, ''నిజమే... ఇక ఇంటికి వెళ్ళు. మీ ఆవిడ కంగారుపడుతుందేమో'' అన్నాడు ఆ పూజారి. తనకు అనుమతి దొరికేసరికి వీరయ్య భయాలన్నీ తొలగిపోయేయి. భగవంతుడివైపు తిరిగి సాష్టాంగనమస్కారం చేసి కదలకుండా కూర్చున్న పూజారిముందు నుంచి వడివడిగా బయటకు వచ్చేశాడు.

వీధులన్నీ నిశ్శబ్దంగా వున్నాయి. ఎక్కడి నుండో పహారా తిరుగుతున్న పోలీసు వూదుతూన్న విజిల్ వినిపించింది.



వీరయ్య తన పెట్టె ముందేసుకుని దానిలో వున్న ఎర్రరంగు అట్ట వేసిన పుస్తకం తీసేడు. దీక్షగా దాంట్లో రాసివున్న పద్దులు చూసుకుంటున్నాడు. ఇంతలో బాలూ వచ్చి తొడమీద కూర్చున్నాడు.

''లే... లే... పోయి ఆడుకో... నన్ను బాధపెట్టకు'' కొడుకుని అవతలకి పంపాలని చూసేడు.

''అబ్బా... నా జాగా ఇదీ. నేను వెళ్ళనంటే వెళ్ళను'' అంటూ తండ్రి తోసేస్తుంటే మొండికేసిమరీ అతని తొడమీదకు చేరుతున్నాడు వాడు. పుస్తకంలోకి వాడి తలమీదనుంచి తొంగి చూడాల్సి వస్తోంది వీరయ్యకి. వాడి జుత్తు అతని ముక్కుకి తగిలి చిరాకుపుట్టిస్తోంది. వుండబట్టలేక

''బాలూ! లేస్తావా? లేదా?'' అని గద్దించేడు. అంతలోనే తగ్గిపోయి ''నీకు మంచివి కొంటానుకదా... లేమ్మా. మా నాన్నకదూ!'' అంటూ అనునయించేడు.

''ఏంటి కొంటావ్!'' అనడనిగేడు వాడు కుతూహలంగా.

''ఒక చిన్న బుజ్జి ఏనుగు'' మురిపించేడు తండ్రి.

''సరే... అయితే లే. పద.. కొను'' ఆదేశించే

డు.

"ఆహాఁ... అలాక్కాదు. ఇప్పుడు కాదు నాన్నా. నాకు కొంచెం పనుందికదూ!" పుస్తకం చూపుతూ అన్నాడు.

బాలూ తన కాలుతో లాగి తన్నేడు ఆ పుస్తకాన్ని. అది పోయి ఇంక్ బాటిల్‌మీద పడింది. బాటిల్ తిరగబడి పుస్తకం పేజీల మీద సిరా వొలికి, అక్కడనుంచి నేలమీదకి ప్రవహించింది. వాడు లేచి తన కాలి మడమతో ఆ సిరాని చెరిపేడు. తుళ్ళిన సిరా కొంత వీరయ్యా మొహంమీద, మిగిలింది పుస్తకంమీద పడింది.

వీరయ్యా కోపంతో పిచ్చివాడయ్యేడు. బాలూ రెండు భుజాలూ పట్టుకొని పైకి లేపి దూరంగా గది మూలపడేలా విసిరేసేడు. వాడు పెట్టిన బొబ్బలకి వంటింట్లోంచి తల్లి పరుగెత్తుకుంటూ వచ్చింది. వంటింట్లో పొగవల్ల ఆమె కళ్ళు నీరుకారుతున్నాయి.

"ఏమైందండీ? ఏమైందంటే చెప్పరేం!!" అంటూ పరుగెత్తుకుంటూ వెళ్ళి కుర్రాణ్ణి పట్టుకోబోయింది. తండ్రంటే ఏమాత్రం ఖాతరులేని వాడు దెబ్బతిన్న పులిలా తల్లికి దొరకకుండా తప్పించుకుని వీరయ్యదగ్గరకి పరుగెత్తుకుంటూ వచ్చేడు.

సిరా వొలికిపోయి తడిసిపోయున్న తన ఎకౌంటు పుస్తకం బాగుచేసే ప్రయత్నంలో వున్న వీరయ్యా మీనాక్షికి సమాధానంగా తల ఎత్తి ఆమెవంక చూసి వేలు చూపిస్తూ అన్నాడు,

"చూడు... ఈ కోతివెధవ ఎంత పనిచేశాడో"

"నేనేం కోతికాదు. నువ్వే కోతివి" బ్లాటింగ్ పేపర్‌తో సిరా అద్దుతున్న తండ్రి కాలిని గట్టిగా కౌగలించుకున్నాడు.

"మళ్ళీ వచ్చేవా! నన్ను వదుల్తావా? లేదా?" కోపంగా అరిచేడు.

"నిన్ను తీసుకెళ్ళి ఆ గుళ్ళో పూజారికిచ్చేస్తానుండు. నీ చర్మం వొలుస్తాడు. నీ పని చెప్తానుండు"

అసలా మాట ఖాతరే చేయలేదు బాలూ. 'నన్నేం చేయడులే. నాకు అరటిపళ్ళిస్తుంటారుగా..." వున్నట్టుండి, ఆ ఎకౌంటు పుస్తకం చేతపుచ్చుకు పరిగెట్టేడు బాలు. కేకలు వేస్తూ వీరయ్యా వెంబడించేడు. తండ్రికి చిక్కకుండా వాడు గదిలో ఈ మూలకీ, ఆ మూలకీ పరుగులు పెట్టేడు తూరీగలా. వాడి కళ్ళల్లో నీళ్ళెప్పుడో ఆవిరైపోయేయి. తండ్రిని ఏడిపించటం వాడికి చాలా సంతోషంగా వుంది. ఆపకుండా నవ్వుతూ గదంతా పరుగులు తీసేడు. వీరయ్యా ఎంత ప్రయత్నించినా వాడు దొరకటం లేదు. ఆయాసంతో రొప్పసాగేడు వీరయ్యా. కోపంగా అరిచేడు.

"ఆగరా... ఆగు... ఆగకపోతే చంపేస్తాను"

భార్య లోపలనుంచి వచ్చి "ఏమైందండీ.. ఎందుకా కేకలు. వాడితో మీకా పరుగులేమిటి?" మందలించింది.

"నాకేం కాలేదు. చూడు వెధవని ఏం చేస్తానో... గొప్ప రాక్షసి వెధవని కన్నావులే. ముందువాణ్ణి పట్టుకో" అన్నాడు.

మీనాక్షి ఏదో సమాధానమిచ్చింది కానీ అతను వినిపించుకోలేదు. అతడి దృష్టంతా ఆ పుస్తకం సంపాదించటం మీదేవుంది. ఆమె కూడా కొత్త టెక్నిక్ వుపయోగించి బాలూని పట్టుకోవాలనుకుంది. ఎటో చూస్తున్నట్టు నటిస్తూ, ఒక్కసారి వాడి మీద పడి పట్టుకోబోయింది. కానీ వాడెక్కడో దేవాంతకుడిలా వున్నాడు. తల్లివ్యూహ ముందే తెలిసిపోయింది వాడికి. కాస్తలో ఆమెను తప్పించుకున్నాడు. దాంతో మీనాక్షి వెళ్లి వీరయ్యను ఢీ కొట్టింది. వీరయ్యకి వెర్రెత్తిపోయింది. అదే సమయంగా భావించి వీధిలోకి పరుగెత్తేడు వాడు. వాడి వెనకనే బయటకు పరుగెత్తుకుంటూ వచ్చేడు వీరయ్యా. అడ్డంగావున్న భార్యను అవతలకి నెట్టేసేడు. ఆమె విసుక్కుంటూ వంటింట్లోకి పోయింది.

లేడిపిల్లలా చెంగుచెంగున మెట్లు దూకుతూ పరుగెత్తిపోతున్న బాలూని వెంట తరమలేకపోతున్నాడు వీరయ్యా. అతనికి పరిసరాల మీద ధ్యాస పూర్తిగా పోయింది. పరుగుతీస్తున్న కొడుకు వుంగరాలజుత్తు, వాడి చేతిలో ఎర్రపుస్తకం మాత్రం కనిపిస్తున్నాయతని కంటికి. వినాయక వీధిలో నడుస్తున్న వాళ్లు కొంత మంది ఆగి ఈ చోద్యం చూడటం మొదలుపెట్టేరు. వీరయ్యా వాళ్లనర్థించేడు "పట్టుకోండి.. వాణ్ణి పట్టుకోండి" అంటూ. కొందరు వుత్సాహంగా ముందుకు వచ్చేరు. వాళ్లు వాణ్ణి చుట్టుముట్టేసరికి నిషా ఎక్కినట్లయిపోయింది

బాలూకి. ఆ ఆటలో పూర్తి మజా అనుభవిస్తున్నాడు వాడు. చుట్టూ చూసేసరికి తండ్రితోపాటు మరికొంతమంది పట్టుకునే వాళ్లు కనిపించేరు. ఎలాగూ దొరికి పోకతప్పదని తెలిసిపోయింది వాడికి. ఎవరూ అనుకోని పనిచేసేడు వాడు. వెనక్కి తండ్రి దగ్గరికి రాబోతున్నట్లు నటించేడు. ఇంక రెండు క్షణాల్లో తండ్రి పట్టుకుందామనుకునేసరికి వేగంగా చేపపిల్లలా జారిపోయి, సైడు కాలవ దగ్గిరికి పరుగెత్తి పుస్తకాన్ని ఆ కాలువలోకి బలంగా విసిరేసేడు.

ఆ వీధిలో వున్న ఇళ్లముందు నించి వేగంగా ఒక నల్లనదిలా పారుతోంది ఆ మురిక్కాలవ. అదెక్కడికి పోతుందో ఎవరికీ అక్కర్లేదు. అయితే దాంట్లో పడిన వస్తువేదీ మళ్లీ దొరకడం అసాధ్యం అని అందరికీ తెలును. మున్సిపల్ ఎన్నికలప్పుడు మాత్రం కొందరు అభ్యర్థులు వచ్చి ఆ కాలవ గురించి ఏవో విమర్శలు చేస్తుండటం పరిపాటి. వాళ్లని చూసి ఆ వీధి ప్రజలు వీళ్లు ఓట్ల కోసం వెతుకుతున్నారు కాబోలని వెటకారంగా అనుకుంటూ వుంటారు. మేఘమాలికల్లా ముసిరే దోమలూ, దుర్గంధ పూరితంగా వీచే గాలీ, కళ్లు మూసుకుని వచ్చిన వాళ్లకైనా వినాయక వీధిలో అడుగుపెట్టేమని వెంటనే చెప్పగలిగేలా చేస్తాయి.

ఆ కాలవ వడ్డున చాలామంది చేరి, నల్లగా, సిరాలు, బుడగలు వస్తూ పారుతూన్న కాలువలోకి చూస్తున్నారు. వీరయ్యా మీద సానుభూతి కురిపిస్తున్నారు. విషయం సరిగ్గా తెలీనందువల్ల కాలవలోపడిపోయిన వస్తువు పట్ల రకరకాల పుకార్లు పుట్టుకొచ్చేయి. వాళ్లు అనుకునే మాటలు వీరయ్యా చెవిన పడుతున్నాయి.

''ఒక పెట్టె పడిపోయిందట''

''ఆ కుర్రాడు లేడూ... వాడే... బంగారం గొలును పారేసేడట''

అందరి దృష్టీ బాలూ మీద కేంద్రీకరించబడింది. ఈ సంఘటనలో వాడో హీరో అయిపోయేడు. సిగ్గనిపించింది కాబోలు తల దించేసేడు వాడు. పొద్దున్న తొమ్మిదిన్నరే అయింది కానీ ఎండ దుర్భరంగావుంది. అలసటతో, ఆగ్రహంతో వీరయ్యా ఎర్రబారేడు. బాలూ మొహం కూడా కందిపోయింది. రెండు చేతులూ వెనక్కి పెట్టుకుని వాడు విస్మయంగా ఆ కాలువ వడ్డున నిలబడి తదేకంగా కాలువలోకి చూస్తున్నాడు. ఆ పుస్తకం జాడ ఎక్కడా కనిపించటంలేదు. చేసిందంతా చేసి ఏమీ పట్టనట్టు తన్మయత్వంలో మునిగిపోయున్నవాణ్ణి చూసేసరికి వీరయ్యా రక్తం కుతకుత వుడికిపోయింది. ఆ వీధిలో పిల్లల్లాగేవాడి ఒంటిమీద కూడా చొక్కా వక్కటే వుంది. కింద మరేదీలేదు. ఇద్దరు కూరలమ్ముకునే ఆడవాళ్లు, కొంతమంది స్కూలుకు బయల్దేరిన పిల్లలు, పెరుగు అమ్ముకునే ఒకామె, ఆ గుంపును చూసి సైకిలు దిగినవాడొకడు, మరికొంతమంది పరస్పరాభిప్రాయాలు ప్రకటిస్తూ మాట్లాడుకుంటున్నారు.

ఒకతను అన్నాడు... ''కొందరంతే... పిల్లల డిగినవన్నీ ఇచ్చి నెత్తినెక్కించుకుంటారు''

అది విని ఆవేశంతో రగిలిపోతూ వీరయ్యా కొడుకు చొక్కాపట్టి పైకెత్తి వాడి వీపుమీద బలంగా చరిచేడు. వాడు 'ఓ...' అంటూ రాగం మొదలుపెట్టి, తండ్రికి దూరంగా పోయేడు. అందరి దృష్టీ ఈ కొత్త సీనుమీద పడింది. ఎవరో వాణ్ణి పక్కకి లాగేశారు.

''కుర్రాణ్ణి చంపేసేలా వున్నాడు చూస్తే''

మరొకరు జతచేసేరు... ''వాణ్ణి కూడా కాలవలో తోసేస్తేసరి''

చేతిలో బుట్టపట్టుకుని బజారుకు బయల్దేరిన ఒకామె ముందుకొచ్చి అంది ''నీకేమన్నా బుద్ధుందా లేదా? ఆ చిన్న కుర్రాణ్ణి కొట్టడానికి చేతులెలా వచ్చేయి?'' చేతిలో బుట్ట పక్కకి దించి కుర్రాణ్ణి దగ్గిరగా పొదివి పట్టుకుంది.

బాలూ మంచి లౌక్యంతో ఆమె చీర కుచ్చిళ్లల్లో మొహందాచి ఏడవసాగేడు. ఇంకో స్త్రీ మొదటామె దగ్గిరనుంచి వాణ్ణి తన దగ్గరకి లాక్కుంటూ అంది, ''పిల్లల విలువ నవమాసాలూ మోసి కనే వాళ్లకే తెలుస్తుందిలే... మగవాళ్లకేం తెలుస్తుంది''

అయితే సైకిలు పట్టుకున్న వ్యక్తి ఆ స్టేటుమెంటు అంగీకరించలేదు. గట్టిగా బదులిచ్చేడు... ''అదేంమాట! పిల్లలకి బుద్ధి చెప్పకపోతే ఎలా? లేకపోతే పెద్దయితే మనం చెప్పినట్టు వింటారా?''

వీరయ్యా అతని వంక కృతజ్ఞతతో చూసేడు. అతనికో తోడు దొరికింది. అందుకే ధైర్యంగా ఆ

ఆడవాళ్లతో అన్నాడు...

"మీకు మాట్లాడ్డానికేం పోయింది. వాడు నా చిట్టాపద్దుల పుస్తకం పారేసేడు. అది లేకపోతే నా వ్యాపారం సాగదు"

"పసివాడికి నీ చిట్టాపద్దులేం తెలుస్తాయి. వాటి అవసరం వాడికేముంది? ఆ దేవుడు కూడా అంతేలే. పిల్లల విలువ తెలియని వాళ్లకే బిడ్డల నిస్తాడు" ఈసడింపుగా అంది ఒకామె.

"అయినా నువ్వసలు వాడికి అందేలా అంత ముఖ్యమైనవి వుంచడం నీదే తప్పు"

ఒకామె ముందుకు వచ్చి అంది... "నీకు పెళ్లై పన్నెండేళ్లయినా పిల్లలు లేకపోతే తిర పతి దేవుడికి మొక్కుకోలేదూ! ఆ దేవుడు జాలిదలిచి పిల్లాణ్ణిస్తే వాణ్ణిలా బాధిస్తావా? ఇందుకే కన్నావా? ఏం?"

"నేనేం చేసేది" దీనంగా అన్నాడు వీర య్య. అతను తనొక తెలివి తక్కువ వాడిననుకో సాగేడు. ఈ సంఘం అన్నివిధాలా తన్ని అణిచేస్తోంది. ప్రతీ అడ్డమైనవాడూ తననేదో ఒకటి అనడానికి హక్కువున్న వాళ్లలా ప్రవర్తి స్తున్నాడు. తనకి వత్తాసు పలికిన సైక్లిస్టు కోసం చూసేడు. అతనెప్పుడో వెళ్లిపోయినట్టున్నాడు. బాలూ అప్పుడే ఒక దోసకాయలమ్మే స్త్రీ చంకన చేరి విడవకుండా రాగాలాపన చేస్తున్నాడు. బోలెడుమంది సానుభూతిపరుల్ని సంపా దించుకోగలిగేడువాడు. వీరయ్యకి తెలుసు వాడు, పిప్పరమెంట్లు కొనిచ్చేవరకూ విడిచిపె ట్టడని.

ఆ గుంపంతా బాలూ చుట్టూచేరి ఏదేదో మాట్లాడుతూ వుండటంతో వీరయ్యకు కాస్త రిలీఫ్ దొరికింది. పక్కనేవున్న చెట్టుకొమ్మ నొక దాన్ని విరిచి, కాలవలోకి దాన్ని గుచ్చి కెలికేడు. గుప్పుమని దుర్గంధం పైకి లేచింది తప్ప పుస్తకం వున్న దాఖలా ఏం కన్పించలేదు. ఇంతలో ఆ తోవంట పోతున్న స్కూల్ మేష్టరొక డు అది చూసి ఒక ఉచిత సలహా పారేశాడు.

"కాలువ తుడిచేవాణ్ణొకడ్ని పిలిచి, వెదక మంటే సరిపోయే దానికి నువ్వెందుకు ప్రయా సపడిపోవటం. దండగమారి పని కాకపోతే... వాడి దగ్గిరయితే వెతికే సరంజామా వుంటుంది. నువ్వేం చేయగలవు? అందరూ అన్ని పన్లకీ సిద్ధమైపోతుండటంవల్లే లోకం ఇలా తగలడుతోంది" ఆ మాటలు వినగానే మండుతున్న కట్టెపట్టుకున్నట్లనిపించి, దాన్ని చప్పున విడిచిపెట్టేసి లేచి నుంచుండిపోయే డు వీరయ్య.

"నేనే పనిచేసినా తప్పులాగే వుంటోంది" అని గొణుక్కోకుండా వుండలేకపోయేడు. ఇంటివైపు నడిచాడు దిగులుగా. ఇంటి ముందుకు రాగానే మెట్లెక్కబోతూ తల తిప్పి చూసేసరికి, తన సోదరుడి కుటుంబం అంతా వాళ్ల గుమ్మం ముందు గుంపుగా చేరి చోద్యం చూస్తున్నారు.

తలకొట్టేసినట్లనిపించి, తల దించుకుని వడివడిగా లోనికివెళ్లిపోయేడు.

★ ★ ★

తనకెంతో విలువైన ఆ పుస్తకం పోయేసరికి వీరయ్యకేంచెయ్యాలో పాలుపోలేదు. అతని వ్యవహారాలన్నిటికీ అది చాలా ప్రధానం. అది పోయిన సంగతి బయట పెట్టదలుచుకోలేదు అతను. ఇవ్వవలసిన వాళ్లెవరైనా ఎగేస్తారని భయం కలిగింది. ఇకమీదట చెట్టుకింద కూర్చుని కాతాదార్ల లెక్కల వివరాలు తీరిగ్గా చెప్పటానికి కుదరదు. అటూ, ఇటూ పచార్లు చేస్తూ తన జ్ఞాపకాల పుస్తకంలోంచి ఒకటొక్క టిగా బయటకు తీయాలి. అది కష్టమైన పని. అందులోనూ ఆ రోజు చాలా ముఖ్యమైనది కూడా... సుమారు పదిమంది దాకా అతడికి డబ్బు ఇవ్వవలసిన రోజు.

"మీ పుస్తకం తియ్యండి. వీరయ్యగారూ!" కాళీ అడిగేడు.

"దాన్ని బైండింగుకిచ్చేనయ్యా. చాలా పాడై పోయింది. నువ్వు చూసేవుకదా! అయినా దాని అవసరం లేదులే. నాక్కావలసిన లెక్కలన్నీ ఇక్కడున్నాయి" కణతల మీద చూపుడు వేలు తాటిస్తూ చెప్పేడు.

'కాళీ' ఈమధ్య కొన్ని రోజులుగా రావటం లేదేమో, తన మామూలు చోటు విడిచిపెట్టి గేటు దగ్గిర గోడకానుకుని నిల్చున్న వీరయ్యని, అతని చేతిలో పెట్టెగానీ, పుస్తకంగానీ లేకుండా చూడటంతో వాడికేదో అనుమానం కలిగింది. వాడి కళ్లల్లో కనిపించిన ఆ భావానికి చలించే డు వీరయ్య. బహుశా అరుల్‌దాస్ వాడికేదో చెప్పివుండాలి అనుకున్నాడు. కాళీని చూస్తే

చేతిలో కొరడాగానీ మరే ఆయుధంగానీ లేకుండా రింగ్ మాష్టర్ ఎదురైతే చూస్తున్న పులిలా వున్నాడు.

"మీ పాతజాగా వదిలేసారేం?" మరో ప్రశ్న సంధించేడు.

"అదా!" నవ్వడానికి ప్రయత్నించేడు. "అక్కడ కూచుని, కూచుని విసుగు పుడుతోంది కాళీ! కొంచెం మార్పు కావాలని..." అంటూ పొట్టిగా వున్న ఆ కాంపౌండు గోడ మీదకి ఎక్కి కూర్చున్నాడు వీరయ్య కాళ్లూపుతూ... పక్కనే రోడ్డు మీద ఎడ్లబండొకటి పోతూంటే లేచిన దుమ్ముకి ఆపుకోలేక తుమ్మేడు.

"అయితే మాత్రం. ఇక్కడెందుకయ్యా! ఛీ... ఛీ... రోడ్డు మీదున్నట్టే" ఈసడించేడు కాళీ.

"నిజమే... అందుకే ఈ చుట్టు పక్కల ఆఫీసు పెట్టుకోవటానికి సరైన జాగా వెతుకుతున్నాను. కుర్చీలు, టేబుళ్లు వేయిస్తే... చూడు... నీలాటి మోతుబర్లు వచ్చినపుడు కూర్చోడానికి వీలుంటుంది. మీలాటి వాళ్లకి సదుపాయాలు కూడాకొన్ని నేను చేయాలిగదా! ఏమంటావ్?" అని అతని వంక చూసేడు.

"అవున్లెండి... కానీ ఆ మర్రిచెట్టు కిందయితేనే చాలా బాగుంటుందయ్యా! చల్లని నీడా, చక్కనిగాలీ... నాకెంతో ఇష్టం"

"కానీ నా కిష్టంలేదు. అలిసిపోయి వచ్చిన నీలాటివాడు దానికింద కాసేపు కునుకు తీసిపోగలుగుతాడు. కానీ నాలాటి వ్యవహారాలు చేసుకోవలసిన వాళ్లకి మాత్రం అదిసరయిన స్థలం కాదులే... కాళీ... ఆ పక్షుల గోలలో మీరు చెప్పేది నాకు వినబడదు. నేను అరిస్తే గానీ మీకు బోధపడదు. పైనించి వాటి రెట్టలూ, కిందనించి వంటి మీదకి ప్రాకేచీమలూ. అబ్బబ్బ... నాకు మాత్రం భరించడానికి వీల్లేకుండా వుంది"

"మీ పెట్టె కనబడదేం... వీరయ్యగారూ?" అకస్మాత్తుగా అడిగేడు కాళీ.

"దాన్ని రంగు వేయించటానికిచ్చేను. బాగా కలిసొచ్చిన పెట్టె, పాడవలేదుగానీ, రంగు వేయిస్తే మరికొంతకాలం మన్నుతుందని పించి నిన్ననే ఇచ్చేను"

"మంచి నమ్మకమే అయ్యా! మా ఊర్లో ఒక ముసిలాడున్నాడు. వాడిచేతి కర్ర పిడి ఎప్పుడూ విరిగిపోయేవుంటుంది. వేరే కొత్త పిడి వేయించుకోమంటే..."

చేత్తో వారించేడు వీరయ్య.

"అతనెప్పుడు ఆ పిడి మార్చినా, ఆ సంవత్సరం పంట పోతుందన్న మాట"

ఆశ్చర్యపోయేడు కాళీ. "మీకెలా తెలును... వీరయ్యా!"

"దానికేముందిలే... ఆ మాత్రం ఆలోచనలు తెలుసుకోలేకపోతే ఈ బ్యాంకు వ్యవహారాలు నేనెలా చేయగలను? నీ గురించి కూడా చెప్పగలను. నీ మొల్లో దోపుకున్న చిక్కంలో నువ్వు బేంకునించి తీసుకున్న డబ్బుంది... అవునా?"

"అబ్బే... లేదే... నమ్మండి బాబూ! వాళ్లదగ్గిర్నుంచి అంత తొందరగా డబ్బు మన చేతికి వస్తుందా స్వామీ!"

"ఆహా, అయితే విను. నీ లోను దరఖాస్తు మంగళవారం నాడు మంజూరయింది. ఈరోజు శుక్రవారం. ఇప్పుడు నీ జేబులో తొమ్మిదివందల డెబ్బయి అయిదు రూపాయలు వున్నాయి. గుమాస్తాలకింద ఇరవై, అరుల్ దాస్‌కి అయిదు రూపాయలు ఖర్చుచేసేవు" సోదా చేస్తున్నట్టుగా చూసేడు వీరయ్య.

కాళీ చూపులు అతని చూపుల్లో కలిసేయి. తనని కాదన్నట్టు తల పక్కకి తిప్పేసేడు వాడు.

ఆ మధ్యాహ్న సమయంలో వీరయ్య కోసం వచ్చిన వాళ్లెవ్వరూ దగ్గర్లోలేరు. కొందరు బేంకులోకి పోయేరు. మరికొందరు మర్రి చెట్టు నీడలో జోగుతున్నారు. వాళ్లు వీరయ్య దగ్గరకి రావటానికి మరికొంత సమయం పడుతుంది. వీరయ్యకీ అది ఒకందుకు మంచిదేనని పించింది. కాళీ వంటి ఘటికుడితో మాట్లాడటం ఒంటరిగా జరిగితేనే మంచిది. లేకపోతే మిగిలిన వాళ్లు వాడినుంచి ఎగేయటం నేర్చుకోగలరు. కాళీ మాట విని పనులు చేసే రకంకాదు. వాడు తల ఎత్తి ఆకాశం కేసి చూసేడు.

"ఒంటిగంటవుతుందేమో టైము. వాళ్లు సరిగ్గా ఒంటిగంటకే రమ్మన్నారు. ఒక నిముషం లేటయినా అదో వంకగా చూపెట్టి డబ్బుకోసం మళ్లీ రేపు రమ్మంటారు. ఇప్పుడు

గాని అడగకపోతే, వాడు బేంకులో డబ్బు తీసుకుని అట్నుంచటే వెళ్లిపోతాడని, తన బాకీ తిరిగి రాదనీ, వీరయ్యకి తెలిసిపో యింది. అందుకే గట్టిగా అన్నాడు...

"నువ్వు నాకివ్వవలసిన నూట ఏభై రూపా యలూ, వాటి రెండు నెలల వడ్డీ ముప్పై రూపాయలూ, డబ్బు తీసుకోగానే ఇచ్చి వెళ్లు కాళీ... నాకవసరం వుంది"

"నూటా ఏభయ్యా! వడ్డీ ఏమిటి? నువ్వే మంటున్నావో నాకు తెలీటం లేదు వీరయ్యా!"

ఇంకో ఇంకో సందర్భంలో అయితే చటా లున పుస్తకం తీసి పేజీలు తిప్పి, అంకెలు గడగడా చదివి వినిపించి నోరు మూయించగ లిగేవాడు. వెంటనే కొడుకు మెదిలాడు మన సులో. ఎంతపని చేశావురా బాలూ!" అనుకు న్నాడు.

కాళీ వెళ్లిపోవటానికి సిద్ధమై వీరయ్యతో అన్నాడు...

"నన్ను ఎగేసేవాణ్ణనుకోకు వీరయ్యా! రేపొ ద్దున్న వస్తాను. నేనివ్వవలసిన లెక్క చూపెట్టు. అణా పైసల్తో సహా ఇచ్చేస్తాను. మరేం అను కోకు"

అతను వెళ్లిపోతూంటే మరేం మాట్లాడలేక పోయేడు వీరయ్య. అసహాయత అతన్ని కుంగదీసింది. తను వాణ్ణి ఎన్నిసార్లు ఆదుకు న్నాడో అతనికి జ్ఞాపకం వచ్చింది. తన మీద తనకే జాలి కలిగింది. తన పుస్తకం ఎలా తిరిగిరాదో ఈ కాళీ బాకీ కూడా అంతే అని తెలిసిపోయి నిట్టూర్చడం తప్ప మరేమీ చేయ లేకపోయేడు.

ఆ చిన్న ప్రహరీ గోడ మీద కూర్చుని, ఒకరొకరే తన ఖాతాదార్లు బేంకునించి రావటం చూస్తున్నాడు వీరయ్య. సెక్రటరీ కంటపడడా నికిష్టంలేక అతని కిటికీ కనిపించని మూలకూ ర్చున్నాడు. కొంతమంది మాత్రం వీరయ్య దగ్గిరకి వచ్చి నిజాయితీగా తాము అతనికి చెల్లించవలసింది చెల్లించి వెళ్లిపోయేరు. ఆ తర్వాత పదిహేను రోజుల్లో అలా అతను వెనక్కి సంపాదించింది పన్నెండు వందలు మాత్రమే. దాంతో వీరయ్య జీవితంలో ఆ అధ్యాయం ముగిసిపోయింది.

★ ★ ★

దారి తోచని పరిస్థితుల్లో వీరయ్య మళ్లీ గుడిమెట్లు ఎక్కేడు. గుడికి వెళ్లేముందు ఎన్నో సార్లు తనకి తనే చెప్పుకున్నాడు. తాను వెళు తున్నది దేవుడి దర్శనం కోసమేననీ, ఆ పూజారి కోసం కాదనీ... కానీ తన మీద తనకే నమ్మకం లేకపోయింది. అయితే పూజారీ అత న్ని చూసేక వదల్లేదు. గర్భగుడి ముందుకు అతను వెళ్లినపుడు, ఆ వెనక చీకట్లోంచి పూజారి స్వరం వినిపించింది.

"ఎవరదీ? ఓ వీరయ్యా!! రా... రా...! చాన్నా ళ్లకి కనిపించేవు"

వీరయ్య మనిషి కనబడకుండా పూజారి స్వరం వినిపించేసరికి భయభ్రాంతుడయ్యే డు. ఆఖరి భక్తుడు కూడా అప్పటికే దేవుడికి సాష్టాంగ నమస్కారం చేసి బయటకు పోతు న్నాడు. గుడిలో రెండు నూనె దీపాల వెలచటి కాంతి ప్రసరిస్తోంది. అగ్గరు ధూపాల వాసన, పూల పరిమళం కలిసి ఒక విధమైన ఉత్తేజ కర వాతావరణం కల్పిస్తున్నాయి. ఒక్క నిముషం పాటు తన్మయత్వం కలిగి, ఈ ప్రపంచానికీ కష్టసుఖాలకీ అతీతంగావున్న భావన కలిగింది మనసులో. తన్మయత్వం నుండి బయటపడి కళ్లు తెరిచేసరికి చిరున వ్వు మొహంతో పూజారి కనిపించేడు. పూజారి వంక చూసి పేలవంగా నవ్వేడు వీరయ్య.

"రా వీరయ్యా! పాలు, పళ్లు తీసుకుని కాసేపు కూచుని పోదువుగాని" ఆహ్వానించేడ తడు.

"లేదు... లేదు... ఇవుడు టైమెంతయిందో"

"ఇక్కడ టైముతో పనేలేదు. గడియారాల క్కర్లేదిక్కడ. చీకటైతే రాత్రి. వెలుతురుంటే పగలు. ఇదేం బేంకు కాదుగదా!"

బేంకు అనగానే తన గురించేనని గుటకలు మింగేడు. "నా దగ్గిరా గడియారం లేదు" మెల్లిగా అన్నాడు.

"నీ దగ్గిర తప్పకుండా వుండాలి. ఎంత వేగంగా వడ్డీ పెరుగుతుందో లెక్కకట్టాలి గదా!"

"నా బేంకు వుద్యోగం మరి లేదులెండి. ఇదిగో... ఈ సొమ్ము మాత్రం మిగిలింది" అంటూ జేబులోని కరెన్సీ నోట్లు చూపేడు.

పూజారి ఆసక్తి ఏమాత్రం చూపకుండా "రా! ఫలహారం చేద్దువుగానీ" అన్నాడు మళ్లీ.



"మళ్లీనా?" ఊరికే అతను పెడుతుంటే తినడం ఇష్టంలేకపోయింది.

"ఎన్నిసార్లైనా తప్పులేదులే. మనం ప్రతీ రోజూ తినటంలే. మళ్లీ మళ్లీ అని మానేస్తామా ఏం?"

ఈ మనిషితో ఎలా మాట్లాడాలో తెలియలేదు వీరయ్యకి.

"అహా... అదికాదు. చాలా టైమవుతుందేమోనని"

"ఎంత టైమయినా ఈ రోజేలే. రేపు మాత్రం అవదు. నిజంగా నీ కాలస్యం అవుతుందంటే వెళ్లిపోవచ్చు" అని పక్కకి నడిచి కనబడకుండాపోయేడు. వీరయ్య కొన్ని క్షణాలు ఆలోచించేడు. పూజారి తన సమస్యకేదైనా తరుణోపాయం చెబుతాడేమోనన్న ఆశ అతన్ని అడుగు బయటకు వేయనీయలేదు. నిశ్శబ్దంగా నడిచి పూజారి ఇచ్చిన అరటిపళ్లు, పాలు తాగి త్రేన్చాడు.



"అదీ... అలా తినాలి. చూశావా, నీకు తెలియకుండా నీకెంత ఆకలిగా వుందో"

"నిజమే... నాకూ ఆశ్చర్యంగానేవుంది. ఐనా మనసు బాగోలేని పరిస్థితుల్లో శరీరావసరాల గురించి పట్టించుకోలేం కదా స్వామీ!"

ధైర్యంగా తన మనసులోని మాట అతని ముందు పెట్టే తరుణం ఆదేననిపించి నాందీ ప్రస్తావనగా అన్నాడు వీరయ్య. నక్షత్రాలు లేని ఆకాశం నల్లగావుంది. గాలి కొద్దిగా చలి పుట్టిస్తోంది. అంతటా ప్రశాంతత రాజ్యమేలుతోంది. కడుపులో పడిన ఆహారం అతనికి కొత్త శక్తి కలిగించింది. అందుకే పూజారి...

''వీరయ్యా! నీ సమస్యేమిటి చెప్పు!!'' అన్నపుడు నిర్భయంగా నిస్సంకోచంగా తన బాధ వెళ్లగక్కగలిగేడు. జీవితంలోని మధుర ఫలాలను సొంతం చేసుకోవాలన్న కోరికనూ, తన ప్రాముఖ్యత అందరూ గుర్తించాలన్న తపననూ, చక్కటి భాషతో, విపులంగా అతని ముందుంచగలిగేడు. అనర్గళంగా అతడు చాలాసేపు మాట్లాడినదంతా ఒక్కమాట కూడా అనకుండా విన్నాడా పూజారి. ఆ తర్వాత తన అభిప్రాయాన్ని నెమ్మదిగా తెలియజేశాడు.

''నీ బాధలన్నిటికీ మూల కారణం సంపద లేకపోవటం... ఆ సంపదలకి అధిదేవత లక్ష్మీ దేవి. ఆమె కటాక్షవీక్షణం ఒకసారి నీవైపు ప్రసరిస్తే చాలు ధనం ప్రవాహంలా పొంగి వస్తుంది. నువ్వు కోరినవన్నీ లభిస్తాయి. నీ ప్రాముఖ్యత పెరిగి, సంఘంలో మంచి గుర్తింపు కలుగుతుంది. అదేకదా, నీకు కావలసింది''

''అవును... అలా ఆశించడంలో తప్పేంలేదుకదా!'' అంటూ సందేహంగా అడిగేడు.

''తప్పేంకాదులే... సరే నీ జాతక చక్రం ఓసారియ్యి. రేపు తీసుకురా!'' రేపన్నది చాలా దీర్ఘకాలం అనిపించింది వీరయ్యకి.

''ఆ దేవత ప్రసన్నం కావటానికి ఏం చెయ్యాలో ఈ రోజు చెప్పకూడదా?'' ఒక్కసారి ఆకాశం మీంచి భూపతనం చెందినట్లయి నిరాశగా అన్నాడు...

''రేపు సరిగా ఇదే సమయానికి నీ జాతకం తెచ్చి నాకివ్వు'' మరేం మాట్లాడకుండా లేచి నిలబడ్డాడతను.

మరొక్క రాత్రి మీనాక్షితో గొడవుంది కాబోలు అనుకుంటూ లేచి శలవు తీసుకుని నిష్క్రమించేడు వీరయ్య.

అతను వెళ్లినవంకే చూస్తూ నిలుచున్నాడు పూజారి.

★ ★ ★

భార్య నిద్రకళ్లతో తలుపు తీసీ తీయగానే ఆమెని ప్రశ్నించేడు వీరయ్య ''నా జాతకం ఎక్కడుంది?''

''జాతకమా?... ఇంత రాత్రివేళ దాని అవసరమేమొచ్చిందిటా...'' అనుమానంగా చూసిందామె భర్తవంక. ఇంకేం మాట్లాడకుండా పోయి పక్కమీదకి చేరింది.

వీరయ్య నిద్రలేచేసరికి టైము ఎనిమిదయ్యింది. అలానే నిద్రపోయే అవకాశం వున్నట్లయితే పదకొండు గంటలదాకా పడుకునేవాడే. కానీ అతని గుండెల మీద బాలూ కూర్చుని తన లక్క ఏనుగు బొమ్మతో తండ్రితల మీద అదే పనిగా కొడుతుండటంతో లేవక తప్పింది కాదు. గబగబ లేచి పావుగంటలో స్నానం చేసి, వుతికిన బట్టలు కట్టుకుని, నుదుటి మీద విభూది, రాసుకుని కుంకం బొట్టు పెట్టుకున్నాడు. అతనిలో కొత్తగా వస్తున్న మార్పులు వింతగా వుండటంతో భార్య వుండబట్టలేక సంగతేమిటని అడిగింది.

''కాఫీ రెడీ అయ్యిందా?''

వెటకారంగా నవ్విందామె. ''కాఫీ... నిన్న సాయంత్రం పాలమనిషి పెట్టిన గొడవకి నా వళ్లు చచ్చిపోయింది. దాని డబ్బులు ఇస్తేనే పాలు పోస్తానంది''

''సరే! అయితే కాఫీ లేదన్నమాట!'' పొద్దున్నే లేవగానే కాఫీ లేకపోవటంతో అతనిలో వుత్సాహమంతా నీరుకారిపోయింది.

''అయినా ఈ కాఫీ... గీఫీలు మనకి కానీ, మన తాతల నాడున్నాయా ఏంలే?'' సర్దుకోవాలని చూసేడు.

''బాలూకి పాలు కూడా లేవు''

బాలూవంక విచారంగా చూసేడు. వాడికి పాలు లేవనటం ఆనందం కలిగించింది.

''పాల మనిషి మళ్లీ వస్తే ఈ కర్రతో కొట్టేస్తాను'' చేతిలో వున్న కర్ర చూపుతూ అరిచేడు.

''ఏం నాన్నా! ఆకలిలేదా?''

''ఆకలెందుకు లేదు. బిస్కట్లు కొనియ్యి''

''కొంచెం ఆగరా! ఒక బీరువా అంతా నీ బిస్కట్లు, చాక్‌లెట్లతో నింపేసేరోజు వస్తోంది''

''అన్నీ నాకే!?''

''నిజంగా నీకే... ఇప్పుడు మాత్రం దగ్గిరికి రాకు... పోయి ఆడుకో!''

వీరయ్య వీధి నానుకుని వున్న కొట్టుగదిలోకి వెళ్లి అక్కడున్న ఒక పాత కర్రపెట్టె తెరిచి దానిముందు కూర్చున్నాడు. దాన్లో ముప్పయ్యేళ్ల కిందనించీ వున్న వుత్తరాలు కవర్లతో సహా

జాగ్రత్తగా పేర్చివున్నాయి. ఒక్కొక్క వుత్తరం తీస్తుంటే దుమ్ము రాలుతోంది. ఎంతోసేపు ఆ ఉత్తరాలన్నీ వెతికి ఒక కవరు తీసేడు. అది తన తండ్రికి మామగారు రాసిన ఉత్తరం చదివేడు.

"దీనితో మా అమ్మాయి చిరంజీవి సౌభాగ్యవతి మీనాక్షి జాతకం, మరియు చిరంజీవి కృష్ణ జాతకం పంపుతున్నాను. మీ కోడలు కులాసాగావుంది. మీరు శోభన ముహూర్తం నిర్ణయించి తెలియజేసినట్లయితే మీ కోడలిని తీసుకురాగలను" అప్పటికి వీరయ్యాకి ఇంకా ఈ పేరు స్థిరపడలేదు. ఆ వుత్తరం అతని జ్ఞాపకాలను తవ్వి తీసింది. భార్య అప్పటి ముగ్ధ మనోహర రూపం గుర్తుకు వచ్చి ఆమెపై అనురాగం కలిగింది.

"మీనా!" కేకేసేడు. కొడుకుని ఎత్తుకు వచ్చిందామె.

"ఇవిగో... ఇక్కడున్నాయి జాతకాలు. పోలేదు" వాటిని ఎత్తిపట్టుకుని ఆమెకి చూపిస్తూ పోయిన నిధి దొరికిన వాడిలా సంబరపడిపోయేడు.

"ఇప్పుడవెందుకు?" అర్థంకాక అడిగిందామె.

"ఈ ఉత్తరం చూశావా? మన శోభనం గురించి మీ నాన్న రాసింది"

ఆమె సిగ్గుపడింది. అంతలోనే "ఇప్పుడా పాతవన్నీ ఎందుకులెండి?" అంది. ఆమె చంకలోంచి కిందకు ఉరకటానికి బాలూ గింజుకుంటున్నాడు.

"వాణ్ణి తియ్యి... ముందు. లేకపోతే ఇవన్నీ ఇంటి ముందు కాలవలో పారేస్తాడు" కంగారుగా అన్నాడు వీరయ్య. వాణ్ణి అవతల దించి వచ్చి గుమ్మానికడ్డంగా నిలబడి పట్టువదలకుండా మళ్లీ అడిగిందామె.

"జాతకాలెందుకంటే చెప్పరేం... అంత రహస్యమా?"

తనకే పూర్తిగా తెలీని వీరయ్య ఏం చెప్పలేక "తర్వాత చెప్తాను" అన్నాడు.

"అయితే ఇవ్వాళ కూడా ఆలస్యంగా వస్తారా?" చిరాగ్గా అడిగింది.

"ఆలస్యం అవుతే అవ్వొచ్చు. నాకు కొంత పనివుంది బయట" వీరయ్య వెళ్లేటపుడు బాలూ వెంటపడ్డాడు కానీ, బిస్కట్లు కొనిచ్చేక వదిలేడు.

ఆ రాత్రి చాలాసేపు పూజారి వీరయ్య జాతకాన్ని క్షుణ్ణంగా పరిశీలించేడు. కాగితం మీద వేలుంచి, "శని... శని... ఈ ఇంట్లో ప్రవేశిస్తున్నాడు. నువ్వు గనుక జపం చేస్తే మేలు చేస్తాడు. నవగ్రహాల కోవెల్లో శనికి అభిషేకం చెయ్యి. తేనె తీసుకెళ్లు"

"తేనె నాకెక్కడిది?" తెల్లబోయేడు వీరయ్య.

పూజారి గట్టిగా నవ్వేసేడు. ఊరందరికీ వీరయ్య డబ్బెలా వస్తుందో చెప్పగలడు. కానీ వీరయ్యకు తేనెక్కడినుంచి వస్తుందో తెలీదు.

వీరయ్య నిబ్బరంగా "అదేం సమస్యకాదులెండి. ఎంతకావలిస్తే అంత సంపాదించగలను. ఊరికే అన్నానంతే!" అన్నాడు.

పూజారి సీరియస్‌గా వివరాలు చెప్పేడు. "శనివారం గుడికి వెళ్లు... మూడుసార్లు ప్రదక్షిణం చెయ్యి. శనినిమించిన శక్తిగల గ్రహం మరొకటిలేదు తెలుసా? అతగాడు తలుచుకుంటే నిన్ను రాజును చెయ్యగలడు. ఆగ్రహిస్తే ముప్పుతిప్పలూ పెడతాడు. అతన్నుంచి తప్పించుకున్న వారెవరూ లేరు. ప్రసన్నం చేసుకో... బాగుపడతావు"

"తప్పకుండా మీరు చెప్పినట్లే చేస్తాను స్వామీ!" వినయంగా అన్నాడు. ఆ తర్వాత చాలాసేపు పూజారి రహస్యంగా వీరయ్యకు కొన్ని విషయాలు బోధించేడు. కొన్ని మంత్రాలు ఉపదేశించేడు. సుమారుగా తెల్లవారుఝాము నాలుగు గంటలవుతూండగా అతన్ని తలుపు వరకు సాగనంపుతూ అన్నాడు...

"నువ్వు మళ్లీ నన్ను కలిసే అవసరం ఎప్పుడూ రాదు. నువ్వు మరీ కావాలనుకుంటే తప్ప... నేను చెప్పినవి తుచ తప్పకుండా పాటించు... వెళ్లు... శుభం".

"అలా చేస్తే నా కోరికలు తీరుతాయా?" ఉత్సాహంగా అడిగేడు వీరయ్య.

"ఎలా చెప్పగలం? ఫలితాలేవీ మన చేతుల్లో వుండవు"

"అలాటప్పుడు ఇవన్నీ చేసేం లాభం?"

"మంచిది నీకిష్టం లేకపోతే చెయ్యొద్దు.

సన్నెవరూ బలవంతం చేయరు'' వీరయ్య కుంగిపోయేడు. ఈ వేదాంతి తనతో ఆడు కుంటున్నాడనిపించి దుఃఖం కలిగింది.

ఏమనుకున్నాడో ఏమో గుడి తలుపులు ముయ్యబోతూ ఆగి మళ్లీ అన్నాడు పూజారి...

''శాస్త్రాల్లో కొన్నికొన్ని విధులు, కొన్నికొన్ని సందర్భాలకు విధించబడి వుంటాయి వీర య్యా! వాటిని ఆచరించే వాళ్లకి, ఆచరించని వాళ్లకీ తేడా ఎప్పుడూ వుంటుంది. ఆచరించే వాళ్లకు ఫలితాలను పొందే అవకాశాలు ఎక్కు వగా వుంటే ఆచరించని వాళ్లకి ఆ అవకాశాలు దాదాపు శూన్యం... నాకు తెలిసిందింతే''

''ఈ మంత్రంవల్ల మీకే ఫలితం లభించింది?''

''నాకా? నేనొక సన్యాసిని... ఈ మంత్రంవల్ల నాకే లాభంలేదు. నీకూ అవసరం లేకపోతే చెయ్యకు. ఇదే నా చివరి సలహా...'' అంటూ తలుపు మూసేడు. అదే ఆఖరుసారి వీరయ్య అతన్ని చూడటం. ఆ తర్వాత ఎంత ప్రయ త్నించినా ఆ వేదాంతి అతనికి కనబడనేలేదు.



**ఆ** ఇంట్లో వీధివైపు వుండే కొట్టుగది చిన్నది దాంట్లోనే, ఇంట్లో పనికిరాని తట్టా, బుట్టా, ఇతర సామానంతా పడేసి వుంటుంది.

''కొట్టుగది ఖాళీ చెయ్యి... పనుంది'' అన్నా డు వీరయ్య లేచీలేవగానే.

''దాంట్లో సామానేం చేయమంటారు?''

''బయటపారెయ్యి. నలభై రోజులు నేనాగది వాడుకోవాలి'' ఆ విసురుకి ఆమె కొంచెం జంకింది.

''ఎందుకండీ? ఏం చేస్తారో... నెమ్మదిగా చెప్పొచ్చుగదా!''

అతనా విషయం దాట వేశాడు. అతనికి పూజారి హెచ్చరిక గుర్తొచ్చింది...

''నువ్వు చేసే పూజగానీ, దాని వుద్దేశంగానీ ఎవరికీ... కనీసం నీ భార్యకి కూడా చెప్పొద్దు. దానివల్ల నీ ప్రయోజనం దెబ్బతింటుంది. జాగ్రత్త'' ఆమె వదలకుండా అడిగింది. ''ఏదైనా రసవాద విద్యా!?''

ఆ పోలిక అతనికి నచ్చక ''అదేం కాదులే'' అన్నాడు.

''అయితే తప్పకుండా చేతబడే అయి వుంటుంది'' భయపడిపోయింది.

''అలాటి పిచ్చిపిచ్చి ఊహలు నీ బుర్ర లోంచి తీసెయ్యి. ఆంజనేయస్వామి కోవెల పూజారి చేతబడి మంత్రాలు చెపుతాడా? నీకేం తెలీదు. తర్వాత చెప్తాగానీ... ఏదీ ఎక్కడా వాగకు'' విసుక్కుంటూ హెచ్చరించేడామెని.

తర్వాత ఆ చిన్న గదిలోని సామానంతా మధ్య గదిలోకి తరలించేరు. విరిగిపోయిన కుర్చీలూ, బల్లలూ, పాత పనికి రాని ట్రంకు పెట్టెలూ, చిత్తు కాగితాల దొంతర్లూ, పాత పరుపులూ, పక్క బట్టలూ, మధ్య గదిలో కుప్పగా పడ్డాయి. బాలూ ఆనందం పట్టపగ్గా లు లేకుండా వుంది. తల్లీదండ్రీ సర్దుతూ వుంటే వాడా వస్తువులని చిందర వందర చేస్తూ కేరింతలు కొడుతున్నాడు. వీళ్లింట్లో సామాన్ల చప్పుడు విని వీరయ్య సోదరుడి కుటుంబం, ఏం జరుగుతోందో తెలుసుకోవా లని, ఉబలాటపడి చెవులు రిక్కించి విన్నారు కానీ రెండిళ్ల మధ్య గోడ వాళ్లకెంతో నిరాశ కలిగించింది.

ఆ గదిలో స్థిరంగా కాపురం చేస్తున్న ఎలుక లన్నిటినీ వీరయ్య తరిమికొట్టేడు. బొద్దింకలు ఈ హడావుడికి తమంతటతామే పారిపో యేయి. బూజు దులిపి, గదంతా భార్య చేత కడిగించి, ముగ్గులు పెట్టించేడు. అగరవత్తు లు వెలిగించేడు. అది చాలా చిన్నగది. వీధిలో కివున్న ఒక్కగానొక్క కిటికీ తలుపులు మూసే స్తే గాలీ వెలుతురూ రావటం కష్టమే. గడపకి మామిడాకుల తోరణాలు కట్టి, చిన్న పీఠం అమర్చి దానిమీద లక్ష్మీదేవి పటం పెట్టేడు

అతనా పన్లు చేస్తుంటే మీనాక్షికేదో అర్థమైంది.

"మీరేం చేస్తారో నాకు తెలుసు" అంది.

"తెలిస్తే మరీ మంచిది. ఎక్కడా వాగకు" కటువుగా అన్నాడు.

ఒక లిస్టు భార్య చేతికిచ్చి దాంతోబాటు వెయ్యి రూపాయలు ఆమెకిచ్చి, ఆ లిస్టులోవన్నీ తనకి ప్రతీరోజూ అమర్చాలని, ఏదీ లోటు రాకూడదని మరీమరీ చెప్పేడు. దాన్లో పళ్ళు, పటికబెల్లం, గారెలు, బూరెలు, చిత్రాన్నం, పెరుగు, పాలు, తేనెలాటివి వున్నాయి. పొద్దున్న సాయంకాలం నివేదనం కోసం అతనికి అవి అవసరమున్న వస్తువులు. అంతేగాక జపంలోవున్నపుడు అతని ఆహారం కూడా అవే.

ఆమె చేతిలో డబ్బువంక చూస్తూ సందేహంగా "మరి ఇంటికి కావలసిన దినుసులు, పాలవాడికి ఇవ్వవలసినదీ..." అంది.

"అబ్బ... అవన్నీ ఎలాగో నువ్వే చూడు... కొన్నాళ్లాగమను. అన్నిటికన్నా ఈ పని ముఖ్యం. డబ్బు మన చేతికి రాగానే తీర్చేద్దాంలే... నన్ను మరి రోజూ విసిగించకు"

★ ★ ★

రెండు రోజుల తర్వాత పౌర్ణమి నాటినుండి అతను తన పూజలు మొదలుపెట్టేడు. గది తలుపులు బిగించి లక్ష్మీదేవిపటం ముందు స్థిరంగా కూర్చున్నాడు. అవతల బాలూ కసితీరా గది తలుపులు బాదుతూవున్నా లెక్క పెట్టలేదు. కిటికీ తలుపులు పూర్తిగా తెరిచి పొరుగు వాళ్ల దృష్టి నాకర్షించడం ఇష్టం లేక, అతికొద్దిగా సన్నపాటి వెలుతురు మాత్రమే వచ్చేలా తెరిచేడు. లేడి చర్మం మీద సంస్కృత మంత్రాక్షరాన్నొకదాన్ని రాసి దాన్ని దారంతో మెళ్లో కట్టుకున్నాడు. ఆ లేడి చర్మం దొరికేదాకా అతని మనస్సు స్థిమితపడలేదు. పూజారి చెప్పేడు, "ఈ అక్షరం మాత్రం నువ్వు లేడి చర్మం మీదే రాయాలిసుమా!"

"లేడా? నేనెక్కడ తేగలను? నేనేం వేటగాణ్ణా?" ఆశ్చర్యపోయేడు.

"నీ ఇంట్లో పాత సామానుంటే వెతుకు. మన పెద్దలు చాలా జాగ్రత్తవున్నవారు. తప్పకుండా మీ ఇంట్లో కూడా వుండే వుంటుంది"

"సరే... చూస్తా..." నన్నాడు.

"నువ్వెప్పుడైనా ఎర్ర కలువ చూశావా?"

"ఆఁ చూశాను" మళ్లీ ఏం రాబోతుందో అనుకున్నాడా రోజు.

"ఎక్కడ?"

వీరయ్య కాసేపు ఆలోచించేడు.

"వరలక్ష్మి పూజనాడు బజార్లో అమ్ముతుంటారు?" హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది.

"ఆఁ... అదే... కానీ ఇప్పుడమ్మరుకదా! అవెక్కడ దొరుకుతాయో ముందు తెలుసుకోవాలి నువ్వు" కాసేపు ఎర్రకలువ ప్రశస్తి గురించి చెప్పి అన్నాడాయన.

"సరయునదికి ఉత్తరంగా ఒక పెద్ద తోట, ఆ తోట మధ్య చెరువు వుంది చూడు. అక్కడే ఒక పాడైపోయిన ఈశ్వరాలయం వుంది. ఆ చెరువులో చాలా కలువపూలు దొరుకుతాయి. ఒక పువ్వు సంపాదించు. దాని రేకులు కాల్చి నల్లటి మసి చేసి, నెయ్యిలో కలుపు"

"నెయ్యిలోనా? అలాగే!" కనీసం ఒక్కటైనా తన వంటింట్లో దొరుకుతున్నందుకు సంతోషం కలిగింది.

"నెయ్యంటే... మామూలు నెయ్యికాదు. ఎక్కడా మచ్చలేని తెల్ల ఆవు పాలతో కాచిన నెయ్యి"

"ఓ" నిస్పృహ ఆవరించింది వీరయ్యని.

"నేను చెపుతున్నవన్నీ నువ్వు పనికిమాలిన విషయాలనుకుంటున్నట్టున్నావు కాబోలు" పూజారి అసహనంగా అన్నాడు.

"అబ్బెబ్బే... అదేంకాదు. నేను సంపాదించగలనో లేనో అని భయంగావుంది"

"నిజమే... కానీ అలా చేస్తేనేకానీ వీల్లేదని శాస్త్రం చెపుతోంది. ఎందుకు అని అడిగితే ఏం ప్రయోజనం వుండదు. శ్రమంతా వృధా అయినా, ఫలితం కావాలనుకుంటే, చేయక తప్పదు. సరే... నేను చెప్పేది శ్రద్ధగా విను. ఎర్రకలువరేకులు నల్లగా కాల్చి నెయ్యిలో కలిపి రోజూ దేవతార్చన కాగానే భ్రూమధ్యంలో బొట్టు పెట్టుకోవాలి.

"చేస్తాను" అన్నాడేగానీ అతనికే నమ్మకం లేకపోయింది. ఎర్రకలువ, తెల్లావునెయ్యి, లేడి చర్మం ఎక్కడనుంచి తేవాలి? ఎలా తేవాలి? అతని మనసంతా వికలమైపో

యింది.

"అధైర్యపడకు ఆత్మవిశ్వాసంతో ప్రయత్నం చేయి. అవి దొరుకుతాయి. పడక్కుర్చీలో పడుకొని పాటలు పాడుకొనే వాళ్లు డబ్బు సంపాదించగలరా? కృషి వుండాలి. అపుడే ఏదైనా సాధించగలం"

తడి అంగోస్త్రం కట్టుకుని ఒకటొకటిగా పూజా ద్రవ్యాలు సిద్ధం చేస్తుండగా అతనికి తాను ఎర్రకలువకోసం వెళ్లటం, డాక్టర్ పాల్‌తో పరిచయం గుర్తుకు వచ్చేయి. అతను ఒక రోజంతా ఎర్రకలువ కోసం పిచ్చివాడిలా తిరిగేడు. సరయూకి ఉత్తరాన వున్న వీధులన్నీ చుట్టబెట్టేడు. నల్లవృతోట దగ్గిర నదికి అడ్డంపడి, అవతలవడ్డుకుచేరి, అరమైలు దూరం నడిచేక ఒక పెద్ద తోట వచ్చింది. సూర్యుడు పడమటి దిక్కు చేరబోతున్నాడు. ఆ తోట చుట్టూ ముళ్లపొదలు కంచెలా పెరిగి వున్నాయి. తోటంతా చీకటిగా వుండి చాలా గుబురుగా వుంది. ఒక దగ్గిర మాత్రం సన్నని కాలిబాట తోటలోపలకి దారిలావుంది. దాని గుండా వీరయ్య లోపలకి ప్రవేశించేడు. సాయంకాలపు నీరెండ, అక్కడక్కడావున్న చెట్ల సందుల్లోంచి చారికలు చారికలుగా ప్రసరిస్తోంది. మడమల వరకు నేలమీద పడివున్న ఎండుటాకులు అతను నడుస్తుంటే సరసరమని చప్పుడు చేస్తున్నాయి. పాములుంటాయేమోనని భయపడుతూ జాగ్రత్తగా అడుగులేశాడు. చుట్టూ చూస్తూ, "ఈ తోటనిలా వదిలేసినవాడు మూర్ఖుడుకాకపోతే మరేమిటి! ఒక్క పళ్ల చెట్ల మీదే సంవత్సరానికి సులభంగా పదివేలు సంపాదించుకోవచ్చు" అనుకున్నాడు.

తోట మధ్యలోవున్న నీటి కొలను చేరేడు. అక్కడ నీరు కనబడకుండా ఆకుపచ్చటి దుప్పటి పరచినట్టుగా వుంది. ఏ ఎండుటాకో రాలినప్పుడు మాత్రం ఏర్పడే కదలికలవల్ల నీటి కొలను అని తెలుస్తోంది. ఉన్నట్టుండి ఒక కప్ప పైకి తేలి అంతలోనే బుడుంగ్‌మంటూ మునిగిపోయింది. ఆ ధ్వని ఎంతో పెద్దదిగా వినిపించి ఒంటరిగా వున్నానని భయమనిపించింది వీరయ్యకి. నీళ్లలోకి దిగే మెట్లు అక్కడక్కడా విరిగిపోయి నాచు పట్టి, అడుగు పెడితే జారిపోతాయన్నట్లు వున్నాయి. ఆ నీటికి అవతలపక్క ఒక చిన్న రాతి మంటపం వుంది. దాని స్థంభాలకు దట్టంగా సాలెగూళ్లు అల్లి వున్నాయి. నల్లగా మసిబారిపోయిన మూడురాళ్లు, ఆ మంటపంలోనే ఒకమూల కనిపిస్తున్నాయి. ఎవరో బాటసారులు అక్కడ ఎప్పుడో విశ్రమించివుంటారనుకున్నాడు వీరయ్య. ఆ నీటి మధ్యలో ఎర్రగా ఉదయార్కుని ఛాయలో మెరిసిపోతూ వున్నాయి కొన్ని కలువపూలు. అరమూతలుగావున్న వాటి పత్రాలు కాలపురుషుని కదలికలు మానవుల కంటే తమకే విస్పష్టంగా తెలుసునని చెపుతున్నట్టున్నాయి. ఒక మెట్టు మీద కాలువేసి వాటిని ఎలా అందుకోవాలా? అని ఆలోచించడం ప్రారంభించేడు వీరయ్య.

ఆకు పచ్చని నాచు తోసుకుంటూ దిగాలి. బట్టలు తీసేసి దిగటం మంచిదా? బట్టలతోనే దిగితే బాగుంటుందా? మీమాంస కలిగింది. ఈ పంచెగానీ తడిచిందా మరి ఇక శాశ్వతంగా ఆకుపచ్చగా ఉండిపోతుంది. అనుమానం లేదు. అనుకున్నాడు. అంతేగాక అలాటి పంచెతో ఊర్లోంచి ఇంటికెళ్లడం ఎలాగ? చూసేవాళ్లు నవ్విపోరూ! పంచె పైకెగకట్టి చుట్టూ చూశాడు. ఇక్కడెవడైనా మకాం వుండేలాగయితే వాడికి ఒక్క అంగుళం గుడ్డ కూడా అక్కర్లేదు. అంతలోనే మంటపంలో ఓ మూల ఎవరో కదిలినట్లనిపించి ఉలిక్కిపడ్డాడు. భయంతో వళ్లంతా చెమటలుపట్టింది. గొంతు తడారిపోతూ వుండగా, రెండు అడుగులు వెనక్కివేసి, ధైర్యం కూడదీసుకుంటూ కేకపెట్టేడు.

"ఎవరది? ఎవరక్కడ?" జవాబు వెంటనే వచ్చింది. దాంతో పాటే సన్నగా పొడుగ్గా నిక్కరు ధరించి వున్న వ్యక్తొకడు కళ్లద్దాలు సవరించుకుంటూ ముందుకు వచ్చేడు.

"నేనొక విలేఖరిని, రచయితను! నా పేరు డాక్టర్ పాల్"

వీరయ్య స్థిమితపడి తెల్లటి పళ్లు కనిపించేలా నవ్వేడు.

"ఇలాంటి ప్రదేశంలో ఏం పనండీ బాబూ మీకు. హడిలిపోయేనంటే నమ్మండి"

"ఏం ఎందుకుండకూడదు?"

"ఎందుకుండకూడదా?" ఆశ్చర్యపడుతూ అడిగేడు.

''అవును... ఎందుకుండకూడదనే అడుగుతున్నాను'' రెండడుగులు దగ్గరగా వస్తూ అన్నాడతను. ముప్పయ్యేళ్ల పైనే వుంటుంది అతడి వయస్సు. మూర్రోజుల గడ్డం చుబుకం మీద కనబడుతోంది. నుదుటి మీదకు వాలుతూ వుంది జుత్తు. వీరయ్యా కలువపూలు చూపుతూ అడిగేడు.

''నాకా పువ్వొకటి తెచ్చివ్వగలరా? మీరు నిక్కరేకదా వేసుకున్నారు? ఏమనుకోకపోతే నాకీ సాయం చేయండి''

అతను తలూపి నీటిలో ముందుకుపోయి ఒక కలువపువ్వు తెచ్చి ఇచ్చేడు. వీరయ్యా కృతజ్ఞతలు చెప్పేడు. కుతూహలం ఆపుకోలేక మళ్లీ అడిగేడు...

''ఇక్కడేం చేస్తారండీ మీరు?''

''నా పని చేసుకుంటాను''

''ఒక్కరే...!''

''మరి... ఒక్కరు చేసే పనే నాది''

చుట్టూ మరోసారి చూసి అన్నాడు వీరయ్యా. ''ఒంటరిగా ఉండలేని జాగా కదా ఇది?'' అతను నవ్వేడు.

''నాకు చెయ్యాల్సిన పనేమీ లేదిక్కడ. చాలా ప్రశాంతంగా వుంటుంది. పైగా ఎవరూ రాని ఏకాంత ప్రదేశం. ఎంతసేపున్నా ఎవరికీ అభ్యంతరం లేని చోటు.. మీరన్నది నిజమే. ఒక విధంగా అడవిలా కనిపిస్తున్నా... నాబోటి వాళ్లకిది చాలా మంచిచోటు. రండి కాసేపు కూచుందాం...!!'' ఆహ్వానించేడు.

''అబ్బే నేవెళ్లిపోవాలి'' నసిగేడు.

''అంత తొందరేం''

''చాలా దూరం వెళ్లాలి. పురుగూ పుట్రా వుండొచ్చుకదా!''

''ఒక్కటి కూడా లేదు. నా మాట నమ్మండి... కూచోండి'' అంటూ బలవంత పెట్టేడు పాల్. కాదనలేక అతని పక్కనే ఒక మెట్టు మీద కూర్చున్నాడు వీరయ్యా. చల్లగా వీస్తున్న గాలి నీటిలో కెరటాలు లేపుతోంది. మంటపం దగ్గర్లో వున్న నరుగుడు చెట్లు గుసగుసలాడుతున్నాయి. సంధ్య కాంతులతో ఆ ప్రాంతమంతా మరో లోకంలా వుంది.

''ఈ పూలకోసం అప్పుడప్పుడూ ఎవరేనా వస్తూ వుంటారు''

ఆ పువ్వు ఇచ్చినందుకు డబ్బేమైనా ఇమ్మంటాడేమోననిపించి వీరయ్యా మాట మార్చేడు.

''మీ వుద్యోగం ఏమిటన్నారు?''

''నేను జర్నలిస్టుగా పని చేస్తుంటానులెండి. మద్రాస్‌నుండి వస్తుండే పాలపుంత పత్రిక్కి ఇటు పక్క జిల్లాలకి నేనే విలేఖర్ని.

''తమిళం పేపరా?''

''అవును... ఎక్కువ సర్క్యులేషన్ వున్న పత్రికలెండి. ఇండియాలోనేకాదు సిలోన్, బర్మా, దక్షిణాఫ్రికా దేశాల్లో కూడా సర్క్యులేషన్ వుంది. నేను ఆ పత్రిక పని చేస్తూ, తీరిక వేళల్లో పుస్తకాలు రాస్తూంటాను''

''అదీసంగతి... మీరు పుస్తకాలు రాసేవాళ్లన్న మాట'' ఆరాధనగా చూసేడు వీరయ్యా. అతణ్ణి ఒక గొప్పవ్యక్తిగా భావించేడు. మొదట్నించీ అతనికి పత్రికల వాళ్లంటే ఏదో ఉన్నత పురుషులన్న భావం వుంది. అందువల్ల పాల్ అంటే అతనికి గౌరవం కలిగింది.

''ఎన్ని పుస్తకాలు రాసేరండీ మీరు?''

''నాలుగు... మూడు ఇక్కడే వున్నాయి'' తలను చూపిస్తూ అన్నాడు.

''ఒకటి మాత్రం కాగితాల మీదకి వచ్చింది''

''అదేమైనా కథా?''

''కథా? అబ్బే... అదేంకాదు... అంతకంటే విలువైన విషయం''

''ఓహో'' అని తనకు తెలియని విషయాల్ని గురించి ప్రశ్నించడం తన తెలివి తక్కువతనాన్ని బైట పెట్టుకోవటమేనన్న సంకోచంతో మరేం అడగలేదు వీరయ్యా. పుస్తకాల వంటివి అతనికోసం కానేకాదు. అతని ప్రపంచంవేరు. అతనొక పక్కా వ్యాపార, వ్యవహారాల మనిషాయె. వెళ్లటానికి లేచేడు.

''ఇక లేద్దాం... చాలా ఆలస్యమయింది''

''సరే పదండి... రోడ్డు వరకు మీకు తోడొస్తాను'' అని ఆ వ్యక్తి వీరయ్యాతో బాటే నడిచేడు. నడుస్తుండగా వీరయ్యాకింకేదో స్ఫురించింది, ఈ వార్తా విలేఖరి ఏదైనా సహాయం చేయగలడేమోనని.

''మీరెప్పుడైనా తెల్లావు... పూర్తి తెల్లావుని

చూశారా?'' అని ప్రశ్నించేడు.

అతను ఆశ్చర్యపడి "ఎక్కడ?'' అన్నాడు.

"ఇక్కడే అని కాదు... ఎక్కడైనా సరే..!''

"ఎందుకు?''

తడబడ్డాడు వీరయ్య. "అఁ అహ... తెల్లావు పాలు ఒక వైద్యం కోసం కావాలి. అందుకని...''

"మీరేదైనా ఆయుర్వేద వైద్యం చేస్తారా? ఎందుకంటే, ఎక్కువమంది ఆయుర్వేద వైద్యులు ఏవో మూలికలనీ, ఎర్ర కలువలనీ ఇక్కడకు వస్తుంటారు''

తనాశించిన జవాబు రాలేదు వీరయ్యకు. బలవంతంగా నవ్వేడు.

"అయినా ఆవు రంగేదైతేనేం. పాలన్నీ తెల్లగానే వుంటాయికదా!!'' అతన్తో ఏకీభవిస్తున్నట్టుగా తలూపి, టాపిక్ మార్చేడు.

"మీ పుస్తకాలు దేనిమీద రాశానన్నారు?''

"సోషియాలజీ''

ఆ కొత్తపదం విని 'నేరకపోయి అడిగాను కాబోలా' అని జంకిపోయేడు. అర్థమైనట్టు తల ఆడించేడు. అవతలవ్యక్తి మాత్రం ఊరుకోలేదు.

"సోషియాలజీ గురించి మీరు చదివి వుంటారనుకుంటాను...?'' అనవసరంగా దొరికిపోతున్నానని గింజుకుంటూ జవాబిచ్చేడు వీరయ్య.

"ఒకరకంగా చదివినట్లే అనుకోండి. అయినా చూడండి... మాలాటి వ్యాపారస్తులు ఇలాటి శాస్త్రాల మీద దృష్టి పెట్టలేం కదండీ!!''

పాల్ గ్రహించేడు. "అసలా సబ్జెక్టు మన వాళ్లు పూర్తిగా నిర్లక్ష్యం చేసేశారు. ఇంగ్లీషులో వున్నన్ని శాస్త్రాలు మరిదేన్లోనూ లేవనుకోండి''

నిజమేనంటూ వీరయ్య అంగీకరించేడు. ఇంతలో ఒక తాటాకుల మట్టిగోడల ఇల్లు సమీపించేరు వాళ్లిద్దరూ.

"ఒక్క నిముషం లోపలకి రండి. నా గదీ పుస్తకాలూ చూద్దురుగాని''



ఆహ్వానించేడు పాల్.

వెళ్లేసరికి చీకటైపోతుంది. రాలేనని వీరయ్య అంటున్నా అతను వినిపించుకోలేదు.

"మరేం భయపడకండి. అంతగా కావాలంటే మీ ఇంటి దాకా వచ్చి దింపి మరీ వెళతాను. కాదనక రండి" అని తలువు తోశాడు.

నేలమీద గచ్చులేదు. ఒక చాప పరిచి వుంది. దానిమీద జిడ్డుపట్టి మాసిపోయిన తలగడా ఒకటుంది. ఆ చాపమీద ఒకపక్క గొళ్లెం విరిగిపోయిన ట్రంకుపెట్టె ఒకటి మూత కొంతవరకు తెరిచిపెట్టివుంది. దాన్లోంచి కొన్ని పుస్తకాల దొంతర్లు కనిపిస్తున్నాయి. పెట్టెకి పక్కగా ఒక సిరాబాటిల్ కనిపిస్తోంది. తలగడ వెనక్కి తోసి "కూర్చోండి... నా దగ్గిర కుర్చీలు లేవు. నాకిలా వుంటేనే ఇష్టం" అన్నాడు పాల్. నేల తేమ వాసన వేస్తోంది. కలువపువ్వు నలక్కుండా పట్టుకుని కూర్చున్నాడు వీరయ్య.

"నేను రాసేదంతా ఇక్కడే. రోజంతా టౌన్లో తిరిగి, మేటర్ సేకరించి, ఈ గదిలో కూర్చుని రాస్తాను"

అతన్నేవిధంగా అర్థం చేసుకోవాలో వీరయ్యకి తెలియలేదు. ఇలాటి మనుషులుంటారని తెలియడం అదే ప్రథమం అతనికి. ఏదో ఒకటి మాట్లాడాలనుకుని "ఆ కనిపిస్తున్నదేమిటి? మీరు అచ్చు వేయాలనుకుంటున్న రాత ప్రతా?" కుతూహలం ప్రదర్శించేడు.

"ఆఁ... అవును... చూస్తారా?" అని బ్రవున్ పేపర్లోవున్న ఆ ప్రతిని అందించేడు పాల్. పసిపాపను అందుకున్నట్టు అందుకున్నాడు వీరయ్య. ఆఖరిపేజీ వరకు తిప్పి చూసి "నూటా ఏభై పేజీలుందా?" అన్నాడు ఆశ్చర్యంగా.

"చిన్న పుస్తకమైతే ఎక్కువమంది చదువుతారని అలా రాసేను. ఎక్కువమంది కొనడానికి వీలవ్వాలి కదండీ!"

వీరయ్య కొన్ని పేజీలు తిరగేసేడు నిదానంగా. ఒక అధ్యాయం శీర్షిక చదివేడు. 'తత్త్వ మీమాంస... ముద్దు పెట్టుకోడం ఎలా?' కనుబొమలు చిట్లించేడు. "ఇదేదో ముద్దు పెట్టుకోవడం గురించిలావుంది..."

"ఆ... 'ముద్దంటే ఏదో చిన్న విషయం అనుకుంటున్నారా? చాలా ప్రాధాన్యత వున్న అంశం సుమండీ!"

"ముద్దుపెట్టుకునేది ఎవర్ని? చిన్న పిల్లల్నే



కద... లేక...!?''

''భలేవారు... చిన్న పిల్లల ముద్దు గురించెందుకండీ రాయటం?'' చిరునవ్వుతో అన్నాడు పాల్.

వీరయ్యలో ఉత్సాహం కలిగింది. ఆసక్తిగా మరో చాప్టరు శీర్షిక చూసేడు. 'ఆలింగనానికి అధ్యయన సూత్రాలు' సారాంశమేమిటోనని మొదటి వాక్యాలు చదివేడు. పురుషుడు స్త్రీని కౌగలించుకుంటాడు. స్త్రీ పురుషుణ్ణి కౌగలించుకుంటుంది. గబగబ అట్టమీద పేరు కోసం వెతికేడు.

''ఇదేమిటండోయ్... మీరన్నదేదో ఇంకోటిలా వుందే'' ఆశ్చర్యం ఆపుకోలేక పాల్‌ని అడిగేసేడు.

''కాదే... సోషియాలజీలో ఇదో భాగం. సంవత్సరాలు గడిపేను శాస్త్రాన్ని మధిస్తూ, మీకు తెలుసా! వెయ్యేళ్ల క్రితం కాబోలు వాత్సాయనుడు కామసూత్రాలు రాసేడు. అది ఆధారంగా తీసుకుని దానిమీద హేవలాక్ ఎల్లీస్, జంగ్ వంటి ఆధునిక శాస్త్రవేత్తల పరిశోధనాంశాల్ని జోడిస్తూ పండితుడికీ, పామరుడికీ అర్థమయ్యేలా నా సొంత శైలిలో రాసేను. జనం దీన్ని చదివి ఆచరణలో పెడితే ప్రపంచంలో ఎంతో ఆనందం వెల్లివిరుస్తుంది. నా జన్మ ధన్యమైపోతుంది'' తన్మయంగా అన్నాడు అతను.

''కానీ... ఇది చాలా...'' సరైన పదం దొరకలేదు. సిగ్గుపడ్డాడు వీరయ్య. అదంతా చదవాలని ఆత్రుతగా వుందతనికి. కానీ పక్కకి పెట్టేశాడు సభ్యత కాదేమోనని.

''మీరు కావాలంటే చదవండి. ''మీక్కావలసిన ప్రతి విషయం చాలా క్లుప్తంగా వుంటుంది దాంట్లో. తడమని అంశమంటూ లేదు'' అతన్ని రెచ్చగొడుతున్నట్టుగా అన్నాడు పాల్.

''మంచి చిత్రకారుడెవరైనా దొరికితే కొన్ని భంగిమలు కూడా వేయించాలని వుంది''

''చిత్రాలా? వేటివి??'' నోరు తెరిచి నిర్ఘాంతపోతూ అడిగేడు.

''ఏం? తప్పేంటి? కొన్ని అవయవాలను గీయించాలనుకుంటున్నాను. పుస్తకం చదివి పారెయ్యడానికి కాదు. ప్రయోగాత్మకంగా వుండాలనే నా వుద్దేశం. కొత్త దంపతులకు మార్గదర్శి కావాలి నా పుస్తకం'' ఆవేశంగా అన్నాడతను.

''మీకు పెళ్లయ్యిందా?'' సూటిగా అడిగేడు వీరయ్య.

'కాకపోతే ఇదంతా నేనెలా రాయగలను?''

''కానీ... కానీ... మీరొక్కరే కనబడుతున్నారు...''

''నిజమే... తప్పులేదు'' గతమేదో జ్ఞాపకం వచ్చినట్లు మొహం వాడిపోగా అన్నాడు పాల్. విషయం తెలుసుకోవాలన్న కోరిక ఊపేస్తుంటే వుండబట్టలేక అడిగేసేడు వీరయ్య...

''ఆమె ఎక్కడున్నారు?''

బాధగా నిట్టూర్పు విడిచేడు పాల్' ఆమె చాలా అసాధారణమైన స్త్రీ. ఏమాత్రం విశ్వాసం లేనిది. కనిపించిన ప్రతీ మగాడూ ఆమెకి కావలసివచ్చేది. ఒక్క భర్తతో తృప్తికలగని రకం స్త్రీ ఆమె. గత్యంతరంలేక ఆమెను విడిచి పెట్టవలసి వచ్చింది. ఎక్కడుందో ఆ భగవంతుడికే తెలియాలి''

అతను చెప్పినదానికి నిర్విణ్ణుడయ్యేడు వీరయ్య. నోటమాట రాలేదు.

పాల్ పకపక నవ్వి అన్నాడు ''అంత ఆశ్చర్యపోకండి. నేనింకా పెళ్లే చేసుకోలేదు. తన జీవితంలోనే విఫలుడైనవాడు ఇంకోళ్ల జీవితాలకెలా మార్గదర్శి కాగలడనుకోట్లేదూ మీరు? తమాషాకి అన్నానులెండి''

''మీరెలా వూహించి రాయగలిగేరు?'' ఇంకా షాక్‌నించి తేరుకోలేక అపనమ్మకంగా అడిగేడు.

''నిజంగా నాకింకా పెళ్లికాలేదు. మీకు నేనిప్పుడు చెప్పింది సరిగ్గా జీవించలేని భార్యాభర్తలకో వుదాహరణ మాత్రమే''

''నిజం... నిజం''

''నా పుస్తకం చదివితే అలాటి దారుణాలు జరగవనే నా ఆశ!''

★ ★ ★

ఆ తర్వాత కొన్ని రోజులు వీరయ్య బయటి ప్రపంచం ఎలా వుంటుందో తెలీకుండా గడిపేడంటే అబద్ధం ఎంత మాత్రంలేదు. తన చిన్న గదిలో ఒక్కడే కూచుని లక్ష్మీదేవిని దీక్షగా

ఉపాసించడం మొదలుపెట్టేడు. నుదుటి మీద, వళ్లంతా విభూది రాసుకుని, ఎర్రటి పట్టుపంచెకట్టి, మంత్రజపం చేస్తూ ధ్యానంలో నిమగ్నమైపోయిన అతనికి బయట రోడ్డు మీద చప్పుళ్లుగానీ, నాన్నా! నాన్నా! అనిపిలుస్తుండే కొడుకు కంఠస్వరంగానీ చెవిన పడనే లేదని చెప్పుకోవాలి. ఆ గదిలోకి వెలుగు అతికొద్దిగా మాత్రమే ప్రసరించేది. అగరొత్తుల, కర్పూర పరిమళంతో గదంతా నిండిపోయి వుండేది. పువ్వులూ, అక్షింతలూ, ఇతర పూజా సంభారాలూ చెల్లాచెదురుగా పడివుండేవి. వాటి ప్రభావంవల్లనే కాబోలు, వీరయ్యకి ఆ గదిలో వున్నంతసేపూ అలౌకికమైన ఆనందం కలుగుతూవుండేది. పెదవి కదపకుండా అతనికి కావలసినవన్నీ అమర్చి పెడుతున్న భార్యంటే అతనిలో అంతులేని ప్రేమ పుట్టుకొచ్చింది. ఆమె అతనికోసం తెల్లవారుఝామునే లేచి మడిగా నైవేద్యం వండి పెడుతుండేది. తన పట్ల దేవీ ప్రసన్నం కలిగిందనే వీరయ్యా తలచేడు. లేకపోతే, తెల్లావు నెయ్యి, ఎర్రకలువ, లేడి చర్మం, ఏవైతే తాను సంపాదించలేననుకున్నాడో అవన్నీ ఒకటొక్కటిగా సమకూరి వుండేవా? అని ప్రశ్నించుకుని సంతోషపడేవాడు.

అయితే ఆ అడవిలాంటి తోట జ్ఞాపకం వచ్చినప్పుడల్లా డాక్టర్ పాల్, అతడి పుస్తకం జ్ఞాపకం వచ్చి, మైలపడిపోయినట్టు బాధపడేవాడు. అయినా కోతిలాటి మనసు ఒకంతట మరలేదికాదు.

"ఆ మనిషి ఇంకా బొమ్మలుకూడా వేయించాలనుకుంటున్నాడు... ఎంత ఘోరం"

అతనికి పెళ్లి కాకుండానే అలా రాయగలిగేడా?"

మెదడులో పుస్తకంలోని అధ్యాయాలు మెదిలేసరికి తుళ్లిపడి మంత్రజపం మొదలుపెట్టేవాడు. అతని ఉపాసనా కార్యక్రమం పూర్తిగా ఎనిమిది గంటలు పట్టేది. తర్వాత ఎంతో భక్తిగా నుదుటి మీద నల్ల అంజనం బొట్టు ధరించి, హారతి వెలిగించి, భార్యనీ, కొడుకునీ పిలిచి వాళ్లమీద పూజాజలం చల్లేవాడు. జపం అంతసేపూ ఉపవాసం ఉండాలన్న నిబంధనవల్ల అతని దవడలు నొప్పిపుట్టి, నాలుక తడారిపోయి విపరీతమైన నీరసం ఆవరించేది.

ఇలా నలభై రోజులూ గడిచేయి. ఆ తర్వాత అతను బయటకు వచ్చినపుడు తల వెంట్రుకలు, గడ్డం, మీసం బాగా పెరిగిపోయివున్నాయి. ఒక సాధువులాగా కనిపించేడు. స్వరంలో స్థాయి తగ్గింది. ఎవరితోనైనా మాట్లాడుతూంటే మధ్యలో మంత్రం దొర్లిపోతూ వుండేది. వీరయ్య బరువు అయిదు కేజీలు తగ్గేడు. నడుం దగ్గర కొవ్వు కరిగిపోయి సన్నబడ్డాడు.

★ ★ ★

శుభ్రంగా క్షవరం చేసుకుని వీధిలో అడుగు పెట్టిన వీరయ్య కొత్తగా నవయువకుడిలా వున్నాడు. చక్కగా కత్తిరించిన మీసం అందంగా అమిరింది. ఎక్కువ రోజులు వుంచి గీసిన గడ్డం కావడం వలన ఆకు పచ్చగా నీడలు తేలుతోంది. పంచెకట్టి, చొక్కామీద ఉత్తరీయంతో అతను బజారులో కనబడగానే పరిచయస్తులందరూ ఆపి, అడగటం ప్రారంభించేరు.

"చాలా రోజులైంది వీరయ్యా! నిన్ను చూసి... ఎక్కడికెళ్లేవు?"

"నేనెక్కడికెళతానయ్యా? ఇంట్లోనే ఉన్నాను!"

"నీ పాత జాగాలో వుండడటం లేదే!?"

"ఓ... అక్కడా! అదే నా వృత్తి కాదుగా... వేరే చాలాపనులుండటం వలన అటు రాలేదు"

అతని దగ్గిర డబ్బంతా చాలావరకు ఇంటి ఖర్చులకీ, పూజా ద్రవ్యాలకీ, జపం పూర్తికాగానే చేసిన అన్నదానానికి బ్రాహ్మణుల సంభావనలకి ఖర్చయిపోయింది. దానికి అతనేం చింతించలేదు. "దేవత ప్రసన్నం కావాలంటే ఆ మాత్రం తప్పదు, అనుకున్నాడు. అయితే ఎప్పట్నుంచి తనకి లక్ష్మీ కటాక్షం లభిస్తుందో తెలిస్తే బావుణ్ను.

ఎలా తెలుస్తుంది. అని ఆలోచించి మార్గాంతరం కనబడక మళ్లీ ఆ అర్చకుణ్ణి కలుసుకోవాలనుకున్నాడు. కానీ అతను మళ్లీ తనను కలుసుకోనక్కర్లేదని చెప్పిన మాట జ్ఞాపకం వచ్చింది. ఒకవేళ తనతోగానీ వేళా

కోళం ఆడాడా? అనిపించి ఉలిక్కిపడ్డాడు. చెప్పరాని భయం అతన్ని వణికించి వేసింది. తన్నో మూఢుడిగా భావించి వుంటాడా ఆ పూజారి.

రోజులు భారంగా దొర్లిపోతుంటే వీరయ్యలో అనుమానం ఊడలు దించిన వటవృక్షంలా పెరిగిపోతూ వుంది. మొదట్లో ఏమేమో చేసి దారిద్ర్యాన్ని తొలగించుకోవాలన్న పథకాలన్నీ తలలోంచి చెదిరిపోయాయి. కాలం గడపటం పెద్ద సమస్యగా మారిపోయింది. పొద్దున్న లేచింది మొదలు రాత్రయ్యేవరకు ఎలా గడపాలి. రోజంతా రాత్రిగానే వుంటే బాగుణ్ణు అనుకోసాగేడు.

ఇంట్లోనే వుండటంవలన భార్యతో ఏదో విషయంలో ఘర్షణ వస్తోంది. కొడుకు మరీ అల్లరివాడుగా తయారై ప్రాణం విసిగించేస్తున్నాడు. ఒక తుండుగుడ్డ నేలమీద పరచి పగలంతా హాల్లో దానిమీద పడుకుని పరిపరివిధాల ఆలోచనలు చేస్తూ కాలం గడిపేవాడు. ఇంటియజమాని అలా ఏ వ్యాపకం లేకుండా వుండటం మీనాక్షికోసం వచ్చేపోయే ఆడంగులకు రకరకాలుగాతోచి వాళ్లామెను గుచ్చి గుచ్చి అడిగేవారు. సమాధానాలు చెప్పలేక ఆమె సతమతమయ్యేది. ఒకసారి విసుగ్గా అంది.

''పొద్దల్లా ఇంట్లోనే వుంటే, ఇల్లు జరిగేదెలా?''

''అయితే నన్నెక్కడికి పొమ్మంటావు?'' తీవ్రంగా అడిగేడు.

''బాగుంది. నేనేమన్నాననీ, మిగిలిన మగవాళ్లలా ఏదో నాలుగురాళ్లు తెచ్చుకునే ప్రయత్నం చేయమంటున్నాగానీ ఎక్కడికీ పొమ్మంటంలేదే''

''బయటకిపోయి తేవాల్సింది డబ్బు... రాళ్లు కాదు'' వెటకారంగా జవాబిచ్చేడు.

''ఆహా! అలాగా! నాకు తెలీదులెండి. పొయ్యూదుకుంటూ కూర్చునేదాన్ని. బయటికిపోతే డబ్బు దొరుకుతుందనుకుంటున్నాను. సరా''

ఇలా మాటమీద మాట పెరిగి అసలు విషయం మరుగున పడిపోయేది. అతనేం చేస్తే ఇల్లు గడుస్తుందో ఆమెకి తెలీదు. అతనికీ స్పష్టమైన ఆలోచనేదీ లేదు. ఆకస్మికంగా కట్టలు కట్టలుగా డబ్బొచ్చిపడుతుందనే నమ్మకం ఏమూలో వుండటంవలన అతనికే పనీ చెయ్యటానికి మనస్కరించటంలేదు. మళ్లీ పాతజీవితం మొదలు పెడదామని భావించి కోపరేటివ్ బాంకువైపు ఒకటిరెండుసార్లు వెళ్లకపోలేదు. కానీ ఆ ప్రయత్నం తనవల్ల మరికాదని తేలిపోయింది. కొందరు పాత కాతాదార్లు తన బాకీ ఎక్కడ అడుగుతాడోనని మొహం తిప్పుకుపోయేరు. ఊళ్లోకి కామ్‌గా తిరుగుతూ ఎవరినయినా పలకరించబోతే వాళ్లూ ముక్తసరిగా మాట్లాడటమే తప్ప పూర్తి ఆదరణ చూపటంలేదు. కళ్లజోళ్ళ షాపతను నిలదీస్తాడేమోనని బజారు రోడ్డుమీద అడుగు పెట్టడమే మానుకున్నాడు. అలా తన నీడకు తాను భయపడుతూ, ఇల్లు కదలడం మానేసేడు. ఇంట్లో అతనికి ఉపశమనం కలిగించేదల్లా 'బాలూ' ఒక్కడే. పక్కింట్లోవాళ్లు గొణుక్కోవటం మొదలుపెట్టేరు. ''అతనికేమైంది. బయటిక్కూడా తిరగడం మానేశాడు. అప్పులాళ్లకు భయపడి దాక్కుంటున్నాడో, లేక చేతబడి ప్రయోగాలు చేస్తున్నాడో ఏమైనా మనం జాగ్రత్తగా వుండాలి...''



ఆ నెలాఖరురోజుల్లో పచారీ సరుకులు కొనవలసివచ్చింది. యాభైరూపాయలు చాలకపోయేసరికి నెయ్యి కొనడం మానేశాడు. భార్య సణిగింది. ''ఇంత దరిద్రం నేనెప్పుడూ ఎరగను''

బాలూ అన్నం తినమంటే ససేమిరా అన్నాడు.

''నాకు నెయ్యి కావాలి'' మారాం చేసేడు.

''నెయ్యిలేదు నాయనా! గొడవ పెట్టకుండా

తినమ్మా'' బతిమిలాడేడు వీరయ్య.

''నేను తిన్ను'' అన్నం తోసేసి లేచి నిలబడ్డాడు వాడు.

''ఏదుంటే అదితిని సర్దుకోవాలి'' వాడి కర్థం కాదని మరిచిపోయి గట్టిగా అన్నాడు వీరయ్య కోపంతో.

''నాకొద్దు'' కోపంతో అన్నం పళ్లేన్ని కాల్తో తన్నేడు వాడు. ''నువ్వేలా తన్నేవంటే నిన్ను తంతాను. జాగ్రత్త'' హూంకరించేసరికి వాడు ఏడుస్తూపోయి తల్లిని చుట్టేసుకున్నాడు. ఆమెకి విష్ణుభక్తుడైన చక్రధారి కథ గుర్తొచ్చింది. ఆ చక్రధారిలాగే తన భర్త కూడా ఈ దేవుళ్ళ పిచ్చిలోపడి కొడుకుని బలిచేస్తాడేమోనన్న అర్థంలేని ఆవేదనతో, రోజులెలా గడుస్తాయోనన్న దిగులుతో తను కూడా ఏడవటం మొదలు పెట్టింది. వీరయ్య మనసంతా వికలమైపోయింది. ఏం మాట్లాడకుండా కంచంలో వున్నది తిని లేచిపోయేడు. కానీ ఆ భోజనం అతనికేం రుచించలేదు.

''ఇంకాలస్యం చేస్తే లాభంలేదు. ఆ పూజారినడిగి తేల్చుకుంటాను. ఏం జరుగుతుందో, ఎప్పుడు జరుగుతుందో, అసలేదైనా ఫలితం వుంటుందో, వుండదో చెప్పకపోతే వదిలేదిలేదు'' అని నిశ్చయించుకున్నాడు. బాగా చీకటి పడ్డాక ఇల్లు వదిలి, గుడికి బయల్దేరాడు. గుళ్లో జనం అంతా వెళ్లేవరకు ఆగి గర్భగుడిలోకి తొంగిచూసేడు. అక్కడ కొత్త పూజారి కనిపించేడు. నవనాడులూ కుంగిపోగా, అతన్ని ఆదుర్దాగా అడిగేడు.

''ఆయనెక్కడ?''

''ఎవరు?'' ప్రశ్నించేడతను.

''ఇంకో ముసలి పూజారిగారు...''

''ఎందుకు?''

వీరయ్యకి కోపం వచ్చింది. కానీ ఆ భగవంతుడి సేవకుణ్ణి ఏమనలేక, కోపం దిగమింగుకుని వినయంగా,

''ఆయన్తో కొంచెం మాట్లాడే పని వుంది'' అన్నాడు.

''ఏం పని...?'' దేవుడి దగ్గిర పడివున్న పూజాపుష్పాలు ఏరుతూ అడిగాను.

ఒక్క నిముషం వీరయ్యకి ఏం చెప్పడానికీ తోచలేదు. ఏదో అందామనుకునే సరికి మరి కొంతమంది భక్తులు కొబ్బరి కాయల్తో, పూజ ద్రవ్యాల్తో గుళ్ళోకి వచ్చేరు.

ఆ పూజారి యువకుడు వీరయ్యనుండి అటువైపు తిరిగి, వాళ్ళ దగ్గర్నుండి ఆ సామాన్లు అందుకున్నాడు.

వీరయ్య దృష్టికి ఇంకో కోఆపరేటివు సెక్రటరీలా కనిపించేడు ఆ కొత్త పూజారి.

డబ్బు... డబ్బు... ఆ డబ్బు ప్రభావం ఎంతటి పనైనా చేయిస్తుంది... పళ్ళు గిట్టకరిచి కోపాన్నణుచుకున్నాడు.

ఇంతలో పూజారి హారతి పళ్ళెం చేతబట్టి, గర్భగుళ్ళోంచి బయటకు వచ్చేడు. ఎర్రటి ఆ మంట వెలుతుర్లో, కొత్త పూజారిని చూస్తే మరీ కుర్రాడిలా వున్నాడు. భక్తులందరూ, డబ్బులు పళ్ళెంలో వేసి హారతి అందుకుంటున్నారు. ఆ పళ్ళేన్నతడు వీరయ్య ముందుకు తెచ్చేడు.

'చాలానే డబ్బు తగలేశాను' అనుకుంటూ, పళ్ళెంలో డబ్బులేవీ వెయ్యకుండానే హారతి స్వీకరించేడతను. భక్తులంతా వెళ్ళిపోయేక, పూజారి గుడిలోపలకి వెళ్ళి పద్మాసనం వేసుకుని, కొన్ని శ్లోకాలు పఠించడం మొదలుపెట్టేడు.

అందరూ వెళ్ళిపోయినా, వీరయ్య ఇంకా వెళ్ళకుండా నిలబడి వుండడం కాసేపు పోయేక గమనించి, అతడు తన మంత్రపఠనం ఆపుచేసి అడిగేడు.

''దేనికోసం ఇంకా నిలబడ్డావు...?''

''మీరు బయటకి వచ్చేక నా ప్రశ్నకి సమాధానం ఇస్తారని వున్నాను'' మొండిగా బదులిచ్చేడు వీరయ్య.

''నేనేమైనా జ్యోతిష్కుణ్ణా నీ ప్రశ్న తెలీకుండా నీకు జవాబివ్వటానికి...?'' కవ్వించేడతను.

వీరయ్య కోపం ఆపుకోలేకపోయేడు.

''ఏయ్... కుర్రాడా... జాగ్రత్తగా మాట్లాడు... మరీ అంత వెటకారం పనికిరాదు... నేను నెమ్మదిగా అడుగుతూవుంటే, నువ్వంత నిర్లక్ష్యంగా మాట్లాడతావేం...?''

అతనొక్క క్షణం ఆశ్చర్యపోయినట్లు కని

పించేడు ఆ సంభోధనకి. పట్టించుకోనట్టు స్వరం పెంచి, మంత్ర పఠనం కొనసాగించేడు.

వీరయ్య కేకేసాడు "ఆ మంత్రాలావు... నీ భక్తి నాకు తెలుసులే..."

"దేవుడి పూజ ఆపమంటున్నావు... అసలు నువ్వెవరు...?"

"అడ్డదిడ్డమైన ప్రశ్నలు వెయ్యకు అబ్బాయ్... నువ్వు నన్నడిగే ముందు నేను నిన్నడిగినవాటికి సక్రమంగా జవాబివ్వాల న్నది తెలుసుకో..." హెచ్చరించేడతన్ని.

"ఏం కావాలి నీకు?"

"నాకు కావలసిందల్లా ఆ ముసలి పూజారి గారు ఎక్కడికెళ్ళేరు... అని. ఎందుకు అని మాత్రం అడక్కుండా జవాబు చెప్పు"

"ఆయన తీర్థయాత్రలకు వెళ్ళేరు"

"ఎప్పుడు వెళ్లేరు?" అతను కొంచెం ఆగి చెప్పేడు,

"నెలవుతుంది"

"మళ్లీ ఎప్పుడొస్తారు?"

"నాకు తెలీదు" అసహనంగా అన్నాడతను.

"ఏ ఊరు వెళ్లేరు?"

"వారణాసి వెళ్లేరు. అక్కడనుంచి గంగా నది మూలస్థానాన్ని కాలినడకన సందర్శిస్తారు" వీరయ్యని వదుల్చుకోవాలని గబగబ చెప్పేడు.

"ఎందుకు అలా చేయటం?"

"నాకు తెలీదు. నేనెలా చెప్పేది?" విసురుగా చెప్పి మరి వుండకుండా వెళ్లిపోయాడా కుర్రపూజారి మరోమాట లేకుండా నీరసంగా బయటపడ్డాడు వీరయ్య. హతాశుడయ్యాడతను. తను మోసగింపబడ్డానని తలచేడు. ఆ ముసిలిపూజారి తమాషాకోసం తన సొమ్మంతా ఖర్చు పెట్టించేసేడు. అతని కోసం ఎక్కడని వెతకటం? కాశీ, హిమాలయాలు, గంగోత్రి- తన తరమా? తన ఉసురు తగలకపోదనీ, హిమాలయాల్లో చలికి గడ్డకట్టి పోవటమో, జబ్బుపడి చావటమో జరిగితీరుతుందనీ విశ్వసించేడు.

ఆ మరుసటిరోజు ఊరి చివరకుపోయి ఏకాంతంగా కూర్చుని ఆలోచించేడు. సరయు నది వొడ్డున కూర్చుని కాసేపు, ఒక చెట్టు నీ[illegible] పడుకుని ఆకాశంవంక చూస్తూ కాసేపు దీర్ఘాలోచనలు చేసేడు. కానీ మెద[illegible] మానేసింది. వీధుల్లో దుకా[illegible] ఏ వ్యాపారం లాభసాటో అని తర్కించుకోవటం మొదలుపెట్టేడు.

టైలరింగ్, హెయిర్‌కటింగ్ సెలూన్?

తప్పేముంది? కానీ వాటిలో శ్రమ ఎక్కువ, లబ్ధి తక్కువ. అని తేల్చుకున్నాడు.

"ఎవరూ ఊరికే నాకు డబ్బు తెచ్చిపొయ్యరు. నేను వాళ్లకేదో ఇవ్వగలిగివుండాలి" అనుకుంటూ నాలుగురోడ్ల జంక్షన్ దగ్గిరవున్న నీటి ఫౌంటెన్ గోడమీద కూర్చుని ఆలోచనలు సాగించేడు.

"ప్రజలందరికీ కావలసిందీ, ప్రతీవాడికీ అందుబాటులో వుండేది ఏముందబ్బా... ఇంచుమించు ప్రతీవాడూ ఎంతో కొంత డబ్బు దానికింద ఖర్చు చేయగలిగివుండాలి..."

"నశ్యం"

టక్కున ఆలోచన వెలిగింది. చకచకా అంచనాలు కట్టేడు. పెట్టుబడి పెద్దగా కాదు. కొన్ని పొగాకుకట్టలు వుంటే చాలు. నశ్యం తయారీ తెలుసు తనకి. తన ఇంటిముందు ఇంతకుముందొక 'నశ్యం వ్యాపారి' వుండేవాడు. కావలసినవల్లా కొన్ని బొగ్గులు. పొగాకు వేయించడానికో మట్టిపాత్ర. ఒక కల్వం, కొద్దిగా సున్నం అంతే. పొగాకు వేయించి, బాగా నూరి, సున్నం కలపటంవరకే తను చేస్తాడు. మిగిలినదంతా కొనుగోలుదార్లే చూసుకుంటారు.

వీరయ్య నశ్యం బ్రహ్మాండం అని పేరు రావటంతోసరి.

అయిదువందల రూపాయల పెట్టుబడి వుంటే చాలు. అయితే పొగాకు వేయించటం మాత్రం ఇళ్లకి దూరంగా చెయ్యాలి. లేకపోతే దాని ఘాటుకి ఇరుగు పొరుగు దగ్గు ఆపుకోలేక తిట్టడం మొదలుపెడతారు.

మళ్లీ ఆలోచిస్తే ఒక అనుమానం కలిగింది. ఒకవేళ తన నశ్యం చెల్లకపోతే...

గదిలో నిలువెత్తు వరుసల్లో పేర్చివున్న వీరయ్య నశ్యం డబ్బాలు కళ్లముందు మెదిలి భయపడిపోయేడు. తనే వాడుకోవాల్సివ

స్తుందేమో. కానీ తనెప్పుడూ గోల్డెన్ మంకీ బ్రాండు తప్ప చేస్తే మరొకటి వాడలేడే.

అహ అదికాదు. పళ్లపొడి వ్యాపారం అయితే తిరుగులేదు.

వీరయ్య తల్లి కాల్చిన కరక్కాయ తొక్క, దాల్చిన చెక్కబెరడు, పటికలతో ఒకరకం పళ్ల పొడి తయారుచేసేది. ఆ పొడరు వాడితే దంతాలు ఇనుమంత గట్టిగా వుంటాయని అంతా అనేవారు. తన చిన్నతనంలో తమ ఇంటిముందు తన తల్లి ఇచ్చే దంత మంజనం కోసం వరుసల్లో నిల్చునే ఆడామగా జ్ఞాపకం వొచ్చేరు. ఆమె వాళ్లందరికీ ఉచితంగానే ఆ చూర్ణం పంచిపెట్టేది. సోమ, శుక్రవారాల్లో, స్టోరు గదిలోంచి పెద్ద జాడీ బయటపెట్టి కావలసిన దానికంటే ఎక్కువే అందరికీ ఇచ్చేది.

తండ్రి హాస్యమాడేవాడు. "ఈ దంతచూర్ణ దానంవల్ల నువ్వు వచ్చే జన్మలో బంగారుపళ్లతో పుడతావులే" అంటూ.

ఆమె ధర్మంగా ఆ పనిచేసేది. వాళ్లింటికి పళ్లపొడిల్లు అన్న పేరు కూడా వచ్చేసిందప్పట్లో. ఆ పేరు సార్థకం చెయ్యాల్సిన సమయమిదే.

ఒక్క విషయంలో మాత్రం అనుమానం కలిగింది. తన పళ్లపొడిని అందరిచేతా కొనిపించడం ఎలా? మార్కెట్లో అప్పటికే డజన్ పైగా మంచి పేరున్న కంపెనీలున్నాయ్. వీధుల్లో కేకలు వేసుకుంటూ అమ్మలేడు. ఎవరు చూసినా అవమానం. అరుల్‌దాస్‌గాడి కంటపడితే అవసరం లేకపోయినా పిలుస్తాడు.

"ఏయ్... రెండు పొట్లాలియ్యి" అంటూ ఓ రూపాయి పారేస్తాడు. అది తననలు భరించలేడు. అలా ఎన్ని రూపాయలు పోగుచేస్తే తను ఎప్పటికి ధనవంతుడవ్వగలడు? అహఁ... ఇదేదీ కాదు. నేను గౌరవంగా వుండే వ్యాపారమే చేస్తాను. ఇలాటివి లాభంలేదు" అనుకుని తాత్కాలికంగా ఆలోచనల్ని వాయిదా వేశాడు. కానీ అతనికి తన స్థితి దుస్సహనీయమైందిగా తోచింది. ప్రతీవాడూ ఏదో ఒకపనిలో మునిగితేలుతుంటే, తను మాత్రం సోమరిగా కాలం గడపటం అతనికి కష్టంగా తోచింది. చివరకు అనాథ శవంముందు మట్టిపాత్ర చేతపుచ్చుకుని దండుకునేవాడిలా మారిపోవాలేమో అన్న ఊహ రాగానే దుఃఖం కల్గింది

"హల్లో... ఫ్రెండ్..." వెనకనుంచి డాక్టర్ పాల్ గొంతు వినిపించగానే తిరిగి చూసేడు. సైకిల్‌మీద వస్తూ ఆగేడు అతను వీరయ్య పక్కనే.

"మళ్లీ మనం కలుసుకోమేమో అనుకున్నాను. మీరెక్కడున్నదీ ఆరోజు నాకు చెప్పనేలేదు. పూలకోసం కూడా మళ్లీ రాలేదు" నిష్ఠూరంగా అన్నాడతను.

వీరయ్యకి ఆ సమయంలో పాల్ కనిపించటం నచ్చలేదు. తన బాధ తనను పడనివ్వరేం అనిపించింది.

ముభావంగానే "మరొక పువ్వు అవసరం లేక రాలేదులెండి" అని జవాబిచ్చాడు.

"సర్లెండి. మళ్లీ కనిపించేరు. ఇక్కడ కూర్చునేం చేస్తున్నారు?"

"ఒకతను వచ్చి కలుస్తానంటే, ఎదురుచూస్తున్నాను"

"ఏదో వ్యాపారం గురించి కాబోలు" అర్ధోక్తిగా ఆపేడు.

"అంతేలెండి. లేకపోతే ఇంత తీరిగ్గా కూచునే సమయమెక్కడేడ్చింది నాబోటిగాళ్లకి. టైమెంతయ్యిందో" చుట్టూ చూసేడు.

"నాలుగు" తన వాచీ చూసి చెప్పేడు పాల్.

"నేను కాసేపు కూచుంటే, మీకేమైనా అభ్యంతరమా?"

"అబ్బే... అదేంలేదు. అనవసరంగా మీపని పాడవుతుందేమో"

"నేను మీతో మాట్లాడుతున్నా నేను పనిచేస్తున్నట్టే లెక్క. అన్నట్టు మీ పేరు చెప్పనేలేదు"

"నా పేరెందుకులెండి. వీరయ్యంటారు అంతా"

"ఇంటి పేరు?"

"ఇంటి పేరక్కర్లేదు"

"చాలా గొప్ప సంగతి. నిజమైన సంస్కారం వున్న వాళ్లెవరూ ఇంటిపేరు చెప్పుకోరు" మెచ్చుకుంటూ అన్నాడు పాల్.

"అహ... అది కాదు. మీరు వీరయ్య అని

అడిగితే ఎవరైనా చెపుతారు. అది నా అసలు పేరు కాదులెండి''

''అదే అనుకున్నానులెండి''

''ఎలా?'' ఆశ్చర్యపడ్డాడు వీరయ్య.

'ఎలా' అన్నది నా వృత్తి రహస్యం. అది తెలీకపోతే నేను రచయిత కాలేను. నా పని విషయాలు సేకరించడం. ఎలా అన్నది చెప్ప డంకాదు. అర్థమైందనుకుంటాను''

''మీరు నిజంగా అసాధ్యులు'' వీరయ్యా పొగిడేడు ఏమనలేక. ''దానికేంగానీ వదండి. ఎటన్నాపోయి మాట్లాడుకుందాం. మీతో ఓ విషయం మాట్లాడాలి''

''ఇక్కడ బాగానే వుందిగా''

అంతలోనే తన అభ్యంతరానికి బలమైన కారణం గుర్తొచ్చింది తనికి. ''అదీగాక ఒకతను నా కోసం వస్తాడు''

''ఫర్వాలేదు లెద్దురూ. కొంచెం ఏకాంతంగా మీతో మాట్లాడాల్సివుందన్నాగా. రండి దగ్గిర్లోనే నా ఆఫీసువుంది. అక్కడికి పోదాం'' బల వంతంగా చేయిపట్టుకుని లేవదీసేడు పాల్. తప్పనిసరి అయి వీరయ్యా అతన్ని అనుస రించేడు. జనసందోహం మధ్యనించి ఇద్దరూ దారిచేసుకుంటూ నడవసాగేరు. గుడ్డిగా పాల్ వెనక నడిచి, బజారు తూర్పు చివరగా వున్న ఒక సందులోకి ప్రవేశించేడు వీరయ్యా. ఒక ఇంటిముందు ఆగి సైకిల్ స్టాండువేసి తలుపు తట్టేడు పాల్. చిన్నకుర్రాడొకడు వచ్చి తలుపు తీసేడు.

''లోపలెవరైనా ఉన్నారా?''

''ఎవరూ లేరు?''

''బతికించేరు. నా ఆఫీసు తెరువు...''

ఆ కుర్రాడు లోపలికి వెళ్లి ఒకపక్కగా వున్న తలుపు తెరిచి తల బయటకు పెట్టేడు.

''కొంచెం నా సైకిలు లోపల పెట్టు'' అని పాల్ ఆ కుర్రాణ్ణి ఆదేశించి, వీరయ్యాని రమ్మంటూ లోపలకి నడిచేడు. అది చాలా చిన్నది. గదంతా ఖాళీ ప్యాకేజీ పెట్టెలు. పైక ప్పువరకు దొంతర్లుగా పేర్చివున్నాయి. మధ్యలో వున్న కొంచెం ఖాళీజాగాలో ఒక చిన్న స్టూలు. దానిముందొక పెద్దబల్ల వేసివున్నాయి.

ఆ వెనకాతల ఖాళీగా వున్న గోడమీద ఒక అచ్చు కాగితం అంటించివుంది. 'పాలపుంత-ప్రధాన వార్తాహరుని కార్యాలయం' ఒక మూల కొన్ని పేపర్లు పేర్చివున్నాయి.

''నా ఆఫీసు చూసి ఆశ్చర్యపోతున్నారా? ఇది తాత్కాలికం మాత్రమే. ఒక పెద్ద ఆఫీసు, మంచి పోరూమ్‌లో వున్నదాన్లోకి తొందర్లో మారి పోతున్నాను''

''ఎక్కడ?'' కుతూహలంగా అడిగేడు వీర య్యా.

''ఎక్కడ దొరికితే అక్కడే... చూస్తున్నారుగా, ఊళ్లో ఇల్లు కావాలంటే ఎంత కష్టంగా వుందో''

వీరయ్యా అంగీకరించలేదు ఆ మాటకి.

''మీరు సరిగ్గా ప్రయత్నించాలి. ఇళ్లు లేకేం...'' అన్నాడు. ''అయినా మీకెంత కా వాలి? ఒక్క గదైతే సరిపోదా?!''

''నిజమేగాని ఊరికే ఎవరు ఇస్తారు చె ప్పండి, వీరయ్యాగారూ! అద్దెలేకుండా గది దొరికితేనే ఆఫీసు పెట్టుకోమని ఉత్తర్వులు. నేనేం చేసేది. వాళ్ళకేమో ఊరిమధ్యలో ఆఫీ సుకు జాగా కావాలి. ఒక్కపైసా కూడా ఇవ్వ రూ... ఇదైనా ఏదో ఈ షావుకారికి ఊరికే పద్దులు రాస్తాను కనుక దయదల్చి నా బోర్డు పెట్టుకో అన్నారు'' తన బాధ వెళ్లగక్కేడు పాల్.

''ఈ షావుకారేం వ్యాపారం చేస్తాడు. పళ్లపా డి వ్యాపారం కాదుకదా?'' పాకేజీ పెట్టెలవంక అనుమానంగా చూస్తూ అడిగేడు.

''కాదు. కారుచౌకలో సబ్బులు తయారు చేసి, మలయా పంపుతుంటాడు. చాలా డబ్బొ స్తుందిలెండి''

''చాలా సులభం అనుకుంటాను'' ఉత్సా హంగా అన్నాడు వీరయ్యా.

''కాదండీ... చాలా చిక్కులున్నాయి. ఇదో జూదంలాటిదంటే నమ్మండి'' వీరయ్యా ఉత్సా హంమీద నీళ్లు చిలకరిస్తూ అన్నాడు.

''అయినా డబ్బొస్తుందికదా'' అతని మన సులో సబ్బు వ్యాపార వస్తువుగా మంచి లాభసా టిదిగా తోచింది. అయితే వచ్చిన చిక్కల్లా సబ్బు ఎలా తయారవుతుందో పూర్తి జ్ఞానం అతడికిలేదు. ఎంతో ప్రయత్నించి కొబ్బరి నూనె, కాస్టిక్‌సోడా మాత్రం వాడుతారని గుర్తు తెచ్చుకున్నాడు. వెయ్యిరూపాయల పెట్టుబడి

వుంటే లక్షలు సంపాదించుకోవచ్చని తోచడంతో, అతని ఆలోచన వీరయ్యా నశ్యం, వీరయ్యా పళ్లపొడి, వీరయ్యా సబ్బులలో దేంతో వ్యాపారం చేస్తే బాగుంటుందా? అన్న విషయంమీద నిలిచిపోయింది. కాసేపు ఆ గదిలో నిశ్శబ్దం రాజ్యమేలింది. అతన్నే పరీక్షగా చూస్తున్న పాల్ అడిగేడు.

"మీ ఆలోచనలు పూర్తయ్యాయా?"

"క్షమించండి. అనుకోకుండా కొన్ని వ్యాపార విషయాలు ఆలోచిస్తూ వుండిపోయాను"

"నిల్చుండిపోయారు. అలా కూర్చోండి" స్టూల్ చూపిస్తూ చెప్పాడు.

వీరయ్యా చిన్న స్టూల్‌మీద కూర్చున్నాక, పాల్ ఎదురుగా వున్న బల్లమీద కూర్చున్నాడు అతనికభిముఖంగా.

"వీరయ్యాగారూ! జాగ్రత్తగా వినండి. ఇది చాలా ముఖ్యమైన విషయం. ముందు, మీకు బాగా డబ్బు సంపాదించాలని వుందా? లేదా? చెప్పండి" గొంతు తగ్గించి అడిగేడు. అతని నేత్రాలు కళ్లద్దాల్లోంచి వీరయ్యానే గంభీరంగా చూస్తున్నాయి.

వీరయ్యా ఆశ్చర్యపడుతూ అన్నాడు. "మీరెలా ఊహించేరు?"

"రెండే విషయాల గురించి మనిషి మెదడెప్పుడూ ఆలోచిస్తూ వుంటుంది. ఒక సైకాలజిస్టుగా నేనావిషయం ఘంటాపదంగా చెప్పగలను"

"ఏమిటా విషయాలు?"

"ఒకటి డబ్బు. రెండోది సెక్సు... కాదంటారా?" సవాల్‌లాగా పెదిమలు బిగించేడు పాల్.

వీరయ్యకేం చెప్పాలో తోచలేదు. ఇరుకున పడిపోయేడు. జాగ్రత్తగా ఆచితూచి అన్నాడు.

"వీటి గురించే కాదు. ఇంకా చాలా వాటి గురించి ఆలోచించవచ్చు. ఉదాహరణకి పిల్లలను తీర్చిదిద్దడం గురించి"

"భలేవారే. తల్లి గురించి ఏం ఆలోచించకుండా, ఆమెవల్ల పుట్టే పిల్లల గురించి మాత్రమే ఆలోచించగలరా? ఎవరైనా?"

వీరయ్యా ఏం జవాబు చెప్పలేక "మీ భావాలు చిత్రంగా వున్నాయి" అని మాత్రం అన్నాడు.

"నేనొక సామాజిక శాస్త్రవేత్తని. నిజం నిష్కర్షగా చెప్పటం నాకు అలవాటు. నాకు మరే విషయాల్తో పనిలేదు. ప్రజల్లోని అజ్ఞానం తొలగించటం, వారి వైవాహిక జీవితాల్ని ఆనందమయం చేసుకునే మార్గాల్ని తెలియచెప్పటం నా కర్తవ్యమని భావిస్తాను" అని-

గంభీరంగా "నేటి ప్రపంచంలో ఇదొక మంచి ఆదాయం సంపాదించిపెట్టే వృత్తిగా వుంటోంది. మీకు తెలుసా?" అంటూ అడిగేడు.

వీరయ్యా నిటారుగా కూర్చున్నాడు.

"దేని గురించి మీరు అంటున్నది?"

అతని ప్రశ్నను పట్టించుకోకుండా, చెప్పుకుపోయేడు పాల్.

"కొద్దిరోజుల్లో నేనొక క్లినిక్ తెరుస్తున్నాను. క్లినిక్ అంటే అదొక రకమైన మానసిక వైద్యశాలలాటిదనుకోండి. ప్రజల వైవాహిక జీవితానికి సంబంధించిన సమస్యలన్నిటికీ పరిష్కారాలు దొరుకుతాయిక్కడ. చాలా తక్కువఫీజు తీసుకుంటాను. ఎంతమంది రోజూ వచ్చిపోతారో ఊహించగలరా? ఎంత తక్కువగా చూసుకున్నా రోజుకు అయిదువందలకుతక్కువ రాబడి వుండదు. నా పుస్తకం 'కామకేళి' చూశారు కదా" అంటూ ఆగేడు కాసేపు.

"అవును..." అన్నాడు వీరయ్యా.

"అది నా పథకంలో మొదటిభాగం. అది అచ్చయి విడుదలయితే లక్ష కాపీలకి తక్కువ అమ్ముడుబోదు..."

"ఏరేటు వుంటుంది?"

"ఇరవైరూపాయలకి ఒక పుస్తకం అనుకోండి. అంతకంటే ఎక్కువైతే సామాన్యుడు కొనలేడు"

"అంటే ఇరవైలక్షల రూపాయలు సంపాదిస్తారన్నమాట?"

"దాంట్లో వింతేముంది? అయినా అది ప్రారంభంలో మాత్రమే"

"ఇరవైలక్షలు. ఇరవైలక్షల రూపాయలే" వీరయ్యా కంటికి ఈ వ్యక్తి మహామహిమాన్వితుడిలా కనిపించేడు. సన్నగా, బలహీనంగా వుండి రోజంతా సైకిలుమీద తిరుగుతూ న్యూస్‌పేపర్లో వేయాడానికి వార్తలు సేకరించే

ఈ వ్యక్తి అరచేతిలో లక్షలు సంపాదించే మంత్రం వుంది. వీరయ్య తలలోంచి నశ్యం, వళ్లపొడి, సబ్బు వ్యాపారాలు మటుమాయమై పోయి వాటి స్థానంలో ఈ పుస్తకం జొరబడింది.

"అది ప్రారంభంలోనే, తర్వాత సంవత్సరం. ఆ తర్వాత సంవత్సరం అంతకంటే ఎక్కువే రావొచ్చు. జీవితాంతం దానిమీద సంపాదనవుంటూనే వుంటుంది. అమ్మకాలకి పరిమితి వుండదు. ఆనందమయ సంసార జీవితం కావాలనుకునే ప్రతీవాడూ దాన్ని కొని తీరతాడు. మన భాష మాట్లాడేవాళ్లు, మనదేశంలోనేకాక, బర్మా, సయా, దక్షిణాఫ్రికాల్లో విపరీతంగా వున్నారు. ఒకవేళ దాన్ని హిందీలోకి అనువాదం చేస్తే మన దేశమంతటా అమ్ముకోవచ్చు. జనాభాలెక్కల ప్రకారం చదవటం రాయటం వచ్చినవాళ్లు ఇరవైఅయిదు కోట్ల పైనే వున్నారు. ఒక్కొక్కరు ఇరవైరూపాయలు పెట్టి కొంటే లెక్కవేయండి ఎంత డబ్బో..."

విపరీతమైన ఆకర్షణకి గురయ్యేడు వీరయ్య.

"నిజమే నాకింతవరకు పుస్తకాలకి అంత అమ్మకాలుంటాయని తెలీదు"

"అన్ని పుస్తకాలకీ అలా వుండదులెండి. ఉదాహరణకి నేను ఒక కథల పుస్తకమో, కవితా సంపుటో, వేదాంత గ్రంథమో అచ్చువేసేననుకోండి. కొనేవాడే వుండడు" నవ్వుతూ అన్నాడు పాల్.

వినయంగా తలూపేడు వీరయ్య. ఒక్క నిమిషం ఆగి అన్నాడు పాల్. "నేను ఇలా ఈ పుస్తకం గురించి ఒక్కమాట చెపితే పబ్లిషర్లు పరుగెత్తుకుంటూ వస్తారు"

"అందులో సందేహంలేదు" వీరయ్య ఒప్పుకున్నాడు.

"ఇప్పటికే కొంతమంది నాకు కొన్ని ఆఫర్లు చేసేరు కూడా. పదివేలిస్తామని అంతకంటే ఎక్కువే ఇస్తామనీ. కానీ లక్ష ఇచ్చినా నేనాపుస్తకం ఎవ్వరికీ ఇవ్వదలుచుకోలేదు. వీరయ్యగారూ" గంభీరంగా చెప్పేడు.

"ఎందుకని?"

"ఎందుకంటే, అది నా దగ్గిరుంటేనే, నా క్లినిక్‌లో ఎక్కువగా ఉపయోగపడుతుంది. కనకనే దాన్ని అమ్మదలుచుకోలేదు"

"అయితే మీ దగ్గిరే వుండిపోతుందన్నమాట"

"అంతేమరి. ఎవరైనా వ్యాపారస్తుడిలాగా వచ్చి అడిగితే, నసేమిలా ఇవ్వను... పొమ్మంటాను" నిక్కచ్చిగా చెప్పేడు.

వీరయ్య నిరాశచెందిపోయాడు. తను కూడా అతడి దృష్టిలో వ్యాపారస్తుడి కిందే వస్తాడు. తన గురించి తనే గొప్పగా అలా చెప్పుకున్నాడు మరి.

పాల్ మళ్లీ తనే అన్నాడు. "కానీ ఎవరైనా స్నేహితుడిగా వచ్చి అడిగితే, మాత్రం కాదనకుండా ఇచ్చేస్తాను. స్నేహానికి ప్రాణం ఇచ్చే స్వభావం నాది" అంటూ వీరయ్య వంక పరీక్షగా చూసేడు.

వీరయ్య నమ్మలేదు. "ఎందుకా ఒట్టిమాటలులెండి. డబ్బెవరికి చేదు?"

"నేను ప్రజోపయోగం ఆశయంగా వున్నవాణ్ణి. స్నేహాన్ని గౌరవించేవాణ్ణి. డబ్బు నాకెప్పుడూ ఆఖరి అవసరమే"

వీరయ్య ఇంక ఆగలేకపోయాడు. మనసులో ఇందాకటినుంచీ సుళ్లు తిరుగుతున్న కోరిక, పెదాలమీదకి దొర్లుకుంటూ వచ్చి బయటపడిపోయింది.

"నేను... అచ్చువేయటానికీ, అమ్ముకోడానికీ, మిమ్మల్నడిగా ననుకోండి" అతని మాటలు పూర్తి కానేలేదు.

పాల్ లేచినించున్నాడు. గబగబా బయటకి వెళ్లిపోయేడు. సైకిల్ హేండిల్‌ని తగిలించి వున్న సంచీ మోసుకుంటూ వచ్చేడు. దాన్లోంచి అంతకుముందు వీరయ్య చూసిన వ్రాతప్రతిని తీసి మరోమాట లేకుండా, వీరయ్య ఒళ్లోపడేశాడు.

"తీసుకోండి. అది మీదే. మీకు కావలసినట్లు చేసుకోండి" వీరయ్య తన కళ్లను తనే నమ్మలేకపోయేడు. ఆ పుస్తకాన్ని అంతకుముందు తాను చూసిన దవునో కాదో, తిరగేసి చూసుకున్నాడు.

"నాతో వేళాకోళం ఆడుతున్నారు. నేనెలా తీసుకుంటాను. వుంచండి" అంటూ తిరిగి ఇవ్వబోయేడు.

తీసుకోలేదు పాల్. తల అడ్డంగా ఊపేడు.

''ఇంక అది నాదికాదు. దాని అమ్మకం అయిపోయింది'' చెయ్యి వీరయ్య ముందుకు చాపుతూ అన్నాడు. ''మీ జేబులో ఎంత ఉంటే అంతా ఇవ్వండి. నా పుస్తకం బదులు ఆ డబ్బు తీసుకుంటాను. అదే నా పుస్తకాన్ని మీకమ్మే రేటు. కాదనకండి''

వీరయ్య- ''నేనేం డబ్బు తేలేదే'' అని నసిగేడు.

''అబద్ధమాడకండి. మీ జేబులో పర్సు నాక్కనిపిస్తోంది'' పాల్ చిరునవ్వు నవ్వుతూ అన్నాడు.

జేబువంక చూసి వీరయ్య నిట్టూర్పు విడిచేడు. పర్స్‌కాదని బుకాయించబోయేడు. పాల్ వినలేదు. పుస్తకం కావాలంటే పర్స్ తీసిమ్మని పట్టుబట్టేడు. గత్యంతరం లేక వీరయ్య తన పర్స్ బయటకు తీసేడు. దాంట్లో అతని దగ్గిర మిగిలిన డబ్బు నూటరవైరూపాయలు మాత్రం వున్నాయి. ఇరవైరూపాయల నోటు తీసివ్వబోయాడు. పాల్ ఒప్పుకోలేదు.

''మొత్తం డబ్బివ్వాల్సిందే. అని పట్టుపట్టేడు. ఇంకా అన్నాడు. ''నేనేం అన్యాయంగా అడగటంలేదే. లక్షలార్జించి పెట్టే పుస్తకాన్నిచ్చి మీ పర్స్‌లో ఎంతుంటే అంతే ఇమ్మన్నాను. ఒక్కరూపాయైనా వెయ్యిరూపాయలైనా, చివరికి ఖాళీ పర్సయినా ఇమ్మన్నాను. ఇంతకంటే సబబైన బేరం ఇంకేముంటుంది''

వీరయ్యకి చూస్తూ, చూస్తూ తన డబ్బు వదులుకోవటానికి ఇష్టం లేకపోయింది.

''నాకూ నిజంగా మీ పుస్తకం అక్కర్లేదు. దాన్నెలా అచ్చు వెయ్యాలో ఆ వ్యవహారాలేమిటో, నాకసలేం తెలీవు'' అంటూనే 'టోపీ వ్యవహారంలో ఇరుక్కున్నానేమో అని మధనపడ్డాడు. కానీ ధనాశతో అటూ, ఇటూ ఊగిసలాడుతున్నాడు.

''అదేమంత కష్టంకాదు. ప్రింటర్ అచ్చువేసి ఇస్తాడు. పుస్తకం రెడీ కాగానే కొద్దిగా ప్రచారం చేస్తే చాలు. ప్రజలే తీర్థప్రవాహంలా వచ్చి కొనుక్కువెళతారు. సమస్యలు లేకుండా, హాయిగా నీడపట్టున చేసుకునే వ్యాపారం ఇది. వీరయ్యగారూ! నిజానికి మీరు కావలసినవన్ని పుస్తకాలు సప్లయి చెయ్యలేక విసిగిపోతారంటే నమ్మండి''

వీరయ్య సిద్ధంగా వున్న తన ప్రశ్నని సంధించేడు ''అలాంటపుడు ఆ సులువైన పని మీరే ఎందుకు చెయ్యకూడదు?''

''నిజమే... మీకు నిజంగా నా పుస్తకం అక్కరలేకపోతే నిక్షేపంగా అదే పనిచేస్తాను. కానీ నేను ఒకమాటకోసం మీకు ఆఫర్ చేశాను. మీకక్కర్లేనపుడు నా బలవంతం ఏమీలేదు'' అంటూ పుస్తకంకోసం వీరయ్యవైపు చెయ్యిచాపేడు.

''ప్రతీ మనిషికీ జీవితంలో మహత్తరమైన మార్పు కలిగించే అవకాశం ఒకేసారి వస్తుంది వీరయ్యా! మీరిప్పుడు ఆ అవకాశం పొందగలిగే స్థితిలో వున్నారు. ఏదో ఒకనాడు మీరు బజార్లో వూరికే తిరుగుతుంటే మీరు వదిలేసిన అవకాశాన్ని అందిపుచ్చుకున్న వ్యక్తి మీ పక్కనుంచే రోల్స్‌రాయిస్ కార్లో దూసుకుపోవచ్చు''

మళ్ళీ ఆగి అన్నాడు ''మీకొక్క అయిదు నిముషాలు టైమిస్తాను. మీకా పుస్తకం కావాలంటే మీ పర్స్‌లో వున్న మొత్తం డబ్బు మీరిచ్చి తీరాలి. ఆలోచించుకోండి'' అంటూ తన రిస్ట్‌వాచ్‌వంక చూపులు కేంద్రీకరించి, పుస్తకంకోసం చెయ్యి చాపేవుంచేడు పాల్.

ఎక్కడినుంచో ఒక సైకిల్ బెల్ వినిపిస్తోంది. ఒక సూర్యకిరణం ఎత్తుగా వున్న వెంటిలేటర్లోనుండి ఆ గదిలోకి మెత్తగా జారింది. వీరయ్యలో భరించలేని సంఘర్షణ చోటుచేసుకుంది. 'నిముషానికెన్ని వేలు నష్టపోతున్నానో' అన్న భయం అతని ఆలోచనలు చంపేసింది. ఆగకుండా వినిపిస్తున్న సైకిల్ బెల్ చప్పుడు గణగణమని మోగుతున్న గుడి గంటల చప్పుడులాగా అనిపించి మరింక ఆలస్యం చేయకుండా, పర్స్‌లోవున్నదంతా చాపివున్న పాల్ చేతిలో పెట్టి, గుప్పిట మూసి, ఆ చేతిని పక్కకి నెట్టి,

''భలేవారే!'' అంటూ నవ్వుతూ లేచి నిలబడ్డాడు వీరయ్య.

అతని మనస్సు తేలికపడింది.

★ ★ ★

కొత్త ఉత్సాహంతో వీరయ్య ఇంటిగుమ్మంలో అడుగు పెట్టేసరికి, మీనాక్షి బాలూనెత్తుకుని వాడికి ఆకాశంలో నక్షత్రాలను చూపెడుతూ

మైమరిపించి అన్నం తినిపిస్తోంది.

తండ్రిని చూసి వాడు "నాన్నా" అంటూ చేతులు జాపేడు.

"ఆగరా! ఆగు... వస్తానుండు" అంటూ చేతిలో పుస్తకం పాకెట్టు వాడు చూడకుండా జాగ్రత్తపడుతూ, తప్పించుకుని లోపలకి వెళ్ళి తన బట్టల పెట్టె తెరిచి, పుస్తకం దాంట్లోపెట్టి తాళంపెట్టాడు.

"ఏం తెచ్చారేమిటి?" అన్న భార్య ప్రశ్న వినిపించుకోనట్టు నటించి బట్టలు మార్చుకున్నాడు.

బాలూ తండ్రిదగ్గిరికొచ్చి ఎంతో ఉత్సాహంతో

"నాన్నా! మరేమో సాయంత్రం పెద్ద కోతొచ్చింది నాన్నా! మనింటికే వచ్చింది" కళ్ళు గుండ్రంగా తిప్పుతూ చెప్పేడు చేతులాడిస్తూ.

"ఆహా! అదేం చేసిందిరా బాలూ!"

"అదీ... అదేమో... మరి కొబ్బరిముక్క తింది. నీళ్ళు తాగింది. ఇంకా మొగ్గలు కూడా వేసింది. నాన్నా! నాకు ఒక కోతిని కొనిపెట్టవా నాన్నా!"

"నువ్వు బుద్ధిగా అల్లరి చేయకుండా వుంటే తప్పకుండా కొంటాను" వాగ్దానం చేసేడు.

రోజులా కాకుండా కుర్రాడితో ఆడుతూ, కూనిరాగాలు తీస్తున్న భర్తను చూసి సంగతేమిటో తెలుసుకోవాలని మీనాక్షి తెగ ఉబలాట పడింది. కానీ వీరయ్య ఆమెకా అవకాశం ఇవ్వకుండా తప్పించుకు తిరిగేడు. రాత్రి భోజనాలయ్యాక బాలూని కథలు చెప్పి నిద్రపుచ్చేడు.

మీనాక్షి తన పనులన్నీ పూర్తిచేసుకుని నవ్వు మొహంతో వచ్చి భర్త పక్కన కూర్చుంది. అతను ఆమెచుట్టూ చెయ్యివేసి దగ్గిరకు తీసుకున్నాడు. 'ఆలింగనానికి అధ్యయన సూత్రాలు' జ్ఞాపకం వచ్చింది. ఆమె తన రెండుచేతులూ అతని మెడచుట్టూ వేసింది. అతనికి వాళ్ళ శోభనంనాటి రాత్రి గుర్తుకు వచ్చింది.

"నువ్వు పూలు పెట్టుకోవడమే మానేశావు. ఏం? రోజూ పెట్టుకోవచ్చుగా..."

"ముసిలితనం వచ్చేసేక నాకెందుకండీ ఇంకా పూలూ... అవీ!"

"కానీ ఈ ముసిలాడికి, ఈ ముసిల్దాని జడలో పువ్వులు చూస్తే ఎంతో ఆనందం కలుగుతుంటుంది... తెలుసా?"

ఇద్దరూ నవ్వుకున్నారు ఒకరిమొహం ఒకరు చూసి.

సరిగ్గా అటువంటి సమయంలో ఆమె అడిగింది,

"మీరు సాయంత్రం తెచ్చిన పాకెట్టు ఏమిటో చెప్పుదురూ!"

"ఓ... అదా! నీకు చూడాలని వుందా?"

"బాగుందండీ... చూడాలనేకదా అడుగుత!"

లేచి వెళ్ళి పెట్టె తీసి, కాయితం చుట్టివున్న పుస్తకం తెచ్చేడు. అతనా కాగితం విప్పుతూ వుంటే ఎంతో కుతూహలంగా చూసినామె, పుస్తకం కంటపడగానే నీరుకారిపోయింది.

"ఏమిటిది?" మొహం మాడ్చుకుని అడిగింది.

"ఇదో చదువుకునే పుస్తకంలే"

"నేనేదో మీరింకా ఓ బహుమతో, చీరో తెచ్చేరనుకున్నాను" ఆశాభంగం ప్రకటించింది.

"అదేం పుస్తకం?" అడిగిందామె.

"నువ్వే చూడు..." ఆమె చేతికిందించేడు వీరయ్య.

పేజీలు తిప్పి చూసి నిర్ఘాంతపోయిందామె. "ఇదేం పుస్తకమండీ. ఇంత ఛండాలంగా వుంది. ఈ రాతలేమిటి?"

"కాదు... కాదు... అలా అనకు. అదొక శాస్త్రీయగ్రంథం. దీనివల్ల మనం బాగా డబ్బు సంపాదించొచ్చు"

ఆమె నిర్లిప్తంగా అంది, "ఎవరైనా ఇంత ఘోరంగా ఎలా రాస్తారో... ఎంతైనా మగవాళ్ళకు సిగ్గూఎగ్గూ లేదంటారందుకే!"

"అరె... దీన్లో తప్పేముందని. ప్రపంచంలో అందరి జీవితంలో వున్నదే. ఎంతో అవసరమైన విషయం కూడానూ. సరైన పరిజ్ఞానం వున్నప్పుడే వివాహాలు సుఖజీవితాన్నివ్వగలుగుతాయి. మన బాలూగాడు పెద్దవాడయ్యేక నేను తప్పనిసరిగా వాడికీ విషయాలన్నీ చెప్పి తీరతాను"

"ఇహ ఆపండి..." అంటూ ఆ పుస్తకం

పక్కకు గిరాటేసింది మీనాక్షి.

అతడు దాన్ని తీసుకుని, కళ్ళద్దాలు వెతికి తెచ్చుకుని పైకి చదవటం ప్రారంభించేడు. నీతి, నియమాలకు అతీతంగా వున్నట్లనిపిస్తు న్న ఆ పుస్తకాన్ని భర్త చదువుతుంటే కొంత ఆసక్తితో, కొంత అసహ్యంతో వింటోంది మీనాక్షి.



ఆ తర్వాత కొన్ని రోజులు వీరయ్యా మిగిలిన విషయసేకరణలో గడిపేడు.

ఒకరోజు బయల్దేరి మార్కెట్ రోడ్‌లో వున్న గోర్డాన్ ప్రింటర్స్ అచ్చాఫీసులోకి అడుగుపెట్టా డు. ఆ ఊర్లో ఉన్న ప్రెస్సుల్లోకల్లా అదే పెద్దది. దాని యజమాని మదన్‌లాల్ ఎన్నో ఏళ్ళ కిందట బొంబాయినుండి వచ్చి అక్కడ స్థిరప డిపోయాడు. బలంగా, ఎర్రగా, రిమ్‌లెస్ కళ్ళ ద్దాలు ధరించిన సీమపందిలా వుంటాడనొ చ్చు. పెద్ద హాల్లో వున్న ఒకే ఒక టేబుల్‌వెనక కుర్చీలో కూర్చుని ప్రూఫులు చూసుకుంటూ, పనివాళ్ళమీద కేకలేస్తూ వుంటాడు. అతనేకాక డజనుమందికిపైగా మిషన్ల రొదలో, తమ పన్ల ను చకచకా సాగిస్తూవుంటారు.

ఒక్క నిముషంమాత్రం వీరయ్యా లోపలకి అడుగుపెట్టడానికి సంశయించేడు. పుస్తకం చించిపారేస్తాడేమోనని భయపడ్డాడు. అయితే తన ఆశయసాధనకు వున్న ఒకే ఒక మార్గాన్ని అధైర్యంతో విడిచిపెట్టకూడదన్న తలంపు రాగానే నిబ్బరం కలిగి,

"మీ యజమానెక్కడ?" అని గంభీరంగా ప్రశ్నించేడు నౌకర్ని.

"అదుగో... ఆ టేబుల్ దగ్గిర కూర్చున్నా యనే" చూపేడతను.

వీరయ్యా చేతిలో వున్న కాగితాల బొత్తిని చూడగానే ఎదురుగా వున్న కుర్చీ చూపి కూర్చోమన్నాడు మదన్‌లాల్.

"ఏం చెయ్యాలి? చెప్పండి"

వీరయ్యా కుర్చీలో స్థిమితంగా కూర్చుని పుస్తకాన్ని టేబుల్‌మీద వుంచాడు.

"ఈ పుస్తకం చెయ్యగలరా?"

"చదివేకగానీ చెప్పలేను"

"అయితే చదివే చెప్పండి"

వాచీ చూసుకుని "నాకిప్పుడు టైము చాల దు. ఇక్కడే వుంచి వెళ్ళండి"

"అది కుదరనిపని. దీన్నెవరికీ ఇంతవ రకూ అలా ఇవ్వలేదు. మీకు తీరేవరకూ కాచుకుంటాను"

"నాకు చాలా పన్లున్నాయే!"

"నాకూ వేరే వ్యాపారాలు చాలా వున్నాయి. మీదగ్గిరకి నేను మీరు చెయ్యగలిగే పనికోసమే వచ్చాను. మీకు తీరిక లేకపోతేసరే. ఊర్లో ఇంకే ప్రెస్సులూలేవని మీదగ్గిరకి రాలేదు. వస్తాను" లేచి పుస్తకం చేతిలోకి తీసుకున్నాడు.

"వుండండి... కొంచెం ఆగండి..." పుస్తకం అందుకుని కొన్ని పేజీలు చూశాడు.

అతనిలో ఆశ్చర్యం కొట్టొచ్చినట్టు కని పించింది వీరయ్యాకి. తర్వాత మరాతడు ఆ పుస్తకంలోంచి తల పైకెత్తనేలేదు.

కుర్చీలో జేరబడి, తీరుబడిగా కూర్చున్నా డు వీరయ్యా. తను ప్రవర్తించిన తీరు అతనిలో ఆత్మవిశ్వాసాన్ని పెంచింది. 'ఇదే పద్ధతి. పొర పాట్నయినా అవతల వ్యక్తి మన అవసరాన్ని గుర్తించేడా, మనం అతను చెప్పినట్టు వినాలి. అలాకాక బింకంగా వున్నామా అతడే కాళ్ళబే రానికి వచ్చితీరతాడు' అనుకున్నాడు.

ప్రూఫులు తెచ్చినవాళ్ళు మదన్‌లాల్ అను జ్ఞకోసం ఎదురుచూస్తున్నారు.

ఎకౌంటెంట్ కాబోలు లెడ్జర్ ఒకదాన్ని రెండుచేతులతో తెరిచి పట్టుకుని లాల్‌కి చూ పించడానికి కాబోలు నిలబడి వున్నాడు.

కానీ లాల్ ఈ బాహ్యప్రపంచంలో లేనేలే డు. ఒకసారిమాత్రం అతనిచుట్టూ వాళ్ళంతా చేరిపోతే,

''ఎవర్రా! దూరంగా పోండి. లైటుకు అడ్డం వస్తున్నారు'' అని గట్టిగా అరిచాడు.

అందరూ చెదిరిపోయేరు వెంటనే.

ఎకౌంటెంట్‌మాత్రం ముందుకు వచ్చి లెడ్జర్ లాల్‌ముందు పెడుతూ, ''ఇది అర్జెంటండీ!'' అన్నాడు. తను చదువుతున్న పుస్తకంమీద అడ్డంగా వున్న ఆ లెడ్జర్‌ని వెంటనే దూరంగా తోసేశాడు లాల్.

తన యజమానిని ఇంతగా ఆకర్షించిన పుస్తకం ఏమిటా అని అతను వెనకనుంచి లాల్‌మీదుగా పుస్తకంలోకి తొంగిచూడబోయేస రికి లాల్ గద్దించేడతన్ని.

''బుద్ధిలేదూ... ఎప్పుడూ ఇంకోళ్ళు చదివే దాన్ని అలా తొంగిచూడ్డానికి ప్రయత్నించకు... వెళ్ళు''

ఒక్క నిమిషం వీరయ్యవైపు తిరిగి, ''చూడండి... ఎలాటివాళ్ళున్నారో... వాళ్ళకవసరంలేనివాటిమీద వుండే శ్రద్ధ పనిలో చూపిస్తే బాగుండిపోను''

అదే అదనుగా వీరయ్య అడిగేడు, ''మీరు మొత్తం చదవాలా?''

''అవును... లేకపోతే నేను అచ్చువేయగలనో లేనో చెప్పలేను''

''అంతసేపూ నేనిలా కూర్చోవాలా?'' ఆశ్చర్యంగా చూసేడు లాల్.

''తప్పదు... మీరలా అనబట్టేకదా లేకపోతే వెళ్ళి ఏదైనా పనుంటే చూసుకురండి''

క్షణం సంశయించేడు వీరయ్య. ''సరే వుంటాన్లెండి. కానీ త్వరగా పూర్తిచేయండి''

''అలాగే... మరిక నన్ను కాసేపు వదిలెయ్యండి'' అసహనంగా అన్నాడు మదన్‌లాల్. మాట్లాడుతున్నాడేగానీ అతని కళ్ళు పుస్తకంలోని అక్షరాలమీదే వున్నాయి.

ప్రూఫులు టేబులుమీద పేరుకుపోతున్నాయి. పనివాళ్ళు కంపోజింగు కాపీలకోసం నిలబడి పోతున్నారు. యజమాని సంతకంకోసం ఎకౌంటెంటు వీలున్నప్పుడల్లా వచ్చి వెళుతున్నాడు. ఒకసారిమాత్రం అతన్ని కస్సిగ్గి కొట్టినంత పనిచేసి సంతకం చేసేడు మదన్‌లాల్. మిగిలిన పేపర్లన్నీ పక్కకి తోసి పనివాళ్ళకి వార్నింగిచ్చేడు

''ఎవరూ, నేనీ పుస్తకం పూర్తిచేసేంతవరకూ నా దగ్గిరకి రావొద్దు. ఇది చాలా అర్జెంటుపని''

భోజనాల సమయం కావొస్తున్నా పుస్తకం చదవటం ముగియలేదు. పనికుర్రాణ్ణి పిలిచి ఇద్దరికీ తినడానికి ఫలహారాలు, కాఫీలు తెప్పించేడు లాల్. వీరయ్య మొహమాటపడకుండా తృప్తిగా తిన్నాడన్నీ. పుస్తకం ఒకపక్క చదువుతూనే తినడం ముగించేడు లాల్.

నాప్‌కిన్‌తో మూతి తుడుచుకుంటూ ''మీ పుస్తకం చదివేను'' అని ప్రకటించేడు చివరికి.

''అయితే మీ నిర్ణయం ఏమిటి? ముద్రిస్తారా?'' అడిగేడు వీరయ్య.

''పుస్తకం చాలా బాగుంది. సందేహంలేదు''

''ప్రతీ ఒక్కరూ చదివి తీరవలసిన పుస్తకం!'' వీరయ్య నొక్కిచెప్పేడు.

''కాదు... కాదు... ఆ మాట అనకూడదు మీరు. అందరూ చదవడానికి కాదిది. పెళ్ళి కాని కుర్రాళ్ళు చదివితే ఎలా?''

''పెళ్ళికి ముందే తెలుసుకోవలసినవి తెలుసుకుంటారు!'' తేలిగ్గా అన్నాడు వీరయ్య.

ఆ జవాబుతో ఇద్దరిమధ్య ఒకరిమీద ఒకరికి అవగాహన ఏర్పడింది.

వీరయ్యవంకే సూటిగా చూస్తూ అన్నాడు, ''ఏ నిర్ణయం నిర్ణయించుకునేముందు నా లాయర్ని సంప్రదించాలి''

''లాయర్‌కీ, పుస్తకానికీ సంబంధమేమిటండీ'' వీరయ్య చిరాకుపడ్డాడు.

''అలాకాదులెండి. ఈ పుస్తకం నిషేధించిన వాటికింద వస్తుందో, లేదో నేను తెలుసుకోవాలి. లేకపోతే ఇద్దరం జైలుకు వెళ్ళాల్సి వస్తుంది. మీకు తెలుసుకదా!''

''ఇదేం అశ్లీల పుస్తకం కాదే. సోషియాలజీకి సంబంధించిన గ్రంథం''

''అలా అయితే సమస్యే లేదు. కానీ మా లాయరు కూడా ఆ మాట అంటే నాకు ధైర్యంగా వుంటుంది. మీరోపని చేయకూడదూ... రేపోసారి రాగలరా?''

''ఎందుకు?''

''ఏసంగతీ మీకు రేపు చెపుతాను. ఈ పుస్తకం నాకిచ్చి వెళ్ళండి''

''సారీ! ఈ పుస్తకంమాత్రం ఇవ్వలేను. కావాలంటే ఇంకేదైనా చెప్పండి'' నిక్కచ్చిగా అన్నాడు వీరయ్య.

''పోనీ... నాతో మా లాయరు దగ్గిరకి వస్తారా?''

''ఎప్పుడు రావాలి?''

''రేపు మీకు పగటివేళ ఎప్పుడు వీలయితే అప్పుడు. నా కార్లో వెళ్ళి వచ్చేద్దాం!''

కాస్త తీరిక చిక్కుతుందా, చిక్కదా అని ఆలోచించినట్టు నటించాడు వీరయ్య. ''రేపు నాకసలు తీరదు. చాలా పన్లున్నాయి. అయినా మీరు చేస్తాను, చెయ్యను అన్న సంగతి తేల్చి చెప్పేస్తానంటే కొంచెం వీలు చూసుకుని వస్తాను. మీదో పెద్ద అచ్చాఫీసని మీ దగ్గిరకి వచ్చేను. మీరు నా పని చక్కగా చేసివ్వగలరని అనుకున్నాను. మీరు కాదంటే పదిమంది సిద్ధంగా వున్నారు చెయ్యడానికి''

''మా ప్రెస్సులాటిది ఈ పరగణాలో ఎక్కడా లేదు. మేం చేసినంత నీటుగా, వేగంగా మిగిలినవాళ్ళెవ్వరూ చెయ్యలేరు'' గర్వంగా చెప్పుకున్నాడు మదన్‌లాల్.

''మీరేం ఛార్జీ తీసుకుంటారు?''

''పనిచేసేదీ, లేనిదీ తేల్చుకున్నాక ఆ వివరాలు మాట్లాడుకుందాంలెండి''

''ఎన్నాళ్ళు పడుతుంది అచ్చువ్వటానికి నా పుస్తకం?''

''అది రేపు చెపుతాను''

''మీరు చాలా జాగ్రత్తగా మాట్లాడతారు!'' మెచ్చుకున్నాడు వీరయ్య.

''వ్యాపారంలో ఆమాత్రం జాగ్రత్త లేకపోతే ఎలా...?'' నవ్వుతూ అన్నాడు లాల్.

నిజమే... వ్యాపారస్తుడికీ, రాజకీయ నాయకుడికీ వుండాల్సిన ముఖ్యమైన లక్షణం 'దేనికీ కమిట్ కాకపోడం'. వీరయ్య ఒకటొకటిగా ఈ సూత్రాలు నేర్చుకుంటున్నాడు.

సంగీతకారుడు సరిగ్గా రాగం పాడలేకపోతే, ఒక రచయిత తను రాసేదానిలో భావం సూటిగా వ్యక్తం చెయ్యలేకపోతే, వాళ్ళు తమ తమ రంగాల్లో విఫలమవుతారు. అదే ఏ రాజకీయ నాయకుడైనా, వ్యాపారైనా, ఎంతో సేపు మాట్లాడినా, ఏదో సూచించినట్లుగానే వుండి ఏదీ సూచించకపోతేనే, అద్భుతంగా రాణిస్తారు.

వీరయ్యకి మంచిరోజులు వచ్చాయని ఆ మర్నాడు తెలిసిపోయింది. అతను వెళ్ళగానే మదన్‌లాల్ సాదరంగా ఆహ్వానించి కాఫీ తెప్పించి ఇచ్చాడు. వీరయ్య 'వెళదామా' అని అడగ్గానే లాల్ తను అంతకుముందే లాయర్ని కలిసి వచ్చేనని, రెండు షరతులకి వీరయ్య అంగీకరిస్తే పుస్తకం అచ్చు వేయటానికి తనకభ్యంతరం లేదనీ స్పష్టంచేశారు.

''మీ మనస్సులో వున్నదేదో సంకోచించకుండా చెప్పండి. వ్యాపారంలో అన్ని విషయాలూ క్షుణ్ణంగా తెలుసుకుంటేగానీ వ్యవహారం సాగదు. మీ సంగతి తెలిస్తేగానీ నేనింకోదగ్గరికి వెళ్ళటం కుదరదు''

''అలా అనకండి. నేను మీ పని కాదనడంలేదు. నాదగ్గిరకి వచ్చినవాళ్ళెవరి పనీ చేయకుండా పంపటం నాకు చేతకాదు''

''నాకూ ఒకపనిమీద వచ్చేక ఆ పని పూర్తిచేసుకోకుండా వెళ్ళే అలవాటు లేదు. ఇంతవరకూ అలా ఎప్పుడూ జరగలేదుకూడా'' తన మాటే పైమాటగా చేసుకున్నాడు వీరయ్య. తనకున్న ఏకైక ఆధారమైన ఆ పుస్తకాన్ని ప్రచురించి తనను ఐశ్వర్యవంతుణ్ణి చేయగల ఏకైక వ్యక్తి ఆ పని చేస్తాడా? చెయ్యడా? అన్న ఉత్కంఠ లోపల్లోపలే తినేస్తున్నా ఏమాత్రం పైకి తేలకుండా సామాన్యస్వరంతో అడిగేడు,

''మీరిందాక అన్న ఆ షరతులేమిటో చెప్పండొకసారి!''

''వినండి. మొదటి షరతు, ఈ పుస్తకం ప్రచురణలో నాకు భాగం ఇవ్వాలి''

''దేన్లో భాగం ఇమ్మంటున్నారు?'' కళ్ళు చిట్లించేడు వీరయ్య.

''పుస్తకం ప్రచురణలో... దానిమీద వచ్చే ఆదాయంలో నాకు వాటా కావాలి. ఖర్చులూ... లాభాలూ... సగం... సగం... మీకిష్టమైతే, రెండో షరతు చెప్తాను''

వీరయ్య కాస్త తటపటాయించేడు.

''ప్రస్తుతం వెంటనే నేనేం చెప్పలేను... రెండోది విన్నాక చెప్తాను''

''సరే... అయితే వినండి. ఆ పుస్తకంమీద వచ్చే చట్టపరమైన వివాదాలనుండి నన్ను

మినహాయించాలి''

''అంటే...!?''

''అంటే, ఆ పుస్తకం అసభ్యమైందని రుజువైతే దానికి బాధ్యత మీరే వహించాలి. నాకే సంబంధం వుండకూడదు''

''ఆహా...''

వీరయ్య దీనివెనకేదో గూడుపుఠాణీ వుందేమోనని అనుమానించేడు.

''ఎందుకు?'' అనడిగేడు.

''ఎందుకంటే ఆ పుస్తకం మీది కనక?''

''ఆ పుస్తకం నేనే అచ్చు వేయిస్తున్నట్లయితే దాని బాధ్యత మొత్తం నాదే అన్నట్లయితే మీ పని అచ్చువేయటంవరకే. కానీ దానిమీద నాకు వచ్చే ఆదాయానికీ, మీకూ ఏరకమైన సంబంధం ఎందుకుండాలో నాకు తెలీటంలేదు''

''ఒక్కనిముషంసేపు మదన్‌లాల్ నిరుత్తరుడయ్యేడు. అంతలోనే తేరుకుని అన్నాడు,

''నా ఉద్దేశం స్లీపింగ్ పార్టనర్‌గా వుందామని''

వీరయ్య ఆ పదబంధనానికి అర్థం తెలీక తికమకపడ్డాడు.

''నేను చాలా వ్యాపారాలు చేశాను. వాటిల్లో ఎన్నోరకాల పార్టనర్‌షిప్‌లు చూశాను''

''ఏం వ్యాపారం చేస్తుండేవారు?'' ఆసక్తి కలిగి అడిగేడు లాల్.

''ప్రధానంగా బాంకింగ్... మీకు తెలిసే వుంటుంది. బాంకింగ్ వ్యాపారం అంటే ఎన్నో వ్యాపారాల్తో సంబంధం వుంటుంది''

అతని మనసులో ఒక రైతుకు లోను దరఖాస్తు రాయటం, మరో రైతుచే అర్జీ పెట్టించటం, తనఖాపత్రాలు రాయటం చకచకా కదిలాయి.

మదన్‌లాల్ కొద్దిగా లొంగిపోయేడు. మొత్తంమీద ఆరోజంతా ఇద్దరూ చాలాసేపు మాట్లాడుకోవలసి వచ్చింది. విషయం తేల్చకుండా, మునగకుండా కాలక్షేపం చేశారు. ఎట్టకేలకి సాయంత్రంవేళకి ఒక ఒప్పందం కుదిరింది.

వీరయ్య ఆ పుస్తకం ఆదాయంలో నగం వాటా ఇవ్వటానికీ, ప్రతిఫలంగా వీరయ్య ఒక్క పైసా కూడా పెట్టుబడి పెట్టకుండా, మొత్తం పుస్తకం విడుదలై అమ్మకాలు ప్రారంభమయిన తర్వాత మూడు నెలలవరకు ఖర్చంతా మదన్‌లాలే భరించటానికీ ఉభయులూ ఆనందంగా అంగీకరించారు. వీరయ్య ఆ ఒప్పందంవల్ల తన సంతృప్తినేమాత్రం వ్యక్తంచేయలేదు. ''నాకు దీనివల్ల పెద్దగా ఒరిగేదేంలేదు. అయినా మీలాటివారి స్నేహంకోసం ఇలాటి ఇబ్బందులు, నష్టాలు నేను లెక్కచేయను'' ఉదారంగా అన్నాడు పార్టనర్‌షిప్ కాగితాలమీద సంతకాలు చేస్తూ.

విడిపోయేముందు అన్నాడు, ''మీరే గెలిచారు. ఎలాగైనా మీకున్న వ్యాపారదక్షత ఇంకెవరికీ రాదు''

నవ్వుమొహంతో ఆ కాంప్లిమెంట్‌ని అందుకున్నాడు మదన్‌లాల్.

''వ్యాపారంలో నగం, నగం వాటాలు అనుకున్నప్పుడు కొంత ఇవ్వకా, కొంత తీసుకోకా తప్పదులెండి'' బదులుగా అన్నాడతను.

గట్టిగా ఇంటి తలుపు తట్టేడు వీరయ్య.

లాల్ అతన్ని తన కారులో దింపుతానన్నాడు. కానీ వీరయ్య అందుకంగీకరించలేదు. తనుండే ఇల్లుకానీ, వీధికానీ అతడు చూడటం వీరయ్యకెంత మాత్రం ఇష్టంలేదు.

చాలాసేపు ప్రెస్‌లో కూర్చుని గడపటంవల్ల, కాళ్లు గుదుళ్లు పట్టిపోయేయని, హాయిగా నాలుగడుగులు నడిచి ఇంటికి పోతానని చెప్పి అతన్నుంచి తప్పించుకున్నాడు.

దబదబ తలుపుబాదేసరికి కంగారుగా భార్య వచ్చి తలుపుతీసింది. అతను లోపలకు రావడానికి వీలుగా గుమ్మం పక్కకు ఒదిగి నుంచుంది. అతని వాలకం చూసేసరికి ఆమెకి వెంటనే ఏ ప్రశ్నలూ వెయ్యడానికి ధైర్యం చాలిందికాదు.

అన్నం వడ్డిస్తూ తెచ్చిపెట్టుకున్న మృదుత్వంతో,

''ఈమధ్య రోజూ బాగా ఆలస్యం అవుతోంది'' అంది.

''అవును. ఇకమీదట ఇంతకంటే, రాత్రి అయినా కావొచ్చు. నేను ఊపిరినలపని పనిలో ఉన్నాను'' నిర్లక్ష్యంగా జవాబిచ్చేడతను అన్నం నమిలి మింగుతూ.

"అలాగా...! ఆ పుస్తకం అచ్చవుతోందా...?"

"అదంత సులభం కాదు"

ఆమె ఏం మాట్లాడకపోయేసరికి మళ్లీ చెప్పాడు.

"ఒక పెద్దమనిషితో వాటాదారుడిగా ఒప్పందం కుదిరింది." కొంచెం గర్వంగా అన్నాడు. "పెద్ద వ్యాపారస్తుడేలే. అందులో అనుమానం ఏంలేదు. బొంబాయివాడు మహా తెలివైనవాణ్ణనుకుంటాడు. కానీ నేను వాడి మెడలొంచేశాను" తృప్తి చెందేడు.

"మంచిపనే చేశారు" భర్తని పొగుడుతూ అందామె.

భర్తంటే కొత్తగా భయం, గౌరవం ఏర్పడుతున్నాయామెకి. అతను భోజనం పూర్తిచేసేసరికి, సిద్ధంగా చెంబుతో నీళ్లిచ్చి, కడుక్కోగానే చేతికి తువ్వాలు అందించింది.

భార్య ప్రవర్తనకు ఆనందం కలిగింది. మీనాక్షి చాలా మంచిది. మూడ్ బావులేకపోతే, జగడమాడుతుంది. కానీ స్వతహాగా చెడ్డదికాదు" అనుకున్నాడు. ఆమెపట్ల ప్రేమ కలిగింది. గట్టిగా అన్నాడు.

"బహుశా మన జీవితాలు ఓ కొత్తమలుపు తిరుగుతాయి. మీనాక్షీ... మనం ఊహించలేనంత డబ్బు రాబోతూంది"

ఆ మరునటిరోజు వీరయ్య పూర్తిగా ప్రింటింగ్‌కు సంబంధించిన సాంకేతిక విషయాలు తెలుసుకోవడంలో, నిర్ణయాలు తీసుకోవడంలో, మధన్‌లాల్ ప్రెస్సులోనే గడిపేసేడు. నిజానికి అతనికి అచ్చుపని ఎలాచేస్తారో, ఏమిటో తెలీదు. లాల్ మాత్రం వీరయ్య బాగా విషయపరిజ్ఞానం వున్నవాడే అనుకుని అతన్ని అభిప్రాయాలడిగేవాడు. నాకసలేం తెలీదు అని సూటిగా చెప్పలేక వీరయ్య నేర్పుగా అతన్నుండే విషయాల్ని తెలుసుకున్నాడు.

లాల్ అడిగేడు, "డెమ్మీలో వేద్దామా? ఆక్టేవోలోనా?" డెమ్మీ ఏమిటో, ఆక్టేవో ఏమిటో వీరయ్యకు తెలీదు. అవి దేనికి వర్తిస్తాయో, అన్నది అతడికి అనూహ్యమైన విషయం. నిర్లక్ష్యంగా అన్నాడు.

"దేని సదుపాయం దానికే ఉంది. మీరే నిర్ణయించండి. ఎంతైనా నాకన్న మీరు ఈ రంగంలో అనుభవజ్ఞులుకదా"

"డెమ్మీలో అయితే ఎక్కువ జాగా వుంటుందని నేను అనుకొంటున్నాను"

ఎక్కువ జాగా దేనికి సంబంధించిందో అర్థంకాలేదు.

"మరి రెండోదాన్లో అయితేనో"

"ఆక్టేవో చూడ్డానికి బాగుంటుంది. పంచాంగంలా వుండదు" పంచాంగం. అనగానే వీరయ్యకు డెమ్మీ సైజు నచ్చలేదు. వద్దనేశాడు.

"అలా అయితే ఆక్టేవోలోనే వేద్దాం" అన్నాడు లాల్. అంటూ "ఆ విషయం తేలిపోయినట్లే కానీ అయ్యే ఖర్చు గురించి కూడా మనం ఓసారి అనుకోవాలి" అని కూడా అన్నాడు.

"రెండింటికీ అయ్యే ఖర్చులో ఏమాత్రం తేడా వుంటుంది?" వీరయ్య ప్రశ్నించేడు.

"ఎక్కువేం వుండదు. పానుకి రూపాయివరకు వుంటుంది"

వీరయ్యకి అర్థంకాక మవునం వహించేడు.

అతడాలోచిస్తున్నాడనుకుని లాల్ మళ్లీ తనే,

"ఏం చేద్దామంటారు...?" అనడిగేడు.

"నిర్ణయం మీరే తీసుకోండి. మీకూ నగం వాటా వుందిగా. ఏది లాభం అనిపిస్తే, ఏది మంచిదైతే అది చేయండి" అని తప్పించుకున్నాడు. కానీ అగ్నిపరీక్ష అంతటితో అయిపోలేదు. లాల్ మరో పాయింట్‌తో ముందుకు వచ్చేడు.

"మామూలుగా వాడే టెన్‌పాయింట్ అక్షరాలు ఉపయోగిద్దామంటారా? బాడీ మాత్రం లెవెన్‌పాయింట్ ఉంటుంది"

వీరయ్య విసిగిపోయాడు.

"ఒక్కసారి మీ లెవెన్‌పాయింట్ బాడీ ఎలా వుంటుందో చూపించండి" తెగించి అడిగేశాడు.

లాల్ వెనక్కి వంగి ఒక పుస్తకం షెల్ఫ్‌లోంచి లాగేడు.

ఆ పుస్తకం అతను తిరగేస్తుంటే, ఏదో చదువుతున్నాడు కాబోలనుకున్నాడు వీరయ్య.

ఆ పుస్తకం అతను వీరయ్యముందు పెట్టి, పేజీలవంక చూపుతూ, ''ఇదే లెనెన్ పాయింట్ బాడీ... చూసి చెప్పండి'' అన్నాడు.

తదేకంగా ఆ అక్షరాల వంక చూసి, తలెత్తి,

''ఇది నాకు బాగానే ఉంది. మీరేమంటారు?'' అని అతన్నడిగేడు తెలివిగా వీరయ్య.

''నా దగ్గర ఉన్నవాటిల్లో దీన్ని మించిందిలేదు. టెన్‌పాయింట్ రోమన్ వుంది. చూస్తారా...?''

''మీ దగ్గర ఉన్నవాటిల్లో అదేమంచిదైతే, దీన్నే వాడదాం. అయినా ఇలాటి చిన్న విషయాలు నాతో చెప్పొద్దు. ఏదైనా ఖర్చులో బాగా తేడాగా వుంటే మాత్రం చెప్పండి''

''సరే... బైండింగ్ ఎలా చేద్దామంటారు?''

''అబ్బ... ముందే చెప్పేనుకదా. లాల్! ఈ విషయాలు నాకంతగా పట్టవు. నాకు కావలసిందల్లా పుస్తకం బాగా రావటం. ఏది బాగుంటుందో, అందుకేం చెయ్యాలో, ఎలా చెయ్యాలో మీరే నిర్ణయం చేసెయ్యండి. నేనేం కాదన్ను...''

''అలాక్కాదు. ప్రతీదీ ఖర్చుతో కూడిన విషయంకదా. రేపు మీరు అనవసరంగా ఎక్కువయిందని అనుకోకూడదని నా ఉద్దేశం''

''డబ్బు విషయం ఆఖర్నకదా, తేల్చుకుందామనుకున్నాం'' అనుమానంగా అడిగేడు.

''అవుననుకోండి. పుస్తకం మార్కెట్లో విడుదలైన మూడు నెల్లకి మనం లెక్కలు చూసుకోవాలి''

వీరయ్య నిబ్బరంగా ఊపిరితీసుకున్నాడు. ఎంతో కొంత డబ్బు ముందే కక్కమంటాడో, ఏమోనన్న భయం అతన్ని తినేస్తోంది అంతవరకూ.

''ఇంకోమాట. నా లాయర్ పుస్తకం పేరు కొద్దిగా మార్చమంటున్నాడు. మీకేం అభ్యంతరంలేదుకదా!'' సంశయిస్తూ అడిగేడు లాల్.

''ఇలాంటి విషయాల్లో లాయర్‌మాట పాటించాల్లెండి. నాకేం అభ్యంతరంలేదు'' ఉదారంగా అన్నాడు వీరయ్య.

''లేకపోతే లేనిపోని చిక్కులు ఎదురవుతాయి అనవసరంగా'' తృప్తిగా అన్నాడు లాల్.

''నిజం, మీరు చెప్పేది. మనం వ్యాపారం లాభాలకోసం చేస్తాంగానీ చిక్కులు కొనితెచ్చుకోడానికి కాదుగదా!'' అతనికి వంతపాడేడు వీరయ్య.

''మీరు మంచి సూక్ష్మగ్రాహులు సుమండీ!'' అంటూ అతన్ని మెచ్చుకున్నాడు లాల్.

★ ★ ★

ఆరోజుతో వీరయ్య జీవితం కొత్తమలుపు తిరిగింది. తర్వాత పనులన్నీ అతి సజావుగా, చక్కగా సాగిపోయేయి. అనుభవజ్ఞుడైన లాల్, మిగిలిన తన పనులన్నీ పక్కనపెట్టి, పుస్తకం పనిలోనే మునిగిపోయాడు. వీరయ్య పొద్దున్నే వచ్చి ఏరోజు పనులు ఆరోజు సాయంత్రంవరకు వుండి, ప్రత్యక్షంగా చూసుకునేవాడు. 'గోర్డాన్ ప్రింటర్స్' ఆఫీసులోనే ఒకపక్క వీరయ్యకోసం కేబిన్ నిర్మించేడు లాల్.

పుస్తకం విడుదలై వూహాతీతంగా డబ్బు రావటం ప్రారంభించింది. లాయర్ సలహామేరకు పుస్తకంపేరు 'శుభజీవితం'గా మార్చేరు. వీరయ్య జీవనరథం హాయిగా పయనించడం మొదలుపెట్టింది.

అయితే ఎంతో అందమైన గులాబీపువ్వుకు ముళ్ళలా వుంటాయో వీరయ్య జీవితానికి కూడా బాలూ అలా తయారయ్యేడు.

★ ★ ★

బాలూకు ఆరు సంవత్సరాల వయసొచ్చేసరికి వీరయ్య వాణ్ణి బళ్ళో చేర్పించేడు. ఆ వేడుక ఎంతో ఆర్భాటంగా జరిపించేడు. పువ్వులతో అందంగా అలంకరించిన కార్లో వాణ్ణి కూర్చుండబెట్టి మేళతాళాల్తో మెయిన్‌రోడ్లోంచి, ఊరేగింపుగా స్కూలుకి తీసుకుపోయేరు.

ఆ ఊరేగింపువల్ల దాదాపు అరగంటసేపు రోడ్డుమీద ట్రాఫిక్ స్థంభించిపోయింది. అద్దెకార్లో మెడలో గులాబీపూలదండ వేసుకుని, వాడు తన స్నేహితుల్తో కులసాగా కబుర్లు చెపుతూ, దర్జాగా కూర్చున్నాడు. ఆ టాక్సీ ముందు వీరయ్య తన సన్నిహితుల్తో హుందాగా నడిచివెళ్ళాడు.

అన్నిటిలోకీ ఆశ్చర్యం ఏమిటంటే అతని

అన్న కూడా ఆ ఊరేగింపులో పాల్గొవటం. అకస్మాత్తుగా వాళ్ళిద్దరికీమధ్య పొత్తు కలిసిపో యింది. ఆ ముందురోజు వీరయ్య చాలా సెంటిమెంటల్‌గా ఫీలవుతూ అన్నాడు మీనా క్షితో,

''ఎంతైనా అతను నా స్వంత అన్నయ్య. బాలూకి పెదనాన్న. మాది ఒకేరక్తం. అతను వచ్చి ఆశీర్వదించకపోతే ఎంతమంది పరా యివాళ్ళు దీవించినా నా మనస్సుకు తృప్తిలే దు. నాకు తెలుసు నా అన్న నన్నెలా పెంచి, పెద్దచేశాడో... అతని రుణం నేను తీర్చుకోలే నిది''

మీనాక్షి కూడా చివరికి డిక్లేర్ చేసేసింది, ''జరిగిందేదో జరిగిపోయింది. ఇకమీదట మన రెండు కుటుంబాల్నీ ఎవరూ విడదియ్యలేరు'' భర్త కొత్తగా చేయించిన రవ్వల దుద్దుల్ని తమ్మెలు సాగదీసి చూసుకుంటూ'' అంది.

బాలూను స్కూల్లో వేసేరోజు పొద్దున్నే అయి దుగంటలకి భార్యాభర్తలిద్దరూ వెళ్ళి పక్కింటి తలుపు తట్టేరు. వీరయ్య అన్న తలుపు తీసే డు. మీనాక్షి తల వంచుకుని, తిన్నగా వంటింట్లోకి తోడికోడల్ని పిలవటానికి వెళ్ళిపో యింది. వీరయ్య గదిలో అన్నముందు నిలబ డి వినయంగా అన్నాడు,

''అందరూ క్షేమమేగదా అన్నయ్యా! రేపు మన బాలూని బళ్ళో వేద్దామనుకుంటున్నాం. మీరిద్దరూ వచ్చి ఆశీర్వదించాలి''

ఒక్క నిముషంపాటు తను కలకంటున్నాన నుకుని నిలబడిపోయాడు అతను. అంతలోనే కంటిముందు ప్రత్యక్షంగా తమ్ముడు కనిపిస్తూ వుండేసరికి దిగ్భ్రాంతినుంచి తేరుకుంటూ, ''అలాగే... అలాగేలేరా...'' అని తడబడుతూ చెప్పాడు తమ్ముడితో.

''నువ్వూ, పిల్లలూ భోజనానికి రావాలి అన్న య్యా. పొయ్యి వెలిగించొద్దు ఈ రెండ్రోజులూ. వదినెక్కడ?''

''లోపలుంది'' అన్నాడతను.

వీరయ్య బిగ్గరగా ''వదినా!'' అంటూ కేకేశా డు.

అతనికి తన చిన్నప్పటిరోజుల్లో స్కూల్ నుండి ఇంటికి వస్తూనే పిలిచే ఆ పిలుపు జ్ఞాపకం వచ్చి కళ్ళు చెమర్చాయి. అతను వంటగదిలోకి నడవబోయేంతలో భార్య వంట గదిలోంచి వస్తూ, చప్పున బావగార్ని చూసి, పైటకొంగు భుజాలమీదకి లాక్కుంటూ తల వొంచి వినయాన్ని ప్రదర్శించింది. వీరయ్యని దాటుతూ, ఓ ఓరచూపు విసిరింది. ఆ చూ పులో ఏముందో ఏమో వీరయ్య మరి లోపలకి వెళ్ళకుండా ఆమె వెనకే వీధిలోకి వచ్చేశాడు.

వాళ్ళు ఇంటిగుమ్మంలో అడుగు పెడు తుండగా మీనాక్షి అంది, ''మీ వదిన రాదు... అనుకుంటాను''

''ఎందుకు? ఏమందేమిటి?'' కంగారుపడు తూ అడిగేడు.

''నాతో ఓ మాటైనా మాట్లాడిందా ఏమ న్నానా? పెదాలు బిగించి తలమాత్రం ఊపింది''

''ఏమైంది మీనాక్షీ... వదిన ఎందుకు అలా వుంది?''

''ఏమైందో ఏమో! నాకేం తెలుసు... అయినా ఆమె అదోరకం మనిషిలెండి!''

''అప్పట్లో నేనంటే ప్రాణంపెట్టేది వొదిన'' విచారంగా అన్నాడు వీరయ్య.

మీనాక్షి మండిపడింది. ''అయితే వెళ్లండి. వెళ్లిపిలవండి. మిమ్మల్నెవరూ వద్దన టంలేదు'' విసురుగా అంది.

''సరె... సరె... కోపం ఎందుకులే... నువ్వే నీ తప్పులేకుండా పిలిచేవుగదా! మనమధ్య గొ డవ అనవసరం'' సర్దేశాడు వీరయ్య.

వీరయ్య అన్న తన నలుగురి పిల్లల్ని తీసుకుని భోజనానికి వచ్చేడు. తమ్ముడి కొడు క్కి ఒక చిన్న వెండిపెట్టె కానుకగా ఇచ్చేడు. వీరయ్య చాలా సంతోషించేడు. బాలూ చేత పెదనాన్న కాళ్లకి సాష్టాంగ నమస్కారం చే యించేడు. అతడి దీవెనలు పూర్తయ్యాకే ఊరే గింపు ప్రారంభమయ్యింది.

* * *

బాలూని ఏ అమెరికాయో, ఇంగ్లండో పంపించి పెద్ద చదువులు చదివించాలని వీరయ్య సంకల్పం.

వీరయ్యలో అప్పటికే తను అనుకున్నది తప్పకుండా సాధించి తీరగలననే ఆత్మవి శ్వాసం బలంగా పెరిగిపోయింది. అందుకు



కావలసిన పట్టుదలా, స్ఫూర్తీ అతన్లో నిండివు న్నాయి.

అయితే బాలూను స్కూల్లో చేర్పిన పదిహే ను రోజులకే కొడుకు చదువు సక్రమంగా సాగేలా లేదని అతనికి అనుమానం కలిగింది.

వాడి అల్లరికి వాడు దెబ్బలు తినని రోజు లేదనీ, స్కూల్లో మేష్టర్లందరూ వాడి మీద తమ ప్రతాపాన్ని చూపిస్తున్నారనీ అతడికి తెలి సింది.

స్కూలుకి వెళ్లి అడగబోతే హెడ్మాష్టర్ నిష్క ర్షగా చెప్పేసేడు... అతని కొడుకుని తామెవ రూ నిష్కారణంగా శిక్షించటం లేదనీ, ఎవర్నై నాసరే క్రమశిక్షణకు భంగం కలిగిస్తే శిక్షించ కుండా విడిచిపెట్టమనీ.

వీరయ్యలో కోపం ఉబికి వచ్చింది. ఇష్టంలే కపోతే తనకొడుకుని అతడు తీసుకుపోవచ్చని వాళ్లు సూచించేసరికి, అప్పటికి చేసేదేమీ లేక వెనుదిరిగిపోయేడు. అయితే కార్యసాధకుడు కనుక అందుకు తగిన ప్లాను ఆలోచించి, ఆచరణలో పెట్టేడు. మళ్లీ స్కూల్ కమిటీ ఎన్నికలొచ్చేవరకు ఓపిగ్గా కాచుకున్నాడు, ఎంత ఖర్చయినాసరే అని సిద్ధపడి. ఒక కమిటీ మెంబర్ని రిటైరు చేయించి, అతని స్థానంలో తాను చేరిపోయి సెక్రటరీగా ఎన్నిక య్యేడు.

వీరయ్యే స్కూలు సెక్రటరీ కనుక బాలూకు స్కూల్లో ఒక విశిష్ట గౌరవమివ్వసాగేరు పిల్లలూ, టీచర్లూ కూడా. వాణ్ణి చూస్తే పిల్లలకీ, మేష్టర్లకీ కూడా హడలుపుడుతోంది. వీరయ్యే మంచి పలుకుబడి ఉన్న వ్యక్తని హెడ్మాష్టరుకి తెలు సు. ఎప్పుడైనా ఏ మేష్టర్లయినా ఇంటికి వచ్చి ఏదైనా ఉపకారం చెయ్యమని కోరితే, వీరయ్యే ఏనాడూ నోటితో కాదనేవాడుకాదు. ఓపిగ్గా విని తప్పకుండా చేస్తాననేవాడు. వాళ్లు అటు వెళ్ల గానే, వాళ్లు చెప్పింది మర్చిపోయేవాడు. వాళ్లు గానీ విడవకుండా వెంట తగిల్తే, ఏదో ఒకనాడు విసుక్కుంటూ అనేవాడు...

''నాకు సవాలక్ష పన్లుంటాయండీ... ఏదో అందరూ సెక్రటరీగా ఉండమంటే పదిమంది కీ ఉపయోగపడే పనికదా అని కాదనలేక ఒప్పుకున్నాను. అలాగని నా పూర్తి సమయం అంతా దీనిమీదే ఖర్చుపెట్టలేను కదా. మీ పని చూస్తానన్నానుగా. తప్పకుండా చూస్తాను.

కొంచెం తీరుబాటు కానివ్వండి మరి''

ఎన్నికలు అయిపోగానే ప్లేటు మార్చేసే రాజకీయ నాయకుడిలాగా వుండేవి అప్పుడ తని మాటలు.

వీరయ్య కొడుకు కోసం ఇంటి దగ్గర ఒక ట్యూటర్ని కూడా కుదిర్చేడు. దాని కోసం స్కూలు టీచర్లందర్లో బాలూ ఇష్టపడే వారెవరా! అన్నది తేల్చుకోవాలనుకున్నాడు. వాడిని అడిగితే ఎవరూ లేరన్నాడు.

''అలా అనకూడదు... ఎవరో ఒకర్ని చెప్పు... ఇంటి దగ్గర ట్యూషన్ చెప్పిస్తాను''

గత్యంతరం లేని పరిస్థితిలో వాడు ''నథాని యేల్'' అన్నాడు. వీరయ్య అతని గురించి ముందే విని ఉన్నాడు. అతడు పిల్లల్తో కలిసిపోయి వాళ్లకి కథలూ, ఆటలూ నేర్పడం, సోషలు పాఠాలు చెప్పడం చేస్తుంటాడు. ఎప్పుడూ ఎవర్నీ ఒక్క దెబ్బకూడా వెయ్యడు.

వీరయ్యకి పులిపిల్లకి మేకతో పాఠాలు చెప్పించడం ఇష్టం లేక ''ఏ మేష్టారు ఎక్కువ కొడుతుంటార్రా బాలూ!'' అనడిగేడు.

''సైన్సు లాబరేటరీ అటెండర్'' అన్నాడు వాడు.

''అటెండర్ కాదురా... టీచరు పేరు చెప్పు''

''ఆ అటెండర్ టీచరేనంట నాన్నా... సార్ అని పిలవాలంట... లేకపోతే చావబాదుతాడు''

''ఆహా... అలాగా...'' కోపంగా అన్నాడు వీరయ్య.

''నువ్వెళ్లి వాడికి చెప్పు నువ్వు ఎందుకూ పనికిరాని దద్దమ్మవని. నిన్నేమన్నా అంటే చెప్పు... వాడితోక కత్తిరించేస్తాను... రాస్కెల్''

''వాడికి తోక ఉంటుందా నాన్నా? నేను చూడనేలేదు. ఎక్కడ పెట్టుకుంటాడబ్బా'' బాలూకు నవ్వు వచ్చింది. పగలబడి నవ్వడం ప్రారంభించేడు. ఆ అలికిడికి వంటింట్లోంచి మీనాక్షి వచ్చింది.

''ఏమిటీ... ఏమైంది'' అంటూ...

వీరయ్య ''ఆపరా.. నీ గోల'' అనే వరకూ వాడు ఆపలేదు. వాడ్నేం అనలేకపోయేడతను.

అప్పటికి ఊరుకుని తర్వాత నెమ్మదిగా ఆరా తీసి మూర్తి అనే లెక్కలు, ఇంగ్లీషు బోధించే మేష్టరంటే వాడికి భయమని తెలుసుకుని అతణ్ణి తనను కలుసుకోమని కబురు పంపించేడు. అతడొచ్చేక అతడికి ఇంటి దగ్గర, స్కూల్లోనూ బాలూను పర్యవేక్షించే పని అప్పజెప్పేడు.

మూర్తికి ఈ పనివల్ల ఆనందం కలిగింది. వీరయ్య ఇచ్చే అదనపు ఆదాయమే కాక, స్కూల్ సెక్రటరీతో దగ్గరగా మసలగలగడ మొక మంచి అవకాశంగా భావించేడు.

స్కూల్లో మిగతా మేష్టర్లూ, హెడ్మాష్టరూ అతనికో ప్రత్యేక ప్రతిపత్తిని ఇవ్వడం మొదలుపెట్టేరు. హెడ్మాష్టరు ఏదైనా విషయంలో సెక్రటరీ అభిప్రాయం తెలుసుకోవాలనుకున్నప్పుడు, మూర్తిని పిలిచి గుసగుసలాడేవాడు. అయితే తన ఈ పనులవల్ల మూర్తి బాలూ మీద పట్టు పోగొట్టుకోవలసి వచ్చింది. మూర్తికి కూడా భయపెట్టి బాలూను దూరం చేసుకోవటం ఇష్టంలేదు.

ఎప్పుడైనా వాడు ''నాకీ మేష్టరొద్దు'' అని మారాం చేస్తే తనకి ఉద్వాసన ఖాయం అని తెలుసు అతనికి. అందుకే వాడికి చాకొలెట్లు, బిస్కట్లు వంటి బహుమతులు, లెక్క సరిగ్గా చేస్తేనో, లేక పోతే ఏదైనా పాఠం వొప్పజెపితేనో ఇస్తూ, మంచి చేసుకుంటూవుండే వాడు. మూర్తి పథకం బాగానే ఫలించింది. కాకపోతే లెక్కలు బాగా ఎక్కువగా ఇచ్చినా, ఏదైనా చదవమని బలవంతం చేసినా వాడు బ్లాక్ మెయిల్ చేస్తుండేవాడతన్ని.

ఎలాగైతేనేం, మూర్తి నెమ్మదిగా వాణ్ణి చదివించగలిగేడు. క్లాసు తర్వాత క్లాసుగా వాడు తొమ్మిదో క్లాసుదాకా నిరాఘాటంగా వచ్చేశాడు. వాడికోసం వీరయ్య సంవత్సరం తర్వాత సంవత్సరం స్కూల్ కమిటీ పదవి పోకుండా నిలబెట్టుకుంటూ వచ్చేడు. ఇంకో రెండేళ్లలో కొడుకుని మంచి కాలేజీలో చేర్పించాలని వీరయ్య ఉవ్విళ్లూరుతున్నాడు. ఊర్లో వాళ్లు బాలూని చూసినప్పుడల్లా పుడితే డబ్బున్నవాళ్ల కొడుకుగా పుట్టాలి అని ఈర్ష్య పడేట్లుగా వాడు పెరుగుతున్నాడు.

వీరయ్యా తన ఇంటిముందు గదిని 'బాలూ' స్టడీ రూంగా మార్చేడు. ఇంగ్లీషు దొరల పిల్లల్లా వాణ్ణి పెంచాలని అతని తాపత్రయం. ప్రతిరోజూ అతడు వాడి గదిని పరీక్ష చేస్తూ వుండేవాడు. ఎంత చేసినా బాలూ నిర్లక్ష్య ప్రవర్తనేం మారలేదని అతనికి తెలుస్తోంది.

పుస్తకాలు చెల్లాచెదరుగా గదినిండా పరుచుకుని వుండేవి. టేబులు డెస్క్‌లో, పక్షుల ఈకలు, రకరకాల ఆకారాల్లో వున్న రాళ్ళు, ఖాళీ సిగరెట్టు పెట్టెలు కలగాపులగంగా వుండేవి. అవి చూసి వీరయ్యా నిరుత్సాహపడేవాడు. చదువుకునే గది సరస్వతీ మందిరంలా వుండాలని అతడి అభిప్రాయం. అందుకే ఓ రోజు సరస్వతీదేవి పటాన్నొకదాన్ని తెచ్చి, ఆ గదిలో గోడకి తగిలించి, బాలూతో రోజూ ఆ దేవిని ప్రార్థించమని చెప్పేడు.

పొద్దున్నే కొడుకు కనిపించగానే, 'సరస్వతిని ప్రార్థించేవా' అని అడిగేవాడు.

వాడు 'ఓ' అని జవాబిస్తూనే, పరుగెత్తుకుని గదిలోకి వెళ్ళి, ఓ దణ్ణం ఆ పటానికి పారేసి, తిరిగి వేగంగా వొచ్చి వంటింట్లోకి దూరిపోయేవాడు.

వీరయ్యా అది సహించలేక, ఒకరోజు వాణ్ణి మందలించేడు.

''దేవుణ్ణి ప్రార్థించటం అంటే డ్రిల్లు చేయటం కాదు... మనస్ఫూర్తిగా ప్రార్థించాలి... తెలుసా!''

''నేను అలాగే ప్రార్థిస్తున్నాను నాన్నా...'' వాడు తడుముకోకుండా జవాబు చెప్పేడు.

''నీ మనసు మాత్రం అక్కడ లేదేం...''

''నేను దేని గురించి ఆలోచించేనంటే... ఆఁ... నా పాఠాల గురించి'' అలాగంటే తండ్రి సంతృప్తి పడతాడని చెప్పేడు వాడు. కానీ వీరయ్యా వదల్లేదు.

''నువ్వు సాష్టాంగా పడినపుడు... అంత తొందరగా లేవకూడదు''

''ఎంత సేపుండాలేం... నేను ఉండలేను''

''అలా చెయ్యకపోతే, నీకు జీవితంలో చదువురాదంతే'' బెదిరించేడు.

''రాకపోతే పోనీలే...''

''చదువు రాకపోతే, నువ్వు గుడ్డిగవ్వ విలువ చెయ్యవు... గుర్తుంచుకో... అంతేకాదు... దేవుళ్ల గురించి నిర్లక్ష్యంగా మాట్లాడకు ఏనాడూ కూడా. నీలా నేను చేసినట్లయితే ఈనాడు మనం ఈ స్థితిలో వుండేవాళ్లం కాదు''

''నువ్వు ప్రార్థించేది సరస్వతీదేవినికాదులే... నాకు తెలుసు'' మధ్యలోనే తుంచేసేవాడు తండ్రి చేస్తున్న హితబోధని.

భార్యని కోపంగా కేకేశాడు వీరయ్యా.

ఆమె ఆదరాబాదరా వచ్చింది వంటింట్లో పని మధ్యలో వదిలి.

''నువ్వు వాడికి నేర్పుతున్నదేమిటి?... అసలు వాణ్ణి నువ్వే చెడగొడుతున్నావు...''

''వాడేం చేసేడండీ... అయినా నామీద కేకలేస్తారేం'' తన తడిచెయ్యి చీర చెంగుతో తుడుచుకుంటూ అందామె.

వీరయ్యకి నిజానికి చెప్పడానికేమీలేదు. అందుకే, ''వాడు నా మాట కాదంటున్నాడు'' అని ఆమెతో ఫిర్యాదు చేసేడు.

కొడుకు వంక కోపంగా చూస్తూ, ''లక్ష్మీ, సరస్వతీ ఇద్దరూ ఒకటే... వేరు కాదు'' అన్నాడు.

వాడు కుండ బద్దలుకొట్టినట్టు జవాబిచ్చేడు. తండ్రంటే భయమేం లేదు వాడిలో...

''ఆ ఇద్దరూ వేరు... నాకు తెలుసు''

నీకేం తెలుసు... ఎవడ్రా నీకు చెప్పింది''

''మా మేష్టారు''

''ఎవరు?... ఆ మూర్తా...? ఆ ఫూల్‌తో నేను మాట్లాడతానుండు. ఇలాటి పనికిమాలిన బుద్ధులు నేర్పే ఆ మేష్టరు నీకు అస్సలు పనికిరాడు... రేపు అతను రాగానే, నన్ను కలవమని చెప్పు''

''కాని అతనొచ్చేసరికి నువ్వుండవు... మరి...'' సందేహం ప్రకటించేడు వాడు.

''నాకోసం ఆగమని చెప్పు... కలవకుండా వెళ్ళొద్దని చెప్పు''

''అలాగేలే...'' అన్నాడు బాలూ.

తన మేష్టరికి ఈ విచారకరమైన వార్త చెప్పాలని గొప్ప సంతోషంగా బయల్దేరాడు

బాలూ స్కూలుకి. మూర్తి కనబడగానే అరుస్తూ చెప్పేసేడు.

"మేష్టారూ... మేష్టారూ... మా నాన్న ఈరోజు మిమ్మల్ని తనొచ్చే వరకు వెళ్ళొద్దని చెప్పమన్నాడు"

మూర్తి మొహం పాలిపోయింది.

వణుకు బయల్దేరింది.

"ఎందుకు... ఎందుకురా...బాలూ...?" అని అడుగుతూ అంతలోనే కొందరు కుర్రాళ్ళు తమ చుట్టూ వుండే సరికి,

"పొండిరా... పోయి మీ క్లాసుల్లో కూర్చోండి" అని గద్దించేడు.

బాలూను భుజంమీద చెయ్యి వేసి ఒక పక్కకు తీసుకుపోయి అడిగేసేడు.

"చెప్పరా... బాబూ...మీ నాన్న నన్నెందుకు ఉండమన్నారు?"

"నాకేం తెలీదండీ!" వాడు తల అడ్డంగా ఊపేడేగాని, వాడి కళ్ళు కొంటెతనంతో మిల మిల మెరుస్తున్నాయి.

మూర్తి వాణ్ణి బతిమాలేడు.

"చూద్రా బాలూ! పొద్దున్నేం జరిగిందిరా...! నాతో చెప్పవురా... నీ మేష్టారికి చెప్పవన్న మాట... అంతేనా..."

బాలూ బేరానికి దిగేడు.

"ఈ రోజు నేనేలెక్కలూ చెయ్యను. అలా అయితేనే చెప్తాను" మూర్తి దానికి ఆనందంగా అంగీకరించేడు.

ఆ తర్వాత మరొకదానికి కూడా అంగీకరించక తప్పలేదతనికి.

"మీరు నాకు బర్ఫీ ఇస్తానన్నారు. ఈ మధ్యాహ్నం తెస్తానంటేనే..."

మధ్యాహ్నం తప్పకుండా తెస్తానని వాగ్దానం చేసేక, బాలూ విషయం చెప్పేడు.

మూర్తి మొత్తుకున్నాడు. "అలా ఎందుకు చెప్పేవురా... బాలూ... నేనెప్పుడైనా నీకు లక్ష్మీదేవి గురించైనా, సరస్వతి గురించైనా చెప్పేనుట్రా... భడవా..."

"మరి నన్నేం చెయ్యమంటారు. మానాన్న ఎవరు చెప్పేరని అడుగుతుంటే... మీ పేరు నోటికొచ్చింది... చెప్పేను..." అన్నాడు.

ఆ టీచరు వీరయ్య వచ్చేవరకు కాచుకుకూర్చున్నాడు. బాలూ భోజనానికి వెళ్ళిపోయేడు. వీరయ్య ఇంటికి వచ్చేసరికి ఎనిమిది దాటిపోయింది. బయట వీరయ్య జోళ్ళ చప్పుడు వినబడుతూనే, మూర్తి భయపడుతూ లేచి నిలబడ్డాడు.

వీరయ్య జోళ్ళను వరండా చివర ఓ మూలగా విప్పి జాగ్రత్తపెట్టి, హాల్లో అడుగుపెడుతూనే మేష్టర్ని చూశాడు కనుబొమలు చిట్లించి.

"ఎందుకింత ఆలస్యమైంది పాఠాలు చెప్పడం?" అనడిగేడు.

అతని ముందుకు వెళ్ళి మూర్తి చేతులు నలుపుకుంటూ "లేదండీ! నా పాఠాలు పూర్తయి చాలా సేపయింది. బాలూ బాబు పడుకోవటానికి వెళ్ళిపోయేడు కూడా... మిమ్మల్ని కలవాలనే ఉండిపోయేను" నమ్రతగా అన్నాడు.

"ఇప్పుడా... కుదరదే..." ఉత్తరీయం తీసి కుర్చీమీద వేసి, షర్టువిప్పబోతూ అన్నాడు.

"పొద్దున్నుంచి ఊపిరి సలపని పనితో విసిగిపోయి ఉన్నాను.

ఇప్పుడు మీ స్కూలు వ్యవహారాలు వినే ఓపిక నాకు లేదు... మీరు వెళ్ళండి. తర్వాత చూద్దాం..."

పెద్ద భారం పైమీదనుండి తొలగిపోయినట్లనిపించి సంతోషించేడు మూర్తి మేష్టరు.

"అయితే వస్తానండీ... సెలవు" అతడు గుమ్మం దాటుతుండగా, వీరయ్యకు ఏదో జ్ఞాపకం వచ్చి కేకేసాడు "విశేషం ఏదైనా ఉందా?"

కాస్త ఆలోచించి అతడు నిమ్మళంగా అన్నాడు. "ఏదీ లేదు లెండి"

"బాలూ బాగా చదువుతున్నాడా?"

"బాలూ కేమండీ... చక్కని కుర్రాడు.. బుద్ధిమంతుడు. చదువులో వాడికెవరూ సాటిరారు. అయితే కొంచెం శ్రద్ధగా కనిపెట్టుకుని వుండాలి"

"మరి మిమ్మల్నెందుకని వాడికి గురువుగా వుంచేననుకున్నారు. ఆబాధ్యత అంతా మీదే... వాడేమైనాదారితప్పుతున్నట్టు కనిపిస్తే వూరుకో

కండి గట్టిగా శిక్షించండి. దెబ్బలు తినకుండా ఏ కుర్రాడూ పెద్దవాడు కాడు... నేనేం అనుకోను... కుర్రాణ్ణి మంచి క్రమశిక్షణలో మీరుంచాలి. అర్థమైందా...''

''మీరంతగా చెప్పాలా సార్... నేను వాణ్ణి బాగా కనిపెట్టేవుంటున్నాను. ఒక ఉపాధ్యాయుడిగా నా బాధ్యతల్లో లోపం వుండదు సార్''



అతనా మాటలు పూర్తిచెయ్యకముందే వీరయ్య పెరట్లోకి వెళ్ళిపోయేడు. మీనాక్షి చెంబుతో నీళ్ళు తెచ్చిచ్చింది అతనికి. అతనా నీళ్ళతో మొహం కడుక్కుని తుడుచుకుంటుంటే, అడిగింది ఆమె,

''మీరెందుకు రోజూ ఆ మేష్టారితో బాలూను కొట్టు... కొట్టు... అని చెపుతుంటారు. అదేనా ఒక తండ్రిగా మీరు చెప్పాల్సింది. ఎవరైనా చదువు చెప్పమనడుగుతారు కానీ, పిల్లల్ని గొడ్డులా బాదమని చెప్తారా...?''

వీరయ్య ఆమె మాటల్ని తేలిగ్గా కొట్టిపడేసాడు.

''అదంతా నువ్వు నమ్ముతున్నావన్నమాట. టీచర్లతో అలాగే మాట్లాడాలి. అప్పుడే వాళ్లు హుషారుగా పనిచేస్తారు... పొరపాట్నయినా, ఆ మేష్టరు బాలూవంటిమీద చెయ్యి వేసాడే, వాడి తల తీయించేస్తాను''

మీనాక్షికి అంతా అయోమయంగా తోచింది. ఆమెకి భర్త మాటలేం అర్థంకాలేదు.

"వాణ్ణతడు కొట్టకూడదని మీరనుకున్నప్పుడు, మరి కొట్టమనెందుకు చెప్పడం...?"

"పిచ్చిదానా... ఈ పద్ధతులు నీకు తెలీవు... పోలీసుకు దొంగన్ని పట్టుకోమని, కొట్టమని చెప్పాలా... అలాగే కోతికి చెట్లెక్కమని చెప్పాలా... అలాగే ఈ టీచర్లూ... వాళ్ళకి పిల్లల్ని కొట్టడం నైజగుణం... వాళ్ళని ఆ పని చేయమంటే సంతోషిస్తారు. శ్రద్ధగా పనిచేస్తారు" అన్నాడు.

ఎలాగైతేనేం బాలు క్లాసు తర్వాత క్లాసుగా పదో క్లాసుకి వచ్చేశాడు. అంతవరకు వీరయ్య వరసగా తన స్కూల్ సెక్రటరీ పదవి నిలుపుకుంటూ వచ్చేడు. ఆ సంవత్సరం పదో తరగతి పాసైన వెంటనే, కొడుకుని మంచి కాలేజీలో చేర్పించాలని ఆలోచించి పెట్టుకున్నాడు. కానీ అతని పథకాలకు విఘాతం కలుగుతుందని అతడు కలలో కూడా వూహించలేకపోయేడు.

బాలూ ఆ సంవత్సరం పరీక్ష తప్పేడు.

★ ★ ★

వీరయ్యకి రొటీన్‌గా వున్న పుస్తకాల వ్యాపారంలో ఆసక్తి పోయింది. ఆరోజు సాయంత్రం ఇంటికి వచ్చేక మీనాక్షితో అన్నాడు... "వ్యాపారం బాగా పాతదైపోయింది. రోజంతా కుర్చీలో కూర్చుని పర్సంటేజీలెక్కలు చూడడంతో ప్రాణం విసిగిపోతోంది. అదీగాక ఇప్పుడిప్పుడే అమ్మకాలు కూడా తగ్గుతున్నాయి. మునుపట్లాలేవు"

మీనాక్షికి ఆ వ్యవహారాలు ఏం పట్టవు. అయినప్పటికీ భర్త మాటలు శ్రద్ధగా వింటున్నట్టు నటించడం ఎప్పుడో అలవాటు చేసుకుందామె.

ఆ తర్వాత పదిహేను రోజులకు వీరయ్య మదన్‌లాల్‌తో అదే విషయం చర్చించేడు. వాళ్లిద్దరిమధ్యా పార్టనర్ షిప్ ఏ విభేదాలు రాకుండా చక్కగా కొనసాగుతోంది. ఏ వ్యాపారంలోనైనా నిజాయితీ వుండి తీరాలన్న మదన్ లాల్ సిద్ధాంతమే వీరయ్యను అతన్తో విడిపోకుండా ఆపగలిగింది.

వీరయ్య పని కుర్రాణ్ణి పిలిచేడు "నువ్వెళ్లి మదన్‌లాల్‌ని మధ్యాహ్నం నాతో టిఫిన్ తీసుకోడానికి రమ్మన్నానని చెప్పు"

లాల్ వీరయ్య గదిలోకి వచ్చి ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు. వీరయ్య పుస్తకం సేల్స్ విభాగానికి మేనేజర్‌గా వున్నాడు.

"లాల్! మా ఆవిడ ఈరోజు లంచ్‌కని స్పెషల్స్ చేసిపెట్టింది. నువ్వు రుచి చూస్తావని పిలిచేను"

మదన్‌లాల్ ఇబ్బందిగా కదిలేడు. "నేను భోజనానికి ఇంటికి వెళ్లాలి వీరయ్యా! వస్తానని చెప్పి వచ్చేను"

"మరేం ఫరవాలేదు. కబురు పెడదాంలే..." అంటూ పని కుర్రాణ్ణి పిలిచేడు. మదన్‌లాల్ మీద వీరయ్య అప్పటికే మంచి పట్టు సంపాదించేడు.

"నువ్వు తొందరగా లాల్‌గారింటికి వెళ్లి ఆయనివ్వాళ మధ్యాహ్నం భోజనానికి రారని చెప్పు. పో... వస్తూ వస్తూ తోవలో ఆనందభవన్ నుంచి ఈ పొట్లాలు కట్టించుకురా... ఫ్లాస్క్ తీసుకు వెళ్లు. కాఫీ బావుండాలని నేను చెప్పేనని చెప్పు" అంటూ కొన్ని తినుబండారాల లిస్టు ఇచ్చేడు.

కుర్రాడు తలుపు మూసి వెళ్లిపోయేవరకు ఆగి, లాల్‌వంక తిరిగి సూటిగా అతని కళ్లల్లోకి చూస్తూ అన్నాడు...

"లాల్ నాకోసం నువ్వు ఇంతవరకూ చాలా చేశావు. నేను కూడా నీకోసం ఏదైనా చేయాలనుకుంటున్నాను"

మదన్‌లాల్ చూపుల్లో జాగ్రత్త ప్రవేశించింది. వీరయ్య లాటివాళ్లెవరూ ఏ లాభం లేకుండా అలా అనరని అతని వ్యాపార అనుభవం అతనికి నేర్పింది. పుస్తకం విషయం ఏదో చెప్పబోతున్నాడని గ్రహించేడు లాల్. తను చాలా మెలకువతో వ్యవహరించాలని నిశ్చయించుకున్నాడు. అందుకే అన్నాడు వాటంగా...

"దానికేముంది వీరయ్యా! ఒకళ్లకొకళ్లం ఆ మాత్రం సాయం చేసుకోకపోతే ఎలా? కేవలం లాభం కోసమే చూసుకుంటే ఎవరికీ సాయం చెయ్యడమే జరగదు. నేను నీ కోసం చేసిందెంత? దాన్నే ఎక్కువగా చేసి నన్ను కించపర్చొద్దు. నిజమేననుకో... నేను నీ పుస్తకం కోసం పడిన శ్రమ, చేసినకృషీ నా వ్యాపారం

పెంచుకోడానికి చేసివుంటే చాలా లాభం వచ్చేది. అయితే నాకు కలిగిన డబ్బు నష్టం గురించి నేనెప్పుడూ బాధపడను. నిస్వార్థంగా ఒక్కరికైనా సహాయపడ్డానన్న తృప్తి నాకు చాలు''

ఇంకేం మదన్‌లాల్ వీరయ్యకి దొరికాడు. అదే అదను అనుకుని గొంతు సవరించుకుని చెప్పటం మొదలు పెట్టేడు వీరయ్య...

''నా స్వభావం కూడా నీలాటిదే మదన్‌లాల్. అందుకే మనిద్దరం మంచి స్నేహితులం కాగలిగాం నేను మరొక్క అడుగు ముందుకెళ్లామనుకుంటున్నాను. డబ్బు నష్టమేకాదు, నీ కోసం నేను మరికొంత త్యాగం చేయాలని నిర్ణయించుకున్నాను. ఉపకారం చేసిన వాడికి ప్రత్యుపకారం చేయగలిగే అవకాశం అందరికీ, అన్ని వేళలా రాదు. కానీ అలా చేయగలిగినపుడు ప్రశాంతంగా నిద్రపోగలుగుతాం. కాదంటావా?''

అవుననీ కాదనీ ఏమీ అనలేదు మదన్‌లాల్. అతనికింకా విషయం అస్పష్టంగా వుంది. ఇంతలో బోయ్ ఫలహారాలు తెచ్చి ఇద్దరిముందు టేబుల్‌మీద అమర్చి పెట్టి వెళ్లిపోయేడు. తింటున్నంతసేపూ ఇద్దరూ లోకం తీరు గురించీ, త్యాగం గురించీ, నిజాయితీ గురించి మాట్లాడుకున్నారు. కాఫీలు పూర్తయ్యేటప్పటికి వీరయ్యే మళ్లీ విషయంలోకి వచ్చేడు.

''నేను 'శుభజీవితం' గురించి ఒకటనుకుంటున్నాను మదన్. నువ్వింన్నాళ్లూ మౌనంగా ఎంతో నష్టాన్ని భరించి, నాకు సహాయం చేసినందుకు చాలా కృతజ్ఞతలు. స్నేహధర్మం ప్రకారం ఇక నిన్ను బాధపెట్టడం నాకు మంచిదికాదు, కనుక దాని బరువు బాధ్యతలన్నీ నేనే తీసుకోవాలనుకుంటున్నాను. నీ అభిప్రాయం చెప్పు''

మదన్‌లాల్ వీరయ్యనించి ఈ ప్రపోజల్ వస్తుందని ముందుగా వూహించలేకపోయేడు. తెల్లబోతూ...

''అదేమిటి? ఇపుడా అవసరమేం వచ్చింది? అయినా మనం పార్టనర్ షిప్ డీడ్ రాసుకున్నాం. లాయరేమంటాడో'' అని కొంచెం తొందరతొందరగా అన్నాడు.

''అబ్బా... మన మధ్య ఆ లాయర్, పార్టనర్ షిప్ డీడ్‌ల మాటలెందుకు మదన్‌లాల్. మనం మంచి స్నేహితులం. అనవసరంగా లాయరు ప్రసక్తి తీసుకువచ్చి నా మనసు బాధపెట్టేవు'' దిగాలు పడుతూ వెనక్కి చేరబడిపోయేడు వీరయ్య.

లాల్ కొంచెంసేపటివరకు ఏమనలేకపోయేడు. కప్పులో మిగిలిన కాఫీ ఒక్కగుక్కలో గొంతులో వంపుకుని, గొంతు సవరించుకుని అన్నాడు...

''లాయరు అంటే ఎందుకంత కంగారు వీరయ్యా! వాళ్లేం భూతాలు, రాక్షసులూ కాదే! నీకేమోగానీ, నాకు మాత్రం ఇలాటి వ్యవహారాల్లో లాయర్ల సలహా లేకపోతే కరచరణాలు కదలవు బాబూ...''

అతనలా అనేసరికి వీరయ్య కొంచెం సర్దుకున్నాడు.

''నేనూ లాయర్లు లేకుండా వారితో సంప్రదించకుండా ఏ పనీ చేయను. నువ్వు ఒక్క లాయర్నే సంప్రదిస్తావేమోగానీ, నేను ఇద్దరు ముగ్గురు లాయర్ల సలహా పాటిస్తాను. ఐతే ఇప్పుడు నేను చెప్పింది లాయర్లతో ప్రస్తావించవలసింది కాదు. మనలో మనం నిర్ణయించుకోవలసింది. నీకు ఆసక్తి లేకపోతే, మళ్లీ ఎప్పుడూ ఈ ప్రతిపాదన చేయనని మాటిస్తాను. నువ్వు నన్నర్థం చేసుకోకపోవటం నీ తప్పుకాదు. నా దురదృష్టం అని సరిపెట్టుకుంటాను'' బాధగా అన్నాడు.

లాల్ కొంచెం మెత్తపడ్డాడు.

''సరే... వీరయ్యా! ఇంతకీ నీ అభిప్రాయమేమిటో చెప్పు''

'''శుభజీవితం' లావాదేవీలకు సంబంధించి, నీవాటా నాకు అమ్ముతావా?'' దాపరికం లేకుండా స్పష్టంగా అడిగేసేడు వీరయ్య.

తేలు కుట్టినంత పనయ్యింది మదన్‌లాల్‌కి.

''అది జరగని పని..'' అరిచేడు.

''నేను మనమధ్య రాసుకున్న ఎగ్రిమెంటు ప్రకారమే నడుచుకుంటున్నపుడు నేనెందుకు నా వాటా రద్దు చేసుకుంటాను వీరయ్యా? అది

ఎన్నటికీ జరగదు'' ఖండితంగా అన్నాడు.

''అబ్బా... అది ఒక సూచనేనయ్యా! నువ్వు పడుతున్న శ్రమ తప్పించాలనీ, నీ పూర్తి సమయం నీ ప్రెస్సు పని చూసుకోవటంలో గడపగల్గుతావనీ, ఇంకా ఎక్కువ లాభాలు సంపాదించుకోగలవనీ అన్నాను. కంగారుపడ తావెందుకు?''

''కుదరదు వీరయ్యా! ఊహు... నేను అమ్మ లేను'' బింకంగా అన్నాడు మదన్‌లాల్.

''ఓహో...'' అంటూ కాసేపు ఆలోచనా ముద్రలో వుండిపోయేడు వీరయ్య. గట్టిగా ఊపిరిపీల్చి వదిలి అన్నాడు...

''సరే... అయితే విను... నీకో మంచి అవకాశ మిస్తాను. గుండెల మీద చెయ్యి పెట్టుకుని అన్నాడు. ''నా గుండెలు చీలిస్తే నాకు స్నేహ మంటే ఎంత అభిమానమో నీకు తెలియగల దు మదన్‌లాల్. నీకు వీలయితే నేను చె ప్పింది చెయ్యి. అప్పుడైనా నీకు నేను మోసం చేసే వుద్దేశంతో ఈ ప్రతిపాదన చెయ్యలేదని నీకర్థమయితే అంతేచాలు''

''నువ్వనేది నాకు అర్థం కాలేదు''

''మరేంలేదు... నువ్వు నీ లాయర్నిగానీ, పోలీసుల్నిగానీ పిలవనని ముందు వాగ్దానం చెయ్యి. అప్పుడు చెపుతాను''

''వెటకారం చెయ్యకు వీరయ్యా! ను వ్వెంతగా పట్టించుకుంటావని తెలిస్తే ఆ మాట అనకపోయేవాణ్ణి'' నొచ్చుకుంటూ అన్నా డు లాల్.

''సరేలే... విషయానికొద్దాం. నువ్వూ, నేనూ వ్యాపారస్తులమేకనక సజావుగా వ్యవహారం మాట్లాడుకుందాం, అంగీకారం కుదిరినా, కుద రకపోయినా సరే. ఇప్పుడు చెప్పు... మన పుస్తకం పూర్తిగా సర్వహక్కులతో సహా నీకిచ్చే స్తాను... తీసుకుంటావా? ఇంకో రెండు నెలల్లో పెళ్లిళ్ల సీజన్ ప్రారంభం అవుతోంది. అయినా నరే నీకిచ్చేస్తాను. తీసుకుంటావా?''

దానికీ మదన్‌లాల్ ఒప్పుకోలేదు. నాకొకరి దయాదాక్షిణ్యాల మీద బతకటం ఇష్టంలేద న్నాడు.

ఆ తర్వాత రెండు రోజులపాటు విపరీతస్థా యిలో చర్చలు జరిగేయి. ఆఖరికి వీరయ్యి దగ్గిర్నుంచి ఆ పుస్తకం పెద్ద మొత్తం చెల్లించి, తీసుకోవటానికి లాల్ అంగీకరించేడు. వీర య్య ఆ వెంటనే పార్టనర్ షిప్ కాగితాలు పరపరచింపేసి లాల్ టేబుల్ దగ్గరున్న చెత్త బుట్టలో పారేశాడు.

లాల్ వీరయ్య చేసిన ఆ పనికి ఎంతగానో కదిలిపోయినట్లు కనిపించేడు. చెయ్యి చాచి వీరయ్య చేతినందుకుంటూ...

వ్యాపారస్తులుగా మనం స్నేహితులమ య్యాం. మన మధ్య వ్యాపారం లేకపోయినా స్నేహం మాత్రం మిగిలిపోవాలని కోరుతున్నా ను. నీకే రకమైన అచ్చు పనులు కావాలనుకు న్నా నన్ను మర్చిపోకు. నీ సేవ చేయటానికి నేనెప్పుడూ సిద్ధమే. ఇది నా ప్రెస్సే కాదు, నీదికూడా... మర్చిపోకు'' అన్నాడు.

వీరయ్య గుమ్మం దాటి వెళుతూంటే అతని వంకే తదేకంగా చూస్తూ నిలబడిపోయేడు. వీరయ్య తను అనుకున్న పని అనుకున్న దానికంటే ఎక్కువ లాభసాటిగా జరిగి నందుకు ఆనందిస్తూ, జేబులో చెక్కుతో ముందుకు నడిచేడు.



వీరయ్య చెక్కు బేంకులో డిపాజిట్ చేసి తన మనసులో అస్పష్టంగా రూపుదిద్దుకుంటు న్న పథకానికి మెరుగులు దిద్దటానికి కొన్ని రోజులు ఇంటిపట్టునే వుండిపోయేడు.

అదే సమయంలో ఒకరోజు మూడవసారి పదవతరగతి పరీక్షలకు తయారవుతున్న బాలూ చదువును పరీక్షిస్తూంటే, అతనికి అను కోకుండా డాక్టర్ పాల్ తటస్థపడ్డాడు.

''మీ ఇల్లు తెలుసుకోలేకపోయేను వీర

య్యా! ఈ వీధిలో వెతుకుతుంటే మీ కేకలు విన్పించి గుర్తుపట్టాను'' అంటూ లోపలకి అడుగుపెట్టిన పాల్‌ని చూసి మొదట వీర య్యే నమ్మలేకపోయేడు. అతను ఇంకా తేరు కునే లోపునే పాల్, బాలూను చూసి...

''అయితే మీరు మీ వాడికి చదువు చెప్తుతు న్నారన్న మాట... వెరీబేడ్... మీకు తెలీదేమో, విదేశాల్లో తల్లిదండ్రులు పిల్లలకి చదువు చె ప్పకూడదని నిషేధం వుంది. నువ్వు పోరా.. బాబూ... పోయి హాయిగా ఆడుకో''

ఇంకా అతనా మాట పూర్తి చేయకుండానే బాలూ పుస్తకాలు పట్టుకుని వెళ్లిపోయేడు.

వీరయ్యకి పాల్ అలా బాలూను పంపించడం ఇష్టం లేకపోయింది. ఏమన లేక...

''రండి డాక్టర్... ఇలా కూర్చోండి... ఇన్నాళ్లూ ఏమైపోయేరు?ఎక్కడున్నారు? బాగున్నారా?'' అంటూ ఆహ్వానించి కుర్చీ చూపించేడు.

భార్యని పిలిచి అర్జెంటుగా రెండు కప్పుల కాఫీ తెమ్మన్నాడు. కాఫీలు వచ్చేంతలో మరో సారి పాల్ వివరాలు అడిగేడు.

''నేను టూరిజంలో ట్రైనింగ్‌కోసం వెళ్లేను. అందుకే మిమ్మల్ని కలవలేకపోయేను''

వీరయ్య వింతగా చూసేడు. ఈ మనిషే మిటి ఎప్పుడూ కొత్తకొత్త విషయాలు మాట్లాడు తాడు అని అనిపించి అడిగేడు.

''టూరిజమా! అదేమిటి?!''

''అది సామాజిక కార్యక్రమంలో ఓ భాగం. ముఖ్యంగా దాని వుద్దేశం ఏమిటంటే ఈ భూమ్మీద నివశిస్తున్న వాళ్లందరూ ఒకరికొకరు తెలియటం''

''అదెలా సాధ్యమండీ!''

''సాధ్యం కాదుకనకనే, ప్రతీ ఊళ్లో ఒక టూరిజం స్పెషలిస్టు వుండాలి''

వీరయ్యకేం బోధపడలేదు.

అది గ్రహించి పాల్ జాలిగా వీరయ్యవంక చూసి ''అదంతా వివరంగా మీరు నా ఆఫీసుకి వచ్చినపుడు చెప్తానులెండి. ఇంతకీ మీ సంగ తెలా వుంది? అది చెప్పండి?'' అన్నాడు.

వీరయ్యకి తన వ్యాపారం గురించి వివ రంగా పాల్‌కి చెప్పటం ఇష్టం లేకపోయింది. అందుకే ''ఆ వ్యాపారం ముగిసిపోయింది లెండి... ఆ వివరాలు నిదానంగా చెప్తాను. మీ సంగతే మీరు చెప్పటంలేదు. నేను మీ కోసం అడిగితే మీరు ఊరు వదిలి వెళ్లిపోయేరని తెలిసింది. ఎక్కడికెళ్లేరు? ఏంచేసేరు?''

''నాలాటి కొత్తకొత్త జీవితానుభవాల్ని వెతు క్కుంటూ పోయేవాడికి, స్థిరం ఏముంటుంది వీరయ్యగారూ! నేను ఆ పేపరు పని మానేశా ను. ఆ తర్వాత మరి ఇక్కడలేను. చాలా ఊళ్లు తిరిగేను. చాలా ఉద్యోగాలు చేసేను. మళ్లీ ఇక్కడకి రావాలనిపించి వచ్చేసేను...'' క్లు ప్తంగా చెప్పేడు పాల్.

''నేనొక కొత్త వ్యాపారం మొదలు పెట్టాలను కుంటున్నాను''

''నేనూ విన్నాను. బేంకు మేనేజరు చెప్పే డులెండి''

ఈ మనిషి ఇంత తొందరగా తన గురించి విషయసేకరణ ఎంతవరకు చేసేడోననిపించి వీరయ్యకి ఆశ్చర్యం వేసింది. పుస్తకం లాభాల్లో వాటా ఇమ్మంటాడో ఏమోనని భయం కలి గింది. కాఫీ రెడీ అయినట్లు మీనాక్షి వంటింట్లోంచి చప్పుడు చేసింది.

''ఇటురా! మీనాక్షీ!! ఈయన ఎవరో కాదు. పాల్ అని చెప్పేవాణ్ణే... ఆయనే... మన స్నే హితుడేలే...''

పాల్ పేరు విని మీనాక్షి అతని ఎదుటికి రావడానికి సిగ్గుపడింది. మళ్లీ ఏ పుస్తకం రాసితెచ్చేడోనని భయపడింది. వీరయ్యే లేచి వెళ్లి కాఫీ తెచ్చి పాల్‌కిచ్చి తనూ తీసుకున్నా డు.

కాఫీ తాగేసి పాల్ లేచి నిలబడ్డాడు. ''బేంకు మేనేజర్ మీరు కొత్త వ్యాపారం పెట్టబో తున్నారని చెప్పేరు. మీకు మంచి షాపు కావా లంటే మా దుకాణాల పక్కనే మంచి మార్కెట్ సెంటర్లో ఒకటి ఖాళీ అయింది. మీరు కావా లంటే ఇప్పుడే వెళదాం''

వీరయ్య బట్టలు వేసుకుని బజార్లోకి వచ్చే డు పాల్‌తో కలిసి. మునిసిపాల్టీ ఆసుపత్రి పక్కనే వున్న ఖాళీజాగాలో వున్ని బట్టలమ్ము కునే ఒక వ్యాపారి ఒక షాపింగు కాంప్లెక్సు కట్టేడు. వాటిలో ఒక షాపు తనకోసం వుంచు కుని మిగిలినవి అద్దెకిచ్చేడు. మెయిన్‌రోడ్‌లో బజారుకి కూతవేటు దూరంలోవున్న ఆ షాపు

వీరయ్యకి నచ్చింది.

అప్పుడు మధ్యాహ్న సమయమేమో రోడ్లు కొంచెం ఖాళీగా వున్నాయి. రోడ్డు పక్క తురాయి చెట్లు ఎఱ్ఱపూలతో నిండిపోయి చూడ్డానికి హృద్యంగా వుంది. వీధుల్లో తిరిగే ఆవులు చెట్ల నీడల్లో పడుకుని సగం మూసిన కళ్లతో నెమ్మదిగా నెమరు వేస్తున్నాయి. పళ్ల దుకాణాల వాళ్లు అంతగా బేరాలు లేకపోవటంతో కునికిపాట్లు పడుతున్నారు. తమలపాకులు అమ్ముకునే వాడొకడు అటు పక్క ఎవరైనా వస్తుంటే, చేత్తో ఆకుల కట్ట నొకదాన్ని పట్టుకుని వుండుండి, "లేత తమలపాకులండీ, కర్పూరం వాసన తమలపాకులు... రండి కొనండి..." అని అరుస్తున్నాడు.

దుకాణాల వెనగ్గావున్న వాటి యజమాని దగ్గిరకి తీసుకు వెళ్లి పరిచయం చేసేడు పాల్. అతను నల్లగా, లావుగా వున్నాడు. గంధం బొట్టు పెట్టుకున్నాడు. పెద్ద పెద్ద ఈగలు విపరీతంగా ముసురుతుంటే తోలుకుంటూ కూర్చున్నాడు. దుకాణం నిండా గుట్టలుగుట్టలుగా ఉన్ని రగ్గులు పేర్చి వున్నాయి.

"ఈ ఈగలు నన్ను తినేస్తాయి. ఎందుకిలా నన్ను వేధిస్తున్నాయో నాకర్థం కాదు" చేతిలోవున్న పేపరుతో ఈగలు తోలుకుంటూ అన్నాడు.

వాళ్లిద్దరూ బయటే నిలబడాల్సి వచ్చింది.

"ఇతను నా స్నేహితుడు... చాలామంచివాడు. నన్ను కష్టాల్లో ఆదుకునేవాళ్లల్లో ఒకడు" అంటూ వీరయ్యను పరిచయం చేసేడు పాల్.

"మంచిది... నమస్కారం..." రెండు చేతులూ జోడించేడు అతను.

"ఇతనికి మీ షాపు కావాలి. ఒకటి రెండు రోజుల్లో వ్యాపారం ప్రారంభిస్తారు... అంతేనా వీరయ్యగారూ!"

వీరయ్య తన ముక్కు మీద వాలుతూన్న ఈగల్ని తోలుకోవటంలో నిమగ్నమైపోయి వెంటనే ఏం చెప్పలేకపోయేడు.

దుకాణంలో వున్న వ్యక్తి వీరయ్య అవస్థ గమనించి "ఈగల బాధ ఎక్కువగా వుందండీ... ఏమనుకోకండి" అన్నాడు.

"ఎందుకిన్ని ఈగలు చేరుతున్నాయిక్కడ?"

"నా ఖర్మండీ బాబూ... ఖర్మ... ఇవి నా దుకాణంలోవి కావండీ... సరిగ్గా నా షాపు వెనకే బెల్లం గొడవును ఒకటుంది. దానికీ, దీనికీ మధ్య గోడ పైన ఖాళీ వుంది. ఆ ఖాళీలోంచి ఈ ఈగలు వస్తూ పోతూ వుంటాయి. మున్సిపాలిటీకెన్నిసార్లు కంప్లయింటిచ్చానో చెప్పలేను. ఆ గొడవును మార్పించమంటూ... మీకు తెలుసు కదా! మన మునిసిపాలిటీ ఎంత చురుగ్గా పనిచేస్తోందో..."

"పైగా ఈయనే ఈ వార్డు కౌన్సిలర్... చూశారా వీరయ్యా! అయినా పన్లు కావటం లేదంటే ఎంత ఘోరమో, ఈ జాగా కొనడానికీ, ఈ షాపింగ్ కాంప్లెక్సు కట్టడానికీ ఎన్ని బాధలు పడ్డారో, ఆయన్నే అడగండి" పాల్ కల్పించుకుని అన్నాడు.

"అవన్నీ ఎందుకులెండి. కౌన్సిలర్ అయినంత మాత్రాన నేను కట్టుకోకూడదా? నాకుండే పౌరహక్కు నేనెందుకు వదులుకోవాలి. చాలా ఇబ్బందైపోయింది"

ఎఱ్ఱని ఎండలో తాము నిల్చుంటే, నీడలో అతను కూర్చుని మాట్లాడుతుండటంతో, కొంత సేపయేక వీరయ్యకి చిరాకు పుట్టుకొచ్చింది... పాల్‌తో విసుగ్గా అన్నాడు...

"సంగతి తేల్చుకుపోదామా? ఇంక"

పాల్ ఆశ్చర్యపడ్డాడు. కానీ పైకి కనిపించనివ్వకుండా అడిగాడు "అయితే మీ దుకాణం ఈయనకిస్తున్నారుకదా! గురురాజ్‌గారూ!"

"దానికేం మీరు సిఫార్సు చేసేక కాదని ఎలా అంటాను" ఎదురు ప్రశ్న వేసేడు.

పాల్ వీరయ్య వంక చూసేడు "మీరు తీసుకోండి షాపుని"

వీరయ్య వెంటనే అడిగేడు "అద్దెమాట చెప్పండి"

"ఏడొందల యాభై" తడుముకోకుండా చెప్పేడతను.

"ఏడొందల యాభై... ఎక్కువే ననుకుంటాను"

"ఇంకెక్కడేనా అయితే ఎక్కువేనని నేనూ వప్పుకుంటాను. కానీ ఇక్కడ మార్కెట్ వేల్యూ వుంది. మీకింకా చవగ్గా కావాలంటే..."

"ఇంకో దగ్గిర చూసుకోమంటారు" మధ్యలో కల్పించుకుంటూ అన్నాడు వీరయ్య... "సరే

మీరన్నట్టే ఇస్తాను'' రేపట్నుంచీ షాపు తీసుకుంటాను''తన నిర్ణయం ప్రకటించేడు వీరయ్య వెంటనే. అదే పాత రోజుల్లో అయితే ఆ అద్దె మాట విని కిందపడిపోయేవాడే.

పాల్ దుకాణం యజమానితో మళ్లీ చెప్పేడు ''ఈయన గురించి మరేం అనుమానం అక్కర్లేదు. నాకు చాలామంచి స్నేహితుడు... స్వభావం చాలా మంచిది''

''మీరు చెపుతున్నారుగా... నాకు మరి నిశ్చింత. ఇదుగో తీసుకోండి. అంటూ తాళం చెవి ఇచ్చేడు.

''ఇంతకీ మీరే వ్యాపారం చేస్తారు'' కుతూహలంగా అడిగేడు.

''నాది బ్యాంకింగ్ వ్యాపారంలెండి''

''ఓహో... వడ్డీ వ్యాపారం అన్నమాట''

''అదే అనుకోండి.. పూర్తిగా తాకట్టు వ్యాపారం మాత్రం కాదు. ఎవరికెలాటి డబ్బు అవసరమొచ్చినా సర్దుతాను'' తను చెప్పేది అతనికి అనవసరం అనిపించి, ఆగేడు. పాల్ వంక తిరిగి...

''ఆయన పేరు...''

''గురురాజ్...'' చెప్పేడు పాల్.

''చూడండి గురురాజ్‌గారూ! డబ్బు సక్రమంగా వుపయోగించుకోవటం చాలామందికి తెలీదంటే నమ్మండి. అందుకే అన్నీ వుండి దారిద్ర్యం అనుభవిస్తున్నారు. ఉన్నది ఎంతైనా కానివ్వండి. దాన్ని ఎలా పెంచాలి? దాని ఫలాలను ఎప్పుడు తినాలి అన్నది చాలా మందికి తెలీటం లేదు. విత్తనం గింజలను వండుకు తినేసి, వ్యవసాయం చేయటానికి విత్తనాలు లేని రైతుల్లా తయారవుతున్నారు జనం''

''గురురాజ్ నవ్వసాగేడు. వీరయ్య చెప్పింది అతనికి కొత్తగా, వింతగా వుంది.

''నాకు మీలా ఆలోచించేవాళ్లెవరూ ఇంతవరకూ తటస్థపడలేదు. మీరు ఇంతవరకు ఎక్కడచేసేవారు మీ వ్యాపారం?''

''నా వ్యాపారానికి నేను ఇల్లు కదలక్కర్లేదండీ... అయితే ఎందరో వచ్చిపోతుండడంవల్ల నా ఇంట్లోనే నాకు విశ్రాంతి లేకుండాపోయింది. అందుకే ఆఫీసు వేరే తీసుకోవాలనుకున్నాను''

''నిజమే. వ్యాపారానికీ, ఇంటికీ సంబంధం వుంటే అలాటి చిక్కులే వస్తాయి'' తలూపేడు గురురాజ్.

''నాకు పెద్ద చదువులకి పోవాల్సిన కొడుకు వున్నాడు'' కొంచెం గర్వంగా అనిపించింది వీరయ్యకి.

''చదువుకునే పిల్లలు ఇంట్లో వుంటే వాళ్ల చదువులు పాడవుతాయి'' అన్నాడు గురురాజ్ తర్వాత వీరయ్య వ్యాపారం వృద్ధి చెందాలని శుభాకాంక్షలు తెలిపి వాళ్లని విడిచిపెట్టేడు.

అతని దగ్గిర్నుంచి వీరయ్య, పాల్ ఇద్దరూ సెలవు తీసుకుని వీరయ్య తీసుకున్న దుకాణం ముందుకు వచ్చేరు. ఆ పరిసరాలు మరొకసారి పరీక్షగా చూసేడు వీరయ్య. రోడ్డుకు అవతలివైపున్న షాపుల్లో జనం బాగానే వున్నారు. వాటిల్లో క్షవరశాలలు, ఇనుపవస్తువులు అమ్మే దుకాణాలతోపాటు, ఇన్సూరెన్సు కంపెనీలు, వార్తాపత్రికల ఏజన్సీలు, కొన్ని ఆఫీసులు కూడా వున్నాయి.

వీరయ్య తృప్తిచెందేడు. ఆ వచ్చిపోయే జనంలో రోజుకు కనీసం పాతిక, ముప్పై మందైనా తన దుకాణంలోకి వస్తే ధనవంతుల స్థాయినుండి, భాగ్యవంతుల స్థాయికి చేరడానికి తనకెక్కువకాలం పట్టదు. తన మనసులో రూపుదిద్దుకున్న పథకాలు ఆచరణలోకి రావటానికింకెక్కువకాలం పట్టదు.

★ ★ ★

కాలం గడిచిపోతోంది. వీరయ్య అనుకున్నట్టే అతని ఆఫీసులోవచ్చేపోయేజనంతో, తీరిక లేని వ్యాపారం సాగుతోంది.

హైర్‌పర్చేజింగు స్కీములు, రియల్‌ఎస్టేటు బిజినెస్‌తోపాటు వడ్డీ వ్యాపారం కూడా ముమ్మరంగా ధనాన్ని ఆర్జించి పెడుతోంది.

అయితే వీరయ్యని ఒక సమస్య మాత్రం కలవరపరుస్తోంది. అందుకే 'అన్నీ అనుకున్నట్టు సాగవు' అన్నమాట చాలా అర్థవంతమైందిగా తోచింది అతనికి.

డబ్బు గురించి, అతనికి చింత లేనేలేదు. తన ఆఫీసులో కూర్చుండి కష్టమర్లతో మంతనా

లు సాగిస్తున్నంతసేపూ అతనికి మిగతా విషయాలేం గుర్తుకురావు. కానీ ఒక్కడూ వున్నప్పుడు మాత్రం బాలూ విషయం ఏం చెయ్యాలో తోచక మధనపడతాడు. ముగ్గురు ట్యూషన్ మేష్టర్లని పెట్టి ఎంత చదివించినా వాడు పదవతరగతి దాటలేకపోయాడు. వీరయ్యకి తీవ్రమైన ఆశాభంగం కలిగింది. బాలూకు ఎంతో నచ్చచెప్పేడు. బెదిరించేడు. ఫలితం దక్కలేదు. కొట్టబోయి, వాడు తనకన్న నాలు గంగుళాలు పొడవుగా వుండి, చూపుల్లో నిర్లక్ష్యం ప్రదర్శించడంతో ఆ పని మానుకున్నాడు.

''నేను నలుగుర్లో తలెత్తుకు ఎలా తిరగ్గలను? నా గురించీ, నీ గురించి ఊర్లో అంతా ఏమనుకుంటారో ఎప్పుడైనా ఆలోచించేవా?''

''మనమేమైతే ఊర్లో వాళ్లకెందుకు?'' అని నిర్లక్ష్యంగా జవాబు చెప్పేడు వాడు.

''నా ఆశలన్నీ నాశనం చేసేవురా? నా కడుపున చెడబుట్టావు!'' ఆవేదనగా అన్నాడు వీరయ్య.

బాలూకు కోపం వచ్చింది. ''అర్థం లేకుండా మాట్లాడకండి. నాకు చదువు రాకపోతే నేనేం చేసేది... అంతగా అయితే నన్నింట్లోంచి వంపెయ్యండి''

కొడుకు మాటకి వీరయ్య ఖిన్నుడయ్యాడు. లోపం తనదా? వాడిదా? అతనికి అర్థంకాలేదు. వాడి పెంపకంలో ఎక్కడో లోపం వుందన్నది తెలుస్తోంది. కానీ ఎక్కడో అతనికి అర్థంకాలేదు. ఇద్దరి వంకా మార్చి మార్చి చూస్తున్న భార్యవంక తిరిగి కోపంగా అన్నాడు.

''దీనికంతా నువ్వే కారణం. నీ గారాభంవల్లనే వాడు ఎందుకూ పనికిరాకుండా తయారయ్యేడు. మరింక వాడు బాగుపడడు. నువ్వూ, నీ కొడుకూ''

బాలూ అడ్డొస్తూ అన్నాడు. ''అమ్మేం నన్ను పాడుచెయ్యలేదు. తనేకాదు ఎవరూ నన్ను పాడుచెయ్యలేదు. అమ్మనేం అనకు''

వీరయ్యకేం అనడానికీ తోచలేదు.

''ఈ ఇంట్లో ఎవడికేది తోస్తే, అది మాట్లాడెయ్యడమే. చిన్నంతరం పెద్దతరం లేదు. అదే అసలు జబ్బు'' విసురుగా అరిచేడు. మగక్కడ వుండకుండా లోపలికి వెళ్లిపోయేడు. బాలూ బయటకి నడిచేడు.

కొడుకు బయటకి పోతూంటే మీనాక్షి చూస్తూ వూరుకుంది. ఆమెకి తెలుసు. వాడు ఏ రాత్రో తండ్రి నిద్రపోయేక సిగరెట్లకంపు మోసుకుంటూ, ఇంట్లో అడుగుపెడతాడని. అందుకే తలుపు తెరిచేవుంచింది.

ఆ రాత్రి వీరయ్యకి ఒకంతట నిద్రరాలేదు. కొడుకు భవిష్యత్తు గురించి ఆందోళన అతని మనస్సును చీకాకు పరుస్తుండగా, నిద్రాదేవి అతని దగ్గిరకి రాలేకపోయింది. ఉన్నట్టుండి, నిశ్శబ్దంగా వున్న ఆ వాతావరణంలో కిర్రుమంటూ తలుపు తెరుచుకున్న శబ్దంవిని ఉలిక్కిపడి ''ఎవరు? ఎవర్రా అది?'' అని కేకపెట్టేడు.

బాలూ నెమ్మదిగా ''నేనే నాన్నా'' అన్నాడు.

కొడుకు నెమ్మదిగా జవాబివ్వడంతో వీరయ్య మనస్సు తేలికపడింది. అంతలోనే వాడి పరీక్ష పోవటం గుర్తువచ్చింది.

''ఇంతసేపూ బయటే తిరుగుతున్నావా?''

''ఊఁ''

''ఎక్కడెక్కడ తిరుగుతావురా ఈ వేళదాకా...''

ఆ ప్రశ్నకి జవాబు రాలేదు.

వీరయ్యకి కొడుకుమీద కోపం తగ్గిపోయింది. వాడిలో వ్యక్తిత్వం వికాసం చెందడాన్ని అతను గుర్తించి, అదొకరకంగా మంచిదేనన్న అభిప్రాయానికి వచ్చేడు. పరీక్ష ఇవేళ కాకపోతే, ఇంకోసారి పాసవ్వచ్చు.

బాలూపై అనురాగం కలిగింది.

''ఏరా! బాలూ!! తలుపు గడియ తీసేవుందిరా?'' మృదువుగా అడిగేడు.

''ఊఁ!'' చీకట్లో గదిలోంచి వాడి గొంతుక వినిపించింది.

''మీ అమ్మకి నిర్లక్ష్యం బాగా ఎక్కువైపోతోంది, రోజూ ఇలానే తలుపుతీసి వుంచుతోందా?''

ఈ ప్రశ్నకీ సమాధానం నిశ్శబ్దమే అయింది.

మీనాక్షి గాఢ నిద్రలో గురుకుపెడుతోంది. అతనికి ఆ వాతావరణం కొడుకుతో సంభాషణ కొనసాగించి, వాణ్ణి నెమ్మదిగా తనవైపు తిప్పుకోవడానికి అనుకూలంగా అనిపించింది.

''ఎవడైనా దొంగ దూరితే ఏమవుతుంది?''

కొడుకు మళ్లీ మౌనమే వహించేడు. వాడి మనసు తనపట్ల విరక్తితో వుందని అతడికి తెలీలేదు. కొన్ని నిమిషాలు నిశ్శబ్దంగా గడిచిపోగా, వూరుకుని తర్వాత చీకట్లోకి కళ్లు చిట్లించి చూస్తూ అడిగేడు.

''ఏరా? పడుకున్నావా?''

''ఆఁ... పడుకుంటున్నాను'' విసుగ్గా జవాబు వచ్చింది బాలూనుంచి. అప్పటికి కొడుకుతో కొంతసేపు ఏ ఉద్రేకాలూ లేకుండా మాట్లాడినందుకు, మనోక్లేశం తగ్గి వీరయ్యా కూడా నెమ్మదిగా నిద్రలోకి జారిపోయేడు.

మరుసటిదినం బాలూ మరి కనిపించడని తెలిస్తే అతనలా నిద్రపోయేవాడు కాదేమో...

★ ★ ★

సాధారణంగా ప్రతీదాన్ని డబ్బుతో ముడిపెట్టి, అవసరమో అనవసరమో నిర్ణయించుకుంటేగానీ ఒక్కపైసా కూడా ఖర్చు చేయని వీరయ్యకి ఒక బలహీనత మాత్రం గొడుగు విషయంలో వుంది. కొత్తరకం గొడుగేదైనా ఆకర్షణీయంగా కనిపిస్తే వెనుకాడకుండా కొనేస్తాడు. ఈమధ్యే అందమైన లోహపుపిడితో వున్న జర్మనీ గొడుగునొకదాన్ని సంపాయించాడు. చేతిలో ఆ గొడుగు లేకుండా కనిపించడంలేదు. గొడుగునుఎలా భద్రంగా కాపాడుకోవాలో అతనికి బాగా తెలుసు. గొడుకు వేసుకున్నప్పుడు కొందరు చేతిలో వున్న పిడిని గుండ్రంగా తిప్పుతూ, గొడుగును .తిప్పుతూ వుంటారు. వీరయ్యకది నచ్చదు. వర్షంలో తను గొడుగు వేసుకుని వెళుతున్నప్పుడు ఎవరైనా విధిలేక తడుస్తూ వెళ్లిపోతుంటే, చూస్తూ ఊరుకుంటాడే తప్ప ససేమిరా గొడుగులోకి రమ్మనడు. ఎవరైనా గొడుగు ఎరువిమ్మంటే అతనికి విపరీతమైన కోపం వచ్చేస్తుంటుంది.

''రేపు చర్మం కూడా వొలిచి ఇచ్చేయమంటారు. ఛస్తే గొడుగు ఎవరికీ ఎరువివ్వకూడదు'' అని తెలిసినవాళ్ళతో అంటూ వుంటాడు. అంతేకాదు మరో వాదం కూడా చేస్తాడు.

''ఏం? ఎవడైనా ఎవడి పెళ్ళాన్నన్నాఅడగ్గలడా? ఒక్క భార్యతోనే సర్దుకుపోవటంలే... ఏం ప్రతీ వెధవా ఒక పెళ్లాన్ని కట్టుకున్నట్టే ఒక గొడుగు కొనుక్కోలేడేం''

వీరయ్యలో పాతరోజులకీ ఈ రోజులకీ పెద్దగా తేడా ఏంలేదు. ఆఫీసుకి వెళ్లే సమయంలో మార్పులేదు. నడిచే వెళుతుంటాడు. ఇంటికి కూడా లోపలే సున్నం వేయించేడు. మేడగది ఒకటి మాత్రం కట్టించేడు. అట్టహాసంగా ఫర్నిచరూ అదీ కూడా ఏంలేదు. ఒక్క వాలుకుర్చీ మాత్రం సెకండుహాండ్ మార్కెట్లో కొనుక్కున్నాడు. తీరిక దొరికితే దాన్ని పెరట్లో వేసుకుని ఆకాశంవంక చూస్తూ కాలం విశ్రాంతిగా గడుపుతుంటాడు. మీనాక్షికి మాత్రం అనుమతిచ్చేడు కావలసిన బట్టలు, నగలు కొనుక్కోమని. కానీ పుట్టెడు విచారంలో మునిగిపోయివున్న ఆమె అందుకేమాత్రం ఆసక్తి చూపలేదు. ఆమె అడిగేదల్లా ఒక్కటే.

''నాకు బాలూ కావాలి. మీ చీరెసారెలేం వద్దు''

''నేను నీ కివ్వగలిగేదేదైనా అయితే నేను కాదనను మీనాక్షీ. ఆకాశంలో చందమామ కావాలంటే నా వల్లకాదు''

''నేనేం చందమామ కోసం ఏడవటంలేదు. నా కొడుకుని చూసుకోవాలని ఏడుస్తున్నాను. బాలూ... ఒరే బాబూ! ఎక్కడున్నావురా? తండ్రీ...'' ఏడవటం సాగించింది.

ఆమె చాలారోజుల్నించి పిచ్చిపట్టినదాన్లా అయిపోయింది. సరిగ్గా తినడం మానేసింది. మాటలు కూడా తక్కువగా మాట్లాడుతోంది. వీరయ్యకు ఇంటి పరిస్థితి చూస్తే, భార్యమీద తీవ్రమైన కోపం వస్తూంది. ఆమె నిర్లిప్తతనతడు సహించలేకపోతున్నాడు. గృహవాతావరణం కలుషితమైపోడానికి ఆమే కారణం అన్న అభిప్రాయం అతన్లో చాలా బలంగా ఏర్పడిపోయింది.

ఇంటినుండి బాలూ అదృశ్యమైపోయిన నాటినుండి వారిద్దరి జీవితాలూ దుర్భరం అయిపోయాయి. డబ్బుకుప్పలు తెప్పలుగా వచ్చిపడుతున్నా మనశ్శాంతి కరువైపోయింది. ధనంమీద వుండే తృష్ణవల్ల వీరయ్య అంతగా బాధపడటంలేదుగానీ, మీనాక్షికి మాత్రం జీవితంలో స్వారస్యం కరువైంది.

అప్పుడప్పుడూ ఆమెని సంతోషపెడదామని.

''నీకెంత డబ్బు కావాలో... అడుగు మీనా

క్షీ...'' అంటాడు.

''నాకు డబ్బెందుకండీ, నేనేం చేసుకోవాలి?'' నీరసంగా నవ్వుతుందామె.

ఆ సమాధానం వినగానే వీరయ్యా పంటి కింద రాయిపడినట్లు విలవిలలాడిపోతాడు. మరోమాట మాట్లాడకుండా ఆగ్రహంగా ఆమె వంక చూసి అక్కడినుండి వెళ్లిపోతాడు.

అతని మనస్సుకు ఆ పరిస్థితుల్లో ప్రశాంతత కలిగిస్తున్నదొకటే. వ్యాపారం. రోజంతా దాన్లో మునిగితేలి, ఆరోజు వచ్చిన కలెక్షన్ల వివరాలు, ఇతర లావాదేవీల వివరాలు, వేరుగా రాసుకుంటాడు. ఆ పేజీలు తిరగేస్తూ ఈ లోకం మరిచిపోతూవుంటాడు.

కొత్తగా దినపత్రిక తెప్పించుకోటం మొదలుపెట్టేడు. ప్రపంచంలో జరుగుతున్న అన్నిరకాల విషయాలూ, తెలుసుకోవలసిన అవసరం అతనికేర్పడింది. అతని ఆఫీసుకి అన్నిరకాల వ్యక్తులూ, అన్ని తరగతులవాళ్లూ వస్తూంటారు. వాళ్లతో సంభాషణ జరపాలంటే ఈ విషయాలు తెలియటం మంచిదని వీరయ్యా భావించేడు. అన్నిరంగాల్లో నిష్ణాతుడిలా అతను కనిపించినప్పుడు కాతాదార్లు అతన్ని ఎక్కువగా విశ్వసించకలుగుతారు. క్రమంగా సంఘంలో అతని పలుకుపడి పెరుగుతోంది. బాంకులో పేరుకుంటున్న డబ్బు నిల్వలు అతన్ని బాలూ గురించి మరిచిపోయేలా చేస్తున్నాయి.

ఓ రాత్రివేళ ఊరంతా గాఢనిద్రలో మునిగి వున్నపుడు నిద్ర రావటానికి ఆలస్యమైనప్పుడు బాలూ వీరయ్యా ఊహల్లోకొచ్చి పలకరిస్తుంటాడు. ''నాకో చిన్న ఏనుగుకొను నాన్నా'' అన్న వాడి చిన్నప్పటి మాటలు. వాడి అల్లరిపనులు గుర్తుకువస్తాయి. తలదిండు కన్నీళ్లతో తడిసిపోతుంది.

బహుశా వాడు ఆత్మహత్య చేసుకున్నాడేమో. తను వాణ్ణి చదువుకోమని నిర్బంధించి తప్పుపని చేశాడేమో అన్న భావం వణికించి వేస్తుంది.

వాడి గురించి ఏ వార్తా తెలియకుండా కొన్ని నెలలు గడిచిపోయేయి. మీనాక్షి పోలీస్ కంప్లయింట్ ఇమ్మని ఎంతగానో పోరుపెట్టింది.

కానీ వీరయ్యా ఆ పని చేయలేదు. కనీసం పేపర్లో ప్రకటన కూడా ఇవ్వలేదు. ఆ విషయం రహస్యంగానే వుంచాలన్నది అతని అభిమతం. ఒక్క డాక్టర్ పాల్‌కి మాత్రం చెప్పేడు. పాల్ అతనికి హామీ ఇచ్చేడు. తను తప్పక వెతికిస్తాననీ కంగారుపడొద్దనీ చెప్పేడు.

ఎవరైనా వీరయ్యాని బాలూ గురించి అడిగితే సెలవులకు బొంబాయి వెళ్లేడనో, కలకత్తా చూసిరమ్మని పంపించాననో నోటికొచ్చింది చెప్పేవాడు. వాళ్లు తలలూపేవారు.



వీరయ్యా ఆఫీసు వున్న గది మరీ పెద్దదేంకాదు. దాన్లో నాలుగు పరువులు కుట్టించి, కిందపరిచేరు. వాటి కుడివైపు చివర్లో ఒక పాతకాలపు డెస్క్ వుంటుంది. దాని వెనక ఎకౌంటెంటు శాస్త్రి కూర్చుంటాడు. అతడు ఒక బక్కపలచటి వృద్ధుడు. రెవిన్యూ ఆఫీసులో పనిచేసి రిటైరై, పింఛను తీసుకుంటున్నాడు. ఆ డబ్బు చాలక వీరయ్యా దగ్గిర జీతం తక్కువైనాసరే ఉద్యోగానికి కుదురుకున్నాడు. ఆ డెస్క్‌ముందు కూర్చుని తలవంచుకుని లెడ్జర్లలో లెక్కలు రాస్తుంటే అతన్ని చూస్తే వీరయ్యాకి చాలా తృప్తిగా వుంటుంది.

మెత్తటి ఆ బూరుగ దూది పరుపులమీద వెనక్కి బాలీసులమీద చేరబడి కూచుంటాడు వీరయ్యా. అతని ముందు బాగా పాలిష్ చేసిన నల్లటి రోజ్‌వుడ్ డెస్క్ వుంటుంది. కాతాదార్లు తనఖా కోసం తెచ్చిన దస్తావేజులని తన గోల్డ్ ఫ్రేముకళ్లద్దాల్లోంచి పరీక్షిస్తూ, అంచనాలు వేస్తూవుంటాడు. అతడి డెస్క్‌లో తోలుతో బైండుచేసిన పెద్ద లెడ్జరు పుస్తకం

వుంటుంది. కావలసిన మిగతా సరంజామా అంతా నీటుగా సర్దివుంటుంది. దాన్లోనే వసూలైన డబ్బు వుంచేందుకు వీలుగా ఒకగుడ్డ సంచీ వుంటుంది. ఏ రోజైనా మొత్తం ఎంత డబ్బు వసూలైందో, ఒక్క వీరయ్యకే తప్ప అతని గుమాస్తాకెంత మాత్రం తెలిసే వీలులేకుండా జాగ్రత్తపడ్డాడు వీరయ్య. అతనిపని ఎక్కువగా, ఖాతాలు వ్రాయటం, దస్తావేజుల నకళ్లు తయారు చేయటం మాత్రమే. వీరయ్య దగ్గిరున్న లెడ్జరు చూడటంకానీ, డబ్బు లెక్కపెట్టడం కానీ వీలయినంతవరకు అతనికి చెప్పకుండా వుండటానికే ప్రయత్నిస్తాడు వీరయ్య.

టైము రెండు గంటలయ్యింది.

''శాస్త్రీ! నేను భోజనానికి వెళుతున్నాను. ఆఫీసు చూసుకో. ఎవరైనా వస్తే వుండమని చెప్పు'' చెప్పులు తొడుక్కొని బయటకు వచ్చేడు.

తలవాల్చుకుని ఏదో ఆలోచిస్తూ చేతిలో గొడుగు ఊపుకుంటూ అతను వినాయక మొదలియార్ వీధిలో అడుగుపెట్టేటప్పటికి తన ఇంటిముందు ఇరుగు పొరుగు గుమికూడి వుండటం కనిపించింది. గబగబా ఇంటి మెట్లెక్కి అక్కడున్న వాళ్లని ''ఏం జరిగింది?'' అని ప్రశ్నించాడు. లోపల్నుంచి మీనాక్షి పెద్ద గొంతుకతో ఏడుస్తుండటం వినబడుతోంది. ఎవరూ అతని ప్రశ్నకి జవాబు ఇవ్వలేదు. పక్కలకు వత్తిగిల్లి అతను లోపలకి వెళ్ళడానికి మాత్రం తోవ ఇచ్చేరు. చేతిలో గొడుగు వరండాలో, పడేసి చప్పున లోపలకి వెళ్లేసరికి మీనాక్షి భర్తని చూసి గగ్గోలు పెడుతూ.

''ఏమండీ? మన బాలూ... బాలూ'' అంది. ఆమె జుత్తు రేగిపోయివుంది. ఎంతసేపటి నుంచి అలా ఏడుస్తోందోగానీ, కన్నీటిచారికలు బుగ్గలమీద మెరుస్తూ కనిపిస్తున్నాయి. బొట్టు చెరిగిపోయివుంది. వీరయ్య కంగారుపడిపోయేడు. పక్కనే వున్నతన్ని చూసి ''ఏం జరిగిందంటే ఎవరూ మాట్లాడరేం'' అని గద్దించేడు. అతను ఎవరి దగ్గిర్నుంచో ఒక పోస్టుకార్డ్ అందిపుచ్చుకుని వీరయ్య కందించేడు. వణుకుతున్న చేతుల్తో కళ్లద్దాల్ని వెలికితీసి చదవబోతే, ఆత్రుతవలన అక్షరాలు అలుక్కుపోయినట్లు కనిపించేయి.

''అందరూ చదువుకోనివాళ్లు పోగయ్యారేమిటి? కాస్త చదివి వినిపించకూడదా?'' అన్నాడు అసహనంగా తల పైకెత్తి చూసి,

ఒకతను ఆ కార్డు అందుకని చదివేడు.

''మీ అబ్బాయి బాలూ... మరి లేడు''

''మీనాక్షి ఆ మాటలు వినగానే మళ్లీ ఏడుపు పెంచింది.

వీరయ్య వంక చూస్తూ, ''మీరే కారణం'' అంది.

వీరయ్య ఆందోళన పడ్డాడు. తను దాస్తూ వచ్చిన గుట్టు, ఆవేశంలో భార్య బయట పెడుతుందేమో అనిపించింది. తెలిసిన వార్త వల్ల జలపాతంలా ఉబికివస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేనేమో అనిపించసాగింది. స్వరం పూడుకుపోయి మాట వెంటనే రాలేదు. ఒక్కనిమిషం ఏం మాట్లాడలేకపోయేడు.

అందరూ అతనివంకే పరీక్షగా చూస్తున్నారు. ఏం చెబుతాడా అని.

''ఇది ఎలా జరిగిందో... ఏమైనా వుందా దాంట్లో?'' అడిగేడు.

''ఏమో వివరాలేం లేవు'' ఉత్తరం చదివినతడు జవాబిచ్చేడు.

''ఎవరు వ్రాశారో ఆ ఉత్తరం?''

''ఏమో మాకేం తెలుస్తుంది వీరయ్యా! దానిమీద వాడి స్నేహితుడెవరిదో సంతకం వుంది చూడు''

వీరయ్యకేం చెయ్యాలో తోచక కింద కూలబడిపోయి రెండు చేతుల్తో మొహం కప్పుకున్నాడు. అతని అన్న తమ్ముడిపక్కనే చేరి, భుజంమీద చెయ్యివేసి అనునయించేడు.

''ధైర్యంగా వుండు తమ్ముడూ! ఇలాటపుడే ధైర్యం తెచ్చుకోవాలి''

''ఇప్పుడు నేనేం చెయ్యాలి?'' చిన్నపిల్లాడిలా అన్న భుజంమీద తలపెట్టుకుని ఏడవటం మొదలుపెట్టేడు వీరయ్య.

అన్న అతణ్ణి ఓదార్చసాగేడు. ఎప్పుడో బాలూని స్కూల్లో వేసినప్పుడు మాత్రం రెండు కుటుంబాలూ కొంత దగ్గరయ్యేయి. తర్వాత దూరంగానే వుండిపోయాయి. చిత్రంగా మళ్లీ తమమధ్య సయోధ్య ఈ రకంగా ఏర్పడు

తోందేమో అన్న భావం కల్గింది వీరయ్యలో.

చుట్టూ చేరిన వాళ్లంతా రకరకాలుగా మాట్లాడసాగేరు. ఏవో వాళ్ళకి తోచిన సలహాల నిస్తూ వీరయ్య అభిప్రాయం తెలుసుకోవాలని తాపత్రయపడ్డారు. వీరయ్య చేతులు జోడించి తమను కాసేపు వంటరిగా వదలమని ప్రార్థించేడు. అతని అన్నవాళ్లనందర్నీ బయటకు నడిపించేడు. వాళ్లు గొణుక్కుంటూ అవతలకి వెళ్లిపోయేరు.

ఎవరో అన్నమాట వీరయ్యకి వినిపించింది.

''శవాన్నెప్పుడు తెస్తారో...''

వీరయ్యకు ఆరోజువరకు తనకంతమంది శ్రేయోభిలాషులున్నారని తెలీదు.

కొన్ని తర్జన భర్జనలనంతరం వీరయ్య మద్రాసు బయల్దేరక తప్పలేదు. ఆ కార్డు మద్రాస్‌నుంచి వచ్చింది. అన్న కూడా వస్తానన్నాడు కానీ వీరయ్యే అనవసరం ఖర్చని వద్దనేశాడు. అంతమంది మధ్య అతనికి తన బాధ ప్రకటించుకోలేకపోవటంవల్ల ఊపిరాడనట్లయి ఈ ప్రయాణం కాస్త ఉపశమనం కల్గిస్తుందని తలపోసేడు. రెండు జతల బట్టలు మాత్రం బేగ్‌లో పెట్టుకుని మద్రాస్ పోయే ఆరుగంటల బండికి బయల్దేరేడు.

మూడోతరగతి టిక్కెట్టు కొనుక్కున్నాడు. ట్రెయిన్ చాలా రద్దీగా వుంది. కిటికీలోంచి ఎలాగో లోపలకి దూరేసేడు. కానీ, డబ్బుతోపాటు పెరిగిన బొజ్జ బాగా అడ్డమైపోవటంవలన కష్టమైపోయింది. ఎలాగైతేనేం మొత్తంమీద లోపలకు పడి అంతకుముందు కిటికీ పక్కసీట్లో కూర్చున్నతన్ని వెనక్కి నెట్టేసి కొంత జాగా సంపాదించేసేడు. ఆ వ్యక్తి ఒక పల్లెటూరి రైతు. ఈ హఠత్పరిణామానికి అతగాడు నివ్వెరపోయి, తేరుకుని ''లే... లే... ఇది నా సీటు'' అన్నాడు.

''కొంచెం మర్యాదగా మాట్లాడటం నేర్చుకో...'' కళ్లెర్రచేశాడు వీరయ్య.

''నేను ఎంత దూరంనుండి వస్తున్నాను తెలుసా?'' మొదలు పెట్టబోయేడు అతడు.

''అలాగా! పాపం చాలాసేపు కూర్చుని, కూర్చుని అలిసిపోయి వుంటావు. కాసేపు నిలబడితే కాళ్ల తిమ్మిర్లు తగ్గుతాయి. కనక ఆ పని చేయి'' మిగిలినవాళ్లు ఆ వెటకారానికి నవ్వేరు. ఆ వ్యక్తి చిన్నబుచ్చుకున్నాడు. కంపార్టుమెంటంతా పొగాకు వాసనతో దద్దరిల్లిపోతోంది. కాలు కదిపే జాగా కూడా లేకుండా జనం, ఎక్కడ బడితే అక్కడ జనంలో కంపార్ట్‌మెంటంతా మనుషులతో చేసిన ముద్దలా వుంది. అంతలో ఎవరో లావెటరీ తలుపుతీసేరు. వీరయ్య అరిచేడు.

''ముక్కులు పగిలిపోతున్నాయి. ఎవరో ఒకరు ఆ తలుపు ముయ్యండి''

అందరూ అతన్తో ఏకీభవించేరు కానీ ఎవరూ ముందుకుపోయి ఆ తలుపు ముయ్యాలేదు. కదిల్తే మళ్లీ తమ జాగా తమకి దక్కదని అందరికీ అర్థమైపోయింది. రైలు బయల్దేరి ఊగుతూ, జోగుతూ ప్రయాణం సాగించింది. అది ఇంచుమించు ప్రతీ స్టేషన్లో ఆగుతూపోతోంది. స్టేషన్ వచ్చేసరికల్లా దిగాల్సినవాళ్లు బిలబిల్లాడుతూ, కిటికీల్లోంచో, ద్వారం గుండానో కిందకి దూకేస్తుంటే లోనున్నవాళ్లంతా ఏకమై వాళ్ల సామాన్లు చకచక అందించేస్తూ సహాయం చేసేస్తున్నారు. రాత్రి రెండయ్యేసరికల్లా ఆ కంపార్ట్‌మెంట్‌లో సద్దు మణిగింది.

ఎలా వీలయితే, అలా ఎక్కడ వీలయితే అక్కడ, ఏ భంగిమ కుదిరితే ఆ భంగిమలో అంతా కునుకు తీయడంలో పడిపోయరు. తక్కువకాంతితో వెలుగుతున్న కంపార్టుమెంటు, విగ్రహాల్లా దాన్లో నిద్రిస్తున్న మనుషులు.

వీరయ్యకి విచిత్రంగా హనుమాన్ దేవాలంయలో అతను ఒకానొకప్పుడు పొందిన ప్రశాంతత గుర్తుకు వచ్చింది. చేతిసంచీని గుండెలకదిమి పెట్టుకుని నిటారుగా కూర్చుని, నిద్రరాని కళ్లతో పరిసరాలను గమనిస్తూ వుండిపోయాడు. ఇంతలో నశ్యం జ్ఞాపకం వచ్చి, జేబులోంచి డబ్బాతీసి, ఒక చిటికెడు పీల్చేడు. అది చూసి పక్కనే కూర్చున్న పోలీస్ దుస్తులు ధరించిన ఒకాయన తన చెయ్యిచాపేడు. వీరయ్య పొడుండబ్బా అతనికందించేడు. అతను గాఢంగా నశ్యంపీల్చి కృతజ్ఞతలు తెలియచేస్తూ వీరయ్యకతని డబ్బా తిరిగి అందించేడు.

''రోజులేం బాగాలేవు. మీరూ చూస్తున్నారు

కదా!''

''అవునవును'' పోలీస్ దుస్తులు ధరించిన వ్యక్తితో విభేదించడం ఇష్టంలేక వీరయ్యా వెంటనే అంగీకరించేడు.

''రకరకాల నేరాలు. మా డిపార్ట్‌మెంట్‌కు పనిలేని రోజేలేదు. పనిచెయ్యలేక చచ్చిపోతున్నాం అనుకోండి''

''మీ డిపార్ట్‌మెంట్ అలా పనిచేస్తోంది కనకనే మాలాటివాళ్లం గుండెలమీద చేతులుంచుకుని పడుకోగలుగుతున్నాంలెండి'' పొగుడుతూ అన్నాడు వీరయ్యా. తన సొమ్మేం పోయిందని.

''పనంటే.. మరడక్కండి బాబూ... నేను మద్రాస్‌లో పుట్టిపెరిగాను. నా కుటుంబం అంతా అక్కడే. మీరు నమ్ముతారో నమ్మరో నెలలో రెండురోజులు కులాసాగా ఇంటి దగ్గర గడపలేకుండా వున్నాను. ఇలా నేరస్తులకోసం వెతకటంతోనే సరిపోతోంది. ఇంకెవర్నయినా పంపమంటే అధికారులు వినరు. నువ్వు సమర్థుడివి. నువ్వే చేయాలీపని అంటూ ప్రతీసారి నన్నే పంపుతుంటారు'' గర్వంగా గొప్ప చెప్పుకున్నాడు.

కళ్లు పెద్దవి చేసేడు వీరయ్యా. ''మీ ఉద్యోగం చాలా ప్రమాదం సుమండీ''

సుఖంగా సీట్లో సర్దుకుని కూచుని చిరునవ్వు నవ్వుతూ, ''ప్రమాదం మాటకేంలెండి. అది మనం అనుకునేదాన్ని బట్టి, చేసేదాన్ని బట్టి వుంటుంది. ఇన్నాళ్ల నా సర్వీసులోనూ నాకేదైనా ప్రమాదం ఎదురైందంటారా? ఎదురైతే నేనిలా మీముందు కూర్చుని మాట్లాడగలిగేవాణ్ణా?''

''మీరన్నదీ నిజమేలెండి. ఎవరిపని వాళ్లు చేస్తూవుండాలి. భగవద్గీతలోనే వుందికదా! కర్తవ్య నిర్వహణకోసం పాటుపడేవారికి ఆ భగవంతుడే ఎల్లపుడూ సహాయపడతాడు. మనచేతిలో ఏదో వుందనుకుంటాంగాని. నిజంగా ఏమీలేదు'' వేదాంతం వల్లించేడు వీరయ్యా.

అతను ముందుకు వంగి, రహస్యంగా అన్నాడు.

''మీకు తెలుసా! నేనొకసారి మహాత్మా గాంధీని అరెస్టు చేయవల్సివచ్చింది. నేనేం చేసేననుకున్నారు. ముందు ఆ మహాత్ముడికి సాష్టాంగ నమస్కారం చేసేను. తర్వాత విధిలేక ఆయన్ని అరెస్ట్ చేసేను. జీవితం మన మార్గాన్ని నిర్దేశిస్తుంది. మనమేం చెయ్యలేం'' ఆవులిస్తూ నిద్రకళ్లతో అన్నాడు.

అతను బలవంతాన నిద్ర ఆపుకోవటం చూసి అన్నాడు వీరయ్యా.

''మీరు కనీసం రిజర్వేషన్ అయినా చేయించుకోవలసింది''

ఆ మాట చురుక్కుమని తగిలినట్లయింది అతగాడికి.

''నేను కావాలంటే రిజర్వేషనేం ఖర్మండీ, ఫస్ట్‌క్లాస్‌లో ప్రయాణం చేయగలను. నన్నెవరూ అడిగేవారు లేరు. నేనో ఆఫీసర్ని. కానీ ప్రయోజనం ఏమిటి? నేను సుఖంగా నిద్రపోవాలని ప్రయాణం చేయటంలేదే. నేను పట్టుకోవలసినవాళ్లెప్పుడూ ప్రయాణం చేసేదిలాటి కంపార్ట్‌మెంటుల్లోనే...''

కంపార్ట్‌మెంట్‌లో దాదాపు అందరూ నిద్రపోయినట్టున్నారు. మేలుకుని మాట్లాడుకుంటున్నవారు వీళ్ళిద్దరే. వీరయ్యా అతన్తో తన కష్టం చెప్పుకున్నాడు. ఆఖరుగా అన్నాడు,

''నేను మద్రాస్‌లో ఎక్కడికెళ్ళాలో, ఎవర్నడగాలో ఏం తెలీదు!''

''ఆ పోస్ట్‌కార్డ్ మీదగ్గిరే వుందా?'' అడిగేడు ఆఫీసరు.

తన జేబులోంచి ఆ కార్డు తీసిచ్చేడు వీరయ్యా. మసగ్గా వెలుగుతున్న దీపంకాంతిలో కాసేపు దాన్ని పరీక్షించి, ''దీన్ని పార్క్‌టవున్‌లో పోస్ట్ చేసేరు'' అన్నాడతను.

''అదెక్కడుంటుంది?'' అన్న వీరయ్యా ప్రశ్న పట్టించుకోకుండా ''ఈ చేతివ్రాత పరీక్షించాలి'' అన్నాడు. మళ్ళీ అతనే ''మీరు మద్రాస్‌లో ఎన్నాళ్ళుండాలి?'' అని అడిగేడు.

''నాకేం తెలీదు. అందరూ నన్ను వెళ్ళమని బలవంతం చేశారు. ఎక్కడికెళ్ళాలో ఏం చెయ్యాలో నాకే తెలీదు. మద్రాస్ నాకు పూర్తిగా కొత్త ఊరు'' జాలి పుట్టేట్లు అన్నాడు.

అతను ఏదో ఆలోచిస్తున్నట్టున్నాడు, వీరయ్యా మాటలకు తలమాత్రం ఊపేడు.

రైలు ఎగ్మూర్ స్టేషన్ చేరగానే అక్కడి నుండి వీరయ్యా బాధ్యతను తనే తీసుకున్నాడు

ఆ పోలీసాఫీసరు. వీరయ్యని వెయిటింగ్ రూమ్ ఇన్‌ఛార్జికి అప్పగించి అన్నాడు, "ఇక్కడ మీ ఇంట్లో వున్నట్టే వుండండి. హాయిగా విశ్రాంతి తీసుకోండి. మీకేం కావాలన్నా ప్లాట్‌ఫారంమీద రెస్టారెంటు వుంటుంది. పోయి తినండి. నేను మళ్ళీ వస్తాను. ఆ కార్డ్ నాచేతికి వ్వండి"

ఆ సాయంత్రం అతను తనన్నట్టే తిరిగొచ్చాడు. "ఏదీ మీ నశ్యం కాస్త ఇవ్వండి. చాలా బాగుంది" అని పొడుం పీల్చి "నేను మధ్యాహ్నమల్లా తిరిగి మీకా వుత్తరం రాసిందెవరో తెలుసుకున్నాను. దాంట్లో రాసిందంతా అబద్ధం. అది ఒక పిచ్చివాడు రాసిన వుత్తరం. వాడు తనకి దొరికిన ఎడ్రస్‌కల్లా అలాటి ఉత్తరాలు రాసిపడేస్తుంటాడు. నా వుద్దేశం మీ బాలూ చనిపోలేదు. మీరొక్క రెండురోజులు ఓపికపడితే మీవాడెక్కడున్నా మీకు అప్పజెప్తాను. ఏమంటారు?"

వీరయ్యకేం అనటానికీ నోటమాటే రాలేదు. కళ్ళల్లో నీళ్ళతో చేతులు జోడించాడు.

ఆ మూడోనాడు చిరిగిన బట్టలతో, పెరిగిపోయి సంస్కారంలేని జుత్తుతో ఉన్న బాలూతో సహా రైల్లో కూర్చుని ప్లాట్‌ఫారంమీద తమకి వీడ్కోలు చెప్పటానికి నిల్చున్న ఇనస్పెక్టరును చూసి అన్నాడు,

"భగవంతుడెక్కడో లేడు. మీ రూపంలో నాకు ప్రత్యక్షమయ్యాడు. నా కొడుకుని నాకు అప్పజెప్పేరు. మీ రుణం ఎలా తీర్చుకోవాలో నాకు తెలీటంలేదు. ఎప్పుడు ఏ అవసరమొచ్చినా నాకు ఉత్తరం రాయండి. నా ఎడ్రస్ మీకు తెలును"

"మీరలా అనకండి. ఇదే మొదటిసారి నా సర్వీసులో ఒక హంతకుడూ, దొంగా కాని వ్యక్తికోసం వెదకటం. నాకెంతో సంతోషంగా వుంది"

బాలూతో అన్నాడు, "మంచివాడిలా ప్రవర్తించు. మళ్ళీ ఎప్పుడూ ఇలాటి పన్లు చేయకు. రైల్వేపోలీసులతో చెప్పేను. జాగ్రత్త... వాళ్ళు నిన్నే కనిపెట్టుకునుంటారు" బెదిరించేడు. అతను వెళ్ళిపోయేదాకా బాలూ ఏం అనలేదు. తర్వాత అన్నాడు, "రైల్వే పోలీసులా? వాళ్ళేంచేస్తారు? నేనేం దొంగతనం చేయలేదే? పారిపోవాలంటే నన్నెవరాపగలరు?"

వీరయ్యకి కొడుకు సంగతి అర్థమైంది. అతనేం మాట్లాడలేదు. గత రాత్రంతా అతను వాణ్ణి గుచ్చిగుచ్చి అడిగేడు. పరీక్ష పోయిందని తను వాణ్ణి మందలించేక, వాడు మద్రాసెలా చేరాడు, ఎలా బతికేడు? అని. వాడు దేనికీ సరైన సమాధానం ఇవ్వలేదు. వాడికి తండ్రి వెంట మళ్ళీ ఇంటికి పోవటం కష్టంగా వున్నట్టుంది. ఆ మాటే అన్నాడు కూడా, "నేను హాయిగా వున్నాను. నువ్వు నన్ను వదిలేస్తే ఇక్కడే వుండిపోతాను"

"అయితే నీకు మేమంటే ఆపేక్ష ఏంలేదురా? కనీసం మీ అమ్మ మొహం చూడాలని కూడా లేదురా నీకూ...!" వీరయ్య తట్టుకోలేక దీనంగా అడిగాడు.

"నాకెవ్వరినీ చూడాలని లేదు" నిష్కర్షగా అన్నాడు వాడు.

"నీకు లేకపోవచ్చులేరా... నిన్ను మళ్ళీ చూస్తే, నీ స్నేహితులూ, మన బంధువులూ ఎంత పొంగిపోతారో తెలుసా?"

"ఊరా? అదేంవూరు?" ఈసడించేడు వాడు.

"ఇక్కడే వుండిపోవాలనుంది నాకు. రోజూ సినిమాలు చూడొచ్చు. హాయిగా వుంటుంది. మద్రాసుని మించిన ఊరేదుంది?" తమ ఊర్లోని జీవితాన్ని ఊహించుకుంటే చికాకు కలుగుతోంది వాడికి.

"మళ్ళీ నేను పరీక్షలు రాయాలా? నాకా చదువొద్దు?" ఖండితంగా చెప్పేడు.

"నువ్వు పుస్తకాల జోలికే పోకు. నీకు నచ్చినట్టు వుందువుగాని..." వీరయ్య మార్దవం వుట్టిపడేట్టు కొడుకుని అనునయించేడు. చిక్కిపోయిన కొడుకు శరీరాన్ని అతని మాసిపోయిన బట్టల్ని చూసి ఆ తండ్రి హృదయం జాలితో ద్రవించిపోయింది. బాలూను తనవైపు తిప్పుకుని పొదివిపట్టుకుంటూ అన్నాడు,

"కావలసినట్టు తిని, హాయిగా కాలం గడుపుదువుగాని. నీకు కావలసినంత డబ్బు ఖర్చు చేసుకో. నేనేమీ అనను. నువ్వు తప్ప నాకెవరున్నార్రా నాయినా!" కన్నీళ్ళు బుగ్గలమీదుగా కారి వీరయ్య చొక్కా తడిసింది.

★ ★ ★

బాలూ తండ్రి చెప్పినట్టే నూటికి నూరుపాళ్ళూ నడుచుకోవటం మొదలుపెట్టేడు.

మరి కనిపించడనుకున్న బాలూ కళ్ళెదుట కనిపించగానే తల్లి ఆనందానికి మేరలేదు. ఆమె పూర్తిగా కొత్తమనిషిగా మారిపోయింది. ఆమెలో పూర్వపు యవ్వనం మళ్ళీ చిగురించి నట్లనిపించింది చూసేవాళ్ళకి. తన మాతృత్వపు మమకారంతో కొడుకుని పూర్తిగా వివశుడ్ని చేసి కట్టిపడేయాలన్న తాపత్రయంతో ఆమె మరీ అతిగా ప్రవర్తిస్తోంది.

ఇలా మారిపోయిన ఇంటి పరిస్థితి చూసిన బాలూకు తను పారిపోయి మంచిపనే చేశానన్న భావం కలిగింది. వాడికి గర్వంగా వుంది. ఒక రాజకుమారుడిలా చూస్తూ తల్లీ, తండ్రీ వాడు కోరినవన్నీ నోట్లో మాట నోట్లో వుండగానే అమర్చిపెడుతున్నారు. మళ్ళీ ఆ కుటుంబంలో ఉత్సాహానందాలు విరబుయ్యడం మొదలుపెట్టాయి.

అయితే బాలూ రాకవల్ల నష్టం ఎవరికైనా కలిగిందా? అనే ప్రశ్న వస్తే కలిగిందనే చెప్పాలి. వీరయ్యా అన్న కుటుంబం మరోసారి వారికి దూరమైపోవలసి వచ్చింది. వాళ్ళ పొడే వీళ్ళకి కిట్టడం మానేసింది. బాలూను తీసుకుని ఎప్పుడైతే వీరయ్యా తిరిగి తన గడపలో కాలుపెట్టాడో ఆ క్షణంనుంచే అంతవరకూ ఆ కుటుంబానికి ఆసరాగా నిల్చిన అన్న కుటుంబం పక్కకి తప్పుకోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. వీరయ్యా భార్య వాళ్ళను పట్టించుకోవడం మానేసింది. బాలూ సరేసరి. వాడెప్పుడూ తమ రెండు కుటుంబాలూ ఒకటే అనుకోలేదు. వాడికి వాళ్ళమీద ద్వేషాన్ని చిన్నతనంనుండే తల్లీదండ్రీ నూరిపోశారు. ఇంట్లో అడుగుపెట్టేసరికి మధ్యగదిలో వున్న పెదనాన్న కుటుంబాన్ని చూసి వాడికి నోటమాట రాలేదు. అతను వాణ్ణి చూస్తూనే గద్దించాడు.

"ఏరా వెధవా! ఏంపనిరా ఇది? ఇందర్ని బాధపెట్టేందుకారా మీ నాన్న ఏరి, కోరి నిన్ను కన్నాడు?"

ఆ సమయానికి పిల్లలూ, వీరయ్యా వదినా, బాలూచుట్టూ చేరి వాడిని వింతగా చూస్తున్నారు. ఊపిరి సలపనట్లయి వాడు పక్కనున్న కొట్టుగదిలోకి గబగబా నడిచి గట్టిగా తలుపులేసుకున్నాడు. అది తండ్రికి వాడిచ్చిన సంకేతం. మళ్ళీ వాడు ఆ గది తలుపు తీసేసరికి గదిలోకానీ ఇంట్లో ఎక్కడాకానీ తన పెదనాన్న కుటుంబం కనిపించలేదు. వీధి తలుపు గడియ వేసివుంది.

"వాళ్ళందర్నీ పంపించేశాను" వీరయ్యా అభయమిచ్చేడు.

"ఎక్కడికి పోయేరు. మళ్ళీ ఆ మూకంతా వచ్చెయ్యరుకదా!" చిరాగ్గా చూశాడు బాలూ.

"మళ్ళీ అడుగు పెట్టనిస్తానా... అంత సులభం కాదులే" వీరయ్యా మరోసారి భరోసా ఇచ్చాడు కొడుక్కి.

మీనాక్షి ఈనడిస్తూ అంది, "మంచి నిర్వాకం చేశారులెండి. ముదనష్టపు సంత..."

తనూ ఏదోఒకటి మాట్లాడాలని ఆమె అలా అనేసరికి వీరయ్యాకి కొంచెం కష్టమనిపించింది. కానీ ఇన్నాళ్ళకి హుషారుగా వున్న ఆమెని నొప్పించటం ఇష్టంలేక ఏమీ అనలేదు. పైగా అతనికీ తన అన్న కుటుంబంతో, పూర్వంలాగానే దూరంగా వుండాలనిపిస్తోంది. లేకపోతే లేనిపోని బాధ్యతలు, డబ్బు ఖర్చు తగులుకుంటాయేమోనన్న అనుమానం వుందతనికి. అందుకే బాలూ గదిలోకి పోయి తలుపులు మూసుకోగానే సమయం చూసి వీలయినంత మృదువుగా చెప్పేశాడు సంగతి.

మద్రాసులో ఏం జరిగిందో తెలుసుకోవాలని కుతూహలంగా అడిగేడు అతడ్ని అన్న.

"నేను చెప్పలేదురా! మద్రాసు వెళ్ళు... అంతా చక్కబడుతుందని" అంతా తన సలహావల్లనే జరిగిందన్నట్లుగా అతను మాట్లాడటం వీరయ్యాకేమాత్రం నచ్చలేదు.

"నువ్వు చెప్పడానికేంలే... నీకుమాత్రం తెలుసా ఏమిటి?"

వీరయ్యా తిరస్కారధోరణేమాత్రం పట్టించుకోలేదతను.

"అయితే ఎక్కడున్నాడు వీడు? ఇన్నాళ్ళూ ఏంచేశాడటా? ఇంతకీ ఆ కార్డెవరు రాశారు?" గబగబా అడిగేడు.

వీరయ్యాకి వెంటనే జవాబులు చెప్పటం ఇష్టంలేకపోయింది. స్వరం తగ్గించి, "అవన్నీ తర్వాత చెప్తానుగానీ నన్నిప్పుడేం అడక్కు. నీకు పుణ్యం వుంటుంది. వాడుగాని వింటే

మనసు కష్టపడి ఏ అఘాయిత్యమో చేస్తాడు. ముందు వాణ్ణి కాస్త తేరుకోనీ'' అంటూ వీధిగుమ్మందగ్గిరకి నడిచాడు. అన్న తమ్ముడి సూచననర్థంచేసుకున్నాడు. భార్యవంక చూసే సరికి ఆమె అప్పటికే లేచి నించుని పిల్లల్ని దగ్గరికి పిలుస్తోంది. ఆమె మొహం అవమా నంతో కందిపోయింది. బయటకు నడుస్తూ మీనాక్షితో అంటీ ముట్టనట్టుగా అంది,

''వస్తానమ్మా! ఇంటిదగ్గిర చాలా పనివుంది. దేవుడిదయవల్ల మంచే జరిగింది''

వీరయ్యే తలుపు వేసుకోగానే, ఆమె భర్త వంక తిరిగి నిప్పులు కక్కుతూ చూసింది.

''ఈసారి ఈ ఇల్లు అగ్గిలో తగలడిపోయినా సరే. నేనీ గడప తొక్కితే ఒట్టు''

వాళ్ళ ఆఖరివాడికిమాత్రం తల్లిమాటలు నచ్చలేదు. ''అమ్మా! పిన్నివాళ్ళిల్లు చాలా బాగుందికదే. ఎందుకలా అంటావు'' అనడిగా డు.

ఆమె వాడివంక ఉరిమిచూసింది. ఇంతలో ఆమె భర్త ''ఏం జరిగిందే... వాళ్ళుమాత్రం ఏమన్నారు? అంతమాత్రానికే ఎందుకా మాట లు?'' నెమ్మదిగా మందలించేడు.

ఆమె అక్కడ భర్తనేమీ అనలేక, కళ్ళల్లో నీళ్ళు తిరుగుతుండగా, ''చచ్చేలా చాకిరీ చేసి అవమానం భరించమంటే నావల్ల కాదు. మీ కేంపోయింది. ఈ మూర్రోజులూ నేను పడిన బాధ ఆ భగవంతుడికే తెలియాలి. నా ఇంట్లోంచి సరుకులు తీసికెళ్ళి, వండి, వొడ్డించి మేపాను. ముంగిపోతులా కూచుంది గానీ... ఒక్క మాటైనా అందీ... ఏమాత్రం విశ్వాసం అయినా వుందీ వాళ్ళకి?'' అంది. ఆమె గొంతు రుద్ధమైపోయింది.

''చాల్లెద్దూ... ఎందరికి పెట్టేవు. ఆమె ఒక్క ర్తేగా! మిగిలింది మనమే... ఎందుకంత బాధ పడతావు''

ఆసరికి వాళ్ళు ఇంట్లో వున్నారు. అగ్నిప ర్వతం వుడికి, వుడికి వున్నట్టుండి లావా బయటపడినట్టు ఆమెలో కోపం కట్టలు తెంచుకోగా, అతని బుగ్గలు వేళ్ళతో పొడుస్తూ అంది,

''అయితే పోయి అక్కడే పడుండండి. తమ్ముడట... తమ్ముడు. ప్రేమ కారిపోతోంది. సిగ్గులేకపోతే సరి... మొహానికి... ఇలాటి మని షని తెలీక కట్టుకోడం నాదీ ఖర్మ'' విసవిస నడుచుకుంటూ లోపలకి వెళ్ళిపోయింది.

అతడు బుగ్గలు తడుముకుంటూ విచా రంగా అక్కడే నిలబడిపోయాడు.

★ ★ ★

ఆ రాత్రి బాలూ పడుకున్నాక వీరయ్యే మీనాక్షికి సంగతంతా పూసగుచ్చినట్టు చెప్పా డు.

తనకి పోలీసు ఆఫీసరు పరిచయమ వ్వడం, ఆ కార్డు రాసింది పిచ్చివాడని అతను తెలుసుకోవడం. కోటీశ్వరుడైన ఆ పిచ్చివాడు, తన దగ్గిరకి వుద్యోగంకోసం, లేదా యాచన కోసం వచ్చినవాళ్ళ ఎడ్రస్‌లు సేకరించి ఆ ఎడ్రస్‌లన్నిటికీ ఇలా కార్డులు రాయటం ఒక అలవాటుగా చేస్తాడన్న సంగతీ, అతనిదగ్గిరకి బాలూ వచ్చినపుడు వాడి ఎడ్రస్ కూడా తీసు కుని వాడికి తన సినిమా థియేటర్‌లో వుద్యోగ మిచ్చిన సంగతీ, ఆ ఇన్‌స్పెక్టర్ ఎంతో తెలి విగా ఆ విషయం కనుక్కొని బాలూగాడ్ని పట్టుకున్న సంగతీ అతను చెపుతుంటే ఆమె ఒక సస్పెన్స్ కథ వింటున్నదానిలా, శ్వాస తీయటం కూడా మర్చిపోయి వింది. ఎక్కడో వున్న ఆ పోలీస్ ఇన్‌స్పెక్టర్‌కి చేతులు జోడించింది.

ఏ తిరుపతి వెంకన్నయితే తమకి బాలూని ప్రసాదించాడో, ఆయనే తిరిగి ఆ ఇన్‌స్పెక్టర్ రూపంలో వాణ్ణి తమకప్పగించాడని ఆమె అభిప్రాయపడింది. వీరయ్యే కూడా ఆమెతో ఏకీభవించాడు.

బాలూ ఎంతో హాయిగా వున్నాడు. పూర్తి విశ్రాంతితో కాలం గడుపుతున్నాడు. పడక మీంచి లేవడానికి ఏమాత్రం తొందరపడిపోవ టంలేదు. పొద్దున్న తొమ్మిది అవుతుంటే తండ్రి మెల్లగా వాడి మంచందగ్గిరకి వచ్చి మృదువుగా,

''నాయనా బాలూ! లేవకూడదురా! కాఫీ చల్లారిపోతోంది'' అని లేపితే అప్పుడు లేచి నిదానంగా తన పనులు పూర్తిచేసుకుని కడుపు నిండా టిఫిను పట్టించి తృప్తిగా కాఫీ తాగుతా డు. బట్టలు వేసుకుని బయటకు పోయి, మధ్యాహ్నం ఏ ఒంటిగంటకో ఇంటికి వచ్చి భోజనంముందు కూర్చుంటాడు. ఒక్కోరోజు

ఇంకా ఆలస్యంగా కూడా వస్తాడు. అయినా తల్లి వాడికోసం తినకుండా కాచుకు కూర్చుంటుంది. భోజనం అయ్యాక బయటకు వెళ్ళి ఇంటిదగ్గర్లో వున్న కిళ్ళీకొట్లో కిళ్ళీ ఒకటి కట్టించుకుని అక్కడే వున్న బల్లమీద కూర్చుని కాసేపు వచ్చేపోయేవాళ్ళని గమనిస్తూ సిగరెట్టు వెలిగిస్తాడు. సుఖంగా పొగపీల్చడం అయిన తర్వాత ఇంటికొచ్చి హాయిగా పవ్వళిస్తాడు. సాయంత్రం అయిదువరకు హాయిగా నిద్రపోయి, అప్పుడు లేచి, మొహం కడుక్కొని తల నున్నగా దువ్వుకుని, తిని, తాగి బయటకు పోతాడు. మళ్లీ ఏ రాత్రికో పూరంతా మాటుమణిగేక ఇంట్లో అడుగుపెడతాడు. అప్పటికి వీరయ్యా రావటం, కొడుకు ఎటు వెళ్ళాడని మీనాక్షిని పదేపదే అడుగుతుండటం పరిపాటి. రాత్రవుతున్నకొద్దీ అతనిలో కొడుకు రాడేమోనన్న భయం ఎక్కువవుతూ వుంటుంది. ఎప్పుడైతే తలుపు చప్పుడవుతుందో అప్పుడు మనసు కుదుటపడుతుంది.

''బాలూ వచ్చేశాడు'' అని వుత్సాహంగా అని, ''ఏరా! బాబూ? ఎంతవరకు వెళ్ళావు?'' అని వాడికి కోపం రాకూడదని కోరుకుంటూ అడుగుతాడు.

''ఎక్కడికెళతాను? అటూ, ఇటూ తిరిగొస్తాను. ఇంట్లో కూచునేం చెయ్యాలి?'' విసుగ్గా జవాబిస్తాడు వాడు.



ఆరు నెలల కాలం ఇట్టే గడిచిపోయింది. మద్రాస్‌నుండి వచ్చిననాటి బాలూకీ, ఈరోజు బాలూకీ అసలు పోలికేలేదు. తెల్లగా, లావుగా, పొడవుగా, ఉంగరాల జుత్తుతో ఎంతో ఆకర్షణీయమైన రూపంతో వున్నాడు బాలూ ఇప్పుడు. వాణ్ణి చూసి వీరయ్యకో కొత్త ఆలోచన వచ్చింది. వాడికి పెళ్ళి చేస్తే తనకనుగుణంగా తిప్పుకోవచ్చనిపించి తెలిసినవాళ్ళు ఒకరిద్దరితో చూచాయగా అన్నాడు.

''అంతే! వచ్చిన రెస్పాన్స్ చూసి అతడికి కళ్ళు తిరిగేయి. కుప్పలు, తెప్పలుగా ఒకటి రెండు జిల్లాల అవతలనుంచి కూడా సంబంధాలు రావటం మొదలుపెట్టాయి. వాటి స్థాయిని చూసిన తర్వాత వీరయ్యకి ఈ సంఘంలో తాను ఉన్నతస్థాయికి చెందిన వ్యక్తినని సందేహం లేకుండా రుజువైంది.

ఆ సంబంధాలలో తన అంతస్థుకి తగినవనిపించినవాటిని కొన్నిటిని ఎంపికచేశాడు. ఆ విషయంలో అతని ఎకౌంటెంటు శాస్త్రి సమర్థవంతంగా మంచి పాత్ర నిర్వహించాడు. ఆ సంబంధాల విషయమై అతడు వెళ్ళి సేకరించుకువచ్చిన వివరాలు వీరయ్యకు తృప్తినిచ్చేయి. ఇంతకుమునుపైతే వీళ్ళవరి గుమ్మం చాయలకైనా తాను వెళ్ళగలిగేవాడు కాదు. డబ్బు సంగతటుంచితే, వీరయ్యా వాళ్ళ కుటుంబ చరిత్రలో ఒక పాతమచ్చ వుంది. వీరయ్యా ముత్తాత, అతని ముగ్గురన్నదమ్ములూ ఆ రోజుల్లో పూటకి ఠికాణా లేని నిత్య దరిద్రులు. ఆ దరిద్రం బాధపడలేక, చివరికి వాళ్ళు శవవాహకత్వాన్ని వృత్తిగా స్వీకరించారు. గ్రామంలో ఎవరు పోయినా ఈ నలుగురూ ఆ ఇంటిముందు హాజరై అన్ని పనులూ అయ్యి, అస్థికలు నిమజ్జనం అయ్యేదాకా కదిలేవారు కాదు. అందుకే వాళ్ళని 'శ్రాద్ధం గెద్దలు' అని పిలుస్తుండేవారంతా. తర్వాత తరాల్లో ఆ వృత్తిపోయి వ్యవసాయం చేసుకోవటం, ఇతర లౌకిక వ్యాపారాలు మొదలైనా, బంధువర్గంలో వాళ్ళెవరైనా వీళ్ళగురించి విమర్శించేటపుడు ఆ తాతల సంగతి ఎత్తకమానరు. ఆ భయం ముందుగా కొడుకు పెళ్ళి ఆలోచన వచ్చినపుడు కలిగిందిగానీ వచ్చిన సంబంధాలు తన భయం అర్థరహితమైందని తేల్చి చెప్పేశాయి. తను సంపాదించిన ధనం అతన్లో ఆత్మవిశ్వాసాన్ని కలిగించింది. శాస్త్రి దాన్ని అహంగా మార్చడంలో గణనీయమైన పాత్ర వహించేడు.

తన వద్దులు రాసేవని కాసేపవతల పెట్టి ఎవరైనా ఫలానా సంబంధం, ఫలానా దగ్గర

వుందని ఎడ్రస్ చెబితే, ఆ ఎడ్రస్‌కి ఉత్తరం రాసి పడేసేవాడు. అంతగా దూరాభారం కాని సంబంధాలయితే తనే స్వయంగా వెళ్ళి వారి స్థితిగతులను విచారించి వచ్చేవాడు వీరయ్య ప్రతినిధిగా. వీరయ్యని తన ఉత్తరాల్లోగానీ, సంభాషణల్లోకానీ చాలా గొప్పగా వర్ణించి చెప్పేవాడు. కుబేరుణ్ణి కొనగలడనీ, మహదైశ్వర్య సంపన్నుడనీ చెప్పేవాడు. బాలూని గురించైతే చక్కటి ఉపన్యాసమే ఇచ్చేవాడు. అంతటి ధనవంతుడికి ఏకైక వారసుడైనా, సూక్ష్మబుద్ధి కలవాడనీ, అమిత శీలసంపద, వినయ విధేయతలు కలిగినవాడనీ, తండ్రి వ్యాపారంలో మెళకువలు నేర్చుకుంటున్నాడనీ చెప్పేవాడు. బాలూ చదువు వీరయ్యే ఆపుచేయించాడనీ, ఎందుకంటే డిగ్రీలు జీవితంలో ఎప్పుడైనా సంపాదించుకోవచ్చుకానీ, వ్యాపారంలో శిక్షణమాత్రం వాటికంటే ముఖ్యమైందని అతని విశ్వాసం అనీ చెవుతుండేవాడు శాస్త్రి.

పెళ్ళి సంబంధాల వివరాలున్న ఫైలు మరొకసారి తిరగేసి పక్కన పడేశాడు వీరయ్య. అతనికి విసుగ్గా వుంది.

"వీళ్ళకేం పనీ పాటా లేనట్టుంది. వాళ్ళ తాహతుకి తగిన సంబంధం చూసుకోవాలి గానీ, ఊరికే నాపనీ వాళ్లపనీ పాడుచేసుకోవటం దేనికి?" అని శాస్త్రివంక తిరిగి చిరాకుగా అన్నాడు.

అంతలోనే ఏదో జ్ఞాపకం వచ్చి ఫైలు తిరగేసి అందులో వున్న ఒక సంబంధం వివరాలు మరోమారు చదివేడు. కొంచెం ఆలోచిస్తే ఆ సంబంధం తనకి సరిపోవచ్చేమో అనిపించింది.

ఆ అమ్మాయి పేరు బృంద. వయస్సు పదిహేడు. ఫొటోలో అమ్మాయి చాలా అందంగావుంది. ఆమె తండ్రి మెంపి పర్వత సానువుల్లో వున్న ఒక పెద్ద టీ ఎస్టేటు యజమాని. ఆ వివరాలు చదివి వీరయ్యకి ఒక అభిప్రాయం కలిగింది. శాస్త్రిని అర్జెంటుగా పోయి వెనక వీధిలోనే వున్న సిద్ధాంతిని వెంటబెట్టుకు రమ్మన్నాడు. శాస్త్రి అతన్ని తీసుకువచ్చేడు. ఎర్ర పట్టుపంచె కట్టుకుని, మెడలో రుద్రాక్షమాల ధరించి, విబూది రాసుకుని వున్నాడతను. ఒకరిద్దరు క్లయింట్లు వుండటంతో వాళ్ళ వ్యవహారం సంగతి చూస్తున్నాడు వీరయ్య. కాసేపు కూర్చోమని సైగచేశాడతనికి వీరయ్య. ఒకంతట వీరయ్య పని కాకపోవడంతో అతడు ఒకటిరెండుసార్లు అసహనంగా దగ్గి, వీరయ్య దృష్టి మళ్ళించాలని ప్రయత్నించాడు. వీరయ్య చిరాకుపడ్డాడు.

"ఏమండీ పంతులుగారూ! కాసేపు కూర్చోలేరా!" అనేసరికి అతను రిచ్చపడి అలాగే వుండిపోయేడు. మళ్లీ కదలటానికి సాహసం చేయలేకపోయాడు. కాతాదార్లని పంపించి వీరయ్య

"ఇలా రండి" అని పిలిచాడు. ఆసరికి వీరయ్య ప్రవర్తన చూసి అతను వినయంగా వచ్చాడు. వీరయ్య తీరు చూస్తే ఆ సిద్ధాంతికి ఇతడు గ్రహాలని వాటి మానాన్న వాటిని తిరగనిచ్చేలా లేడనిపించింది. వీరయ్య ప్రస్తుత సిద్ధాంతం కూడా అదే. గ్రహాలు జీవితాలను నిర్దేశిస్తాయనుకోవటం వట్టి భ్రమ. కృషే అన్నిటికీ మూలం.

'నా ఇనప్పెట్టెలో వున్న బంగారు బిస్కట్లు, కట్టలకొద్దీ కరెన్సీ, బాంకు చెక్కుబుక్కు, గ్రహాలు పంపుతే వచ్చి చేరలేదు. అదంతా నా శ్రమఫలితం' అని అనుకుని నవ్వుకుంటాడు. అయితే అప్పటికే అతడు బృందని తన కోడలిగా చేసుకోవాలని తీర్మానించుకోవటంవలన కేవలం ఫార్మాలిటీకి సిద్ధాంతిని పిలిపించాడంతే. అంతేగాక అతన్లో ఏదో మూల చిన్న భయం కూడా వుండే వుండాలి. 'కష్టం ఒకటే చాలదు... లక్ష్మీదేవి కృప కూడా వుండాలని'. ఇలాంటి మిశ్రమ సిద్ధాంతాలు జీవితంలో ఎంతటివారికైనా కొన్ని కొన్ని విషయాల్లో వుండక తప్పదు. వీరయ్య అందుకేమీ మినహాయింపు కాదు. అయితే ఇప్పుడు మాత్రం అతడు తన సిద్ధాంతాన్ని తనకనుకూలంగా వాడుకోదలిచేడు. తన పర్సనల్ డెస్కులోంచి కొడుకు జాతకచక్రం తీసి దాన్ని ఫైల్లో వున్న బృంద జాతకాన్ని సిద్ధాంతిముందుంచేడు.

"ఈ రెండు జాతకాలూ కలుస్తాయో లేదో చెప్పండి సిద్ధాంతిగారూ!"

అతగాడు తన కళ్ళద్దాలు సర్దుకుని ఆ రెండు కాగితాలనూ ఒకదానిపక్కనొకటి వెలుతురు పడేలా వుంచి చూడసాగేడు.

అతని మొహంవంకే చూస్తూ, "మీరెంత తీసుకుంటారు?" అనడిగాడు.

''ముందు నన్ను చూడనివ్వండి. తర్వాత ఇవ్వటం మాట ఆలోచిద్దాం'' ఏకాగ్రతతో ఆ జాతకాలు చూస్తూ అన్నాడు.

వీరయ్య విడవకుండా అన్నాడు, ''ఎంతైనా నేను అంతకంటే భారీగా ముట్టచెపుతాను లెండి. జాతకాలు నప్పినట్టయితే, పంచెల చాపూ, ఇతర సంభావనలూ కూడా మీకు దొరుకుతాయి'' ఆశ చూపుతూ తన మనసు లోని మాట సూచించేడు.

కాని ఆ చాదస్తం సిద్ధాంతి ఆ సూచన జారవిడిచేడు. ''నాకో పెన్సిలూ, పేపరూ ఇవ్వండి'' అన్నాడు.

శాస్త్రి ఆ రెండూ అందించేడు.

సిద్ధాంతి కాగితంనిండా కూడికలూ, గుణకారాలూ చేసి దాన్ని నింపేశాడు. మరో కాగితం కూడా అడిగి పుచ్చుకుని, మరికొన్ని లెక్కలు కట్టేడు. వీరయ్యలో ఉత్కంఠ పెరిగింది. ఈసారి గట్టిగా అన్నాడు,

''ఈ సంబంధం చేసుకోవాలనుకుంటున్నాను. ఆ విషయం దృష్టిలో పెట్టుకుని చూడండి. మీరు శుభవార్త చెపితే మీకు మంచి బహుమతి ఇస్తాను''

కానీ ఆ సిద్ధాంతి అదేం పట్టించుకోలేదు. తల అడ్డంగా ఊపేడు.

''ఇది కుదిరే జాతకం ఎంతమాత్రం కాదు. ఎన్నిరకాలుగా చూసినా లాభం వుండేలా లేదు''

''చాదస్తంగా మాట్లాడకండి'' వీరయ్యలో కోపం ప్రవేశించింది.

''నేనేం చేసేది. మీ అబ్బాయి జాతకంలో ఏడో ఇంట, తొమ్మిదో ఇంట శుభగ్రహాలు లేవు. ఈ అమ్మాయి జాతకానికీ, మీవాడి జాతకానికి ఏమాత్రం నప్పటంలేదు''

''నాకసలీ జాతకాలంటే నమ్మకంలేదు'' వీరయ్య తన బల్లమీద చరుస్తూ అన్నాడు.

''అటువంటప్పుడు నన్ను పిలవటం దేనికి?'' తెల్లబోతూ అడిగేడతను.

వీరయ్య సంబాళించుకున్నాడు. అతనితో వాదించడం అనవసరం అని తేల్చుకున్నాడు. ''అయితే మీరు చేసేదేం లేదంటారు. అంతేనా?''

''ముమ్మాటికీ... అంతే... జాతకాలు మార్చటానికి నేనేం బ్రహ్మదేవుణ్ణి కాను'' అతను నిక్కచ్చిగా అనేశాడు.

అతన్తో మరి మాట్లాడకుండా తల తిప్పి ''శాస్త్రీ!'' అని పిలిచేడు.

''చిత్తం!''

''అతనికో అయిదు రూపాయిలిచ్చి పంపెయ్యి''

''అలాగేనండీ!'' అంటూ శాస్త్రి చిల్లర లెక్క పెట్టసాగేడు.

సిద్ధాంతి కోపంగా అన్నాడు, ''అయిదు రూపాయలా? కష్టపడి రెండు జాతకాలూ గణిస్తే... నేనేం రోడ్డుమీద జాతకాలు చూసేవాణ్ణనుకున్నారా? నా ఫీజెంతో తెలుసా?''

''అది నాకనవసరం. నువ్వు చేసిన పనికి అయిదు రూపాయలకంటే నేనిచ్చేది లేదు. అదీ మర్యాదగా ప్రవర్తిస్తేనే... లేకపోతే అదీ దక్కదు. జాగ్రత్త...'' అంటూ అతనిదగ్గర వున్న రెండు జాతక చక్రాలూ, లెక్కలు వేసిన కాగితాలూ లాక్కున్నాడు వీరయ్య.

ఆ సిద్ధాంతి మరేమనలేక గొణుక్కుంటూ శాస్త్రిదగ్గర్నుంచి విసురుగా డబ్బులు లాక్కుని వెళ్ళిపోయాడు.

అయితే డాక్టర్ పాల్ వీరయ్యకి ఈ విషయంలో మరోసారి ఎనలేని సహాయం చేసేడు. మరోమంచి సిద్ధాంతిని అతడే వెతికి పట్టుకున్నాడు. బాలూ జాతకంలోని గ్రహాలను అనుకూలంగా మార్పు చేయించేడు. చాలాసార్లు అదేపనిమీద తిరిగి చివరికి ఒకరోజు పసుపు రాసిన లగ్న పత్రిక తీసుకొచ్చి వీరయ్యకిచ్చేడు. ఒకదానికొకటి పూర్తి అనుకూలంగా అతికిపోయిన ఆ రెండు జాతకచక్రాలనూ, లగ్న పత్రికను చూసేక, వీరయ్యను ఆ సిద్ధాంతి ఫీజుకింద పాల్కిచ్చిన మూడువందల రూపాయల ఖర్చు ఎంత మాత్రం బాధ కలిగించలేదు.

తర్వాత పనులన్నీ చకచకా జరిగిపోయేయి. పాల్ కనుక ఒకసారి కార్యభారాన్ని తల కెత్తుకుంటే, పనయ్యేవరకు విశ్రమించడు. శాస్త్రి అతనికి తోడయ్యేడు. ఇద్దరూ కలిసి రాయబారం నడిపి, పెళ్లి వ్యవహారాలన్నీ పర్యవేక్షించి, జయప్రదంగా బాలూ వివాహం

బృందతో జరిపించేరు. మెళ్లో టైతో పూర్తి సూటులో, పక్కనే బుట్టబొమ్మలా నిల్చున్న భార్యతో సహా బాలూ ఫొటో అన్ని పేపర్లలో వచ్చేలా చేయడం మర్చిపోలేదు పాల్. సంవత్సరం తిరిగేలోగా ఒక కొడుకుని కని వీరయ్యను తాతయ్య చేసేడు బాలూ.

★ ★ ★

మానసికంగా నూతనోత్తేజంతో వున్న వీరయ్య దృష్టి మళ్లీ మరోసారి ధనంవైపు మళ్లింది. అప్పటికే అతడు చాలా సంపాదించేడు. అయితే ఎంత తాగినా సముద్రం నీళ్లతో దాహం తీరనట్లు అతనిలో డబ్బు వ్యామోహం బాగా అధికమైంది. ఒకానొకప్పుడు అతను కలలో కూడా వూహించలేని జీవితాన్ని ప్రస్తుతం అనుభవిస్తున్నాడు. అయితే అతనికి తృప్తి లేదు. తననందరూ ఇంకా గౌరవించాలి. తన చుట్టూ ఒక ప్రత్యేక ప్రపంచం ఏర్పడాలి. డబ్బు సంపాదనలో కొత్తదారులు తెరవాలి. ఈ ఆలోచనల్తో అనేక పథకాల కోసం అన్వేషిస్తున్న అతనికి ఒక కొత్త పథకం గోచరించింది. దాన్ని అమల్లో పెట్టడం కోసం ఒక రోజు అతను పాల్ టూరిస్ట్ హోం ఆఫీసులోకి అడుగుపెట్టేడు.

"ఏం డాక్టర్? ఎలావుంది నీ వ్యాపారం?" కుర్చీలో కూర్చుంటూ చుట్టూ చూసి అడిగేడు.

"ఫర్వాలేదు వీరయ్యా! ఏదో గడిచిపోతోంది" వీరయ్యకి మాత్రం ఆ మాట నిజమనిపించలేదు, అక్కడి వాతావరణం చూస్తూంటే...

"లేదు డాక్టర్! నువ్వింకా ఎక్కువ సంపాదించాలి"

"ఎందుకు?" కనుబొమలు చిట్లించి అడిగేడు పాల్.

"ఎందుకేమిటి? సుఖంగా బతకడానికి... నాకో ఆలోచన వచ్చింది. చేస్తానంటే చెపుతాను" ఉపోద్ఘాతంగా అన్నాడు.

"నాకున్నది చాలు వీరయ్యా! నీకు తెలుసు. నాకు డబ్బే ముఖ్యం కాదని..."

"అది నిజంకాదని మనిద్దరికీ తెలును పాల్! ఒకే దగ్గిర పక్కపక్కనే వ్యాపారం చేస్తున్న ఇద్దరికీ ఎవరూ చెప్పక్కర్లేకుండానే విషయాలన్నీ తెలుస్తాయి. రోజూ నీ దగ్గరికి సలహాల కోసం టూరిస్టులెంతమంది వస్తున్నారో, రావటం లేదో నాకు బాగా తెలుసు"

పాల్ దిగి వచ్చేడు. "నేనేం చేస్తాను వీరయ్యా! అదృష్టం బాగాలేదు అంతే... నేను జీవితంలో ఒక దానినుండి మరొక దానికి మారిపోతూ వచ్చేను. నా దురదృష్టం వలన ఏదీ కలిసిరావటంలేదు. నీకు తెలుసుకదా! నేనో క్వాలిఫైడ్ సోషియాలజిస్ట్‌ని... కానీ ఏదీ... నాకే గుర్తింపూ రాలేదే..."

"అవన్నీ ఎందుకులే పాల్!" ఆ సంభాషణ తుంచేస్తూ అన్నాడు.

"నువ్వు నాకు చేసిన దానికి బదులుగా నీకో ఉపకారం చేద్దామనుకుంటున్నాను"

"దేనికి?" ఆశ్చర్యపోయేడతను వీరయ్య ధోరణికి.

"దేనికంటే దేనికేమిటి? మనిద్దరం మంచి స్నేహితులం. చాలా కాలంగా ఒకరికొకరు తెలిసున్న వాళ్లం. కనుక నువ్వు కూడా కాస్త డబ్బు చేసుకుని సుఖంగా వుంటే నేను సంతోషిస్తాను కనుక"

పాల్ నిరాసక్తతని గమనించి పొడిగించేడు వీరయ్య.

"నిజం చెబుతున్నాను పాల్. నీకు డబ్బు బాగా కావాలంటే నా మాట విను. ఇదే బయట ఎవరితోనైనా అన్నానంటే డజను మందికి పైగా నేను నేనంటూ పరుగెత్తుకు వస్తారు. నీవల్ల ఉపకారాలు పొందివాణ్ణి కనుక ముందు అవకాశం నీకివ్వాలనిపించి ఇంతగా చెపుతున్నాను" కాస్త బాధ ధ్వనించేలా మాట్లాడేడు వీరయ్య.

అయితే వీరయ్య పాల్‌కి అంతగా చెప్పటానికింకో కారణం లేకపోలేదు. అదతను బయటకి చెప్పలేనిది. లాల్‌జీ రోడ్డులో తన కొడుకూ, కోడలూ కాపురముంటున్న ఆధునాతనమైన బంగళాకు పాల్ రాకపోకలు చాలా హెచ్చుగా వుండటం అతను గమనించేడు. అది అతడికి ఎంతమాత్రం ఇష్టంలేదు. అసలు మీనాక్షి కూడా మొదట్లో కొడుకు, కోడలు వేరే కాపురం పెట్టడానికి ససేమిరా వప్పుకోలేదు. కానీ వీరయ్య ఆమె మాట వినలేదు. కొత్తగా కొన్న ఆ ఇంట్లో వాళ్లిద్దర్నీ వేరే వుండమని బల

వంతంగా పంపించేసేడు.

"చూడూ... నీకు తెలీదు. బృంద చాలా పెద్ద కుటుంబం నుంచి వచ్చిన పిల్ల. ఆమెకి ఈ ఇంట్లో సౌకర్యంగా వుంటుందనుకుంటు న్నావా?"

ఆ మాటకి ఆమె కొంచెం ఆలోచనలో పడింది. "మీ మాట కూడా కొంచెం నిజంలాగే కనబడుతోంది. బాలూ కూడా అమధ్య మేడ గది వాళ్లకి సరిపోవటం లేదన్నాడు. కోడలు పిల్ల ఒక్కర్తికే వాళ్లింట్లో అచ్చంగానాలుగు గదులున్నాయట"

"నేను పది పన్నెండుసార్లు పిలిచినా అన లామ్మాయి గది విడిచి బైటకి రాదండీ! బాలూ కూడా తరచుగా కిందకి రావటం మానేశాడు. నాతో కూడా మునుపట్లా మాట్లాడటం లేదు. ఆ అమ్మాయికి నేనంటే కిట్టడం లేదేమో" విచా రంగా అంది.

"అదిగో... నీలో అప్పుడే అత్త లక్షణం ప్రవేశించింది. నిజానికి ఆ అమ్మాయిని చూ స్తుంటే నాకు లక్ష్మీదేవిని చూసినట్లే వుంటుంది మీనాక్షీ!! వాళ్లిద్దరూ చిలకాగోరింకల్లా వుంటే మనకింకేం కావాలి చెప్పు... వాళ్లు సుఖంగా వుండటానికి వీలుగా లాల్‌జీ కాలనీలో బంగళా ఒకటి కొన్నాను. వాళ్లకక్కడ అన్ని ఏర్పాట్లు చేసేను. మంచి రోజు చూసి వాళ్లన క్కడికి మార్చేస్తాను" తృప్తిగా అన్నాడు వీర య్య.

"అంత దూరమా?" నొచ్చుకుంటూ అంది కొడుకూ, కోడలూ కంటిముందు లేకుండా దూరం వెళ్లిపోతారని తెలిసి, ఆమెకి విచారం కలిగింది. కానీ ఒక నిర్ణయానికి వచ్చేశాక వీరయ్య మరెవరిమాటా వినడని కూడా ఆమెకి తెలును.

"అదేం దూరం...? రిక్షాలో వెళితే ఇరవై నిముషాలు"

"నువ్వేం అవునూ... కాదూ... అనకు" భార్య మొహంలోకి చూసి ఏదో గ్రహించిన వాడిలా అన్నాడు.

"వాడికీ ఇరవై రెండేళ్లు వచ్చేయి. బతు కంటే ఏమిటో తెలుసుకోవాలా? వద్దా? ఆ అమ్మాయికీ ఇల్లు దిద్దుకోవటం తెలియాలంటే ఇదొకటే మార్గం. అర్థం చేసుకో"

మీనాక్షి బాధపడింది.

"పొయ్యి వెలిగించటమేరాదు ఆ అమ్మా యికి. నేనుండగా వాళ్లు ఇబ్బంది పడటం నేను చూడలేను"

"వాళ్లన్నీ నేర్చుకోగలరు" ఒక్క మాటలో కొట్టిపారేసేడు. "అంతగా అవసరమైతే వంట మనిషిని పెట్టుకుంటారు. నేనవన్నీ ఆలో చించే నిర్ణయించేను. మరి నా నిర్ణయం మారదు"

బాలూ తన బట్టలు లెదర్ కేసుల్లో సర్దు కుని భార్యతో సహా కొత్త ఇంటికి తరలి వెళ్లు తుంటే మీనాక్షి దుఃఖం పట్టలేకపోయింది. బృంద అత్తగారికి వెళ్లేముందు పాదాభి వందనం చేసింది. శీఘ్రంగా సంతానవతిక మ్మని పూడుకుపోయిన గొంతుకతో దీవించిందామె. బాలూ మాత్రం తల్లితో అంటీ ముట్టనట్టుగా 'నేను వెళుతున్నాను' అని మాత్రం చెప్పి కదిలేడు.

వీరయ్య ఆరోజంతా తనకి తీరదని చెప్పి ముందే కావలసిన ఏర్పాట్లు చేసి మనుమలని నియమించి వెళ్లిపోయేడు.

బాలూ, బృంద కలిసి కార్లో కొత్త ఇంటికి తరలిపోతుంటే వీరయ్య అన్న కుటుంబం యావన్మందీ, వాళ్ల గుమ్మంలో నిలబడి ఆశ్చ ర్యంగా చూసేరు.

కొడుకూ, కోడలూ ఇంట్లో లేకపోవటం మీనా క్షిలో నైరాశ్య హేతువ అయ్యింది. ఆమెలో మునుపటి దిగులు, నిర్లిప్తత మళ్లీ ప్రవే శించాయి. అయితే వీరయ్య తన్ని కుబేరుణ్ణి చేయబోయే కొత్త ఆర్థిక పథకాల అంచనాల్లో నిండా మునిగిపోయి ఆమె సంగతి పట్టించుకో లేదు.

బాలూ కొత్త ఇంటికి డాక్టర్ పాల్ చాలా తరచుగా వచ్చి వెళుతున్నాడని వీరయ్య కొంచెం ఆలస్యంగానే గ్రహించేడని చెప్పక తప్పదు. సాయంత్రం వేళల్లో తన ఆఫీసు కట్టేసిన తర్వాత అతనేరోజూ బాలూ ఇంటికి వెళ్లినా, హాల్లో సోఫాలో చేర్లబడి, కులాసాగా వాళ్లతో కబుర్లాడుతున్న పాల్ కనిపించేవాడు. ఒక్కొక్కపుడు వాళ్లు ముగ్గురూ పేకాడుతూ కనిపించేవారు. కొడుకు దగ్గిర్నుంచి పాల్ డబ్బు తీసుకుని వాడుకుంటున్నాడన్న అను

మానం కూడా కలిగింది వీరయ్యకి.

సెక్స్‌పట్ల విపరీత సిద్ధాంతాలూ, విచిత్ర ధోరణులూ కలిగివున్న పాల్‌వంటి వ్యక్తి అలాటి నవదంపతుల మధ్య మెసులుతూ వుండటం వీరయ్యకి భయం కలిగించింది. బాలూలాంటి యువకులను ఇట్టే తన వశం చేసుకుని పాల్ వాళ్లని నైతికంగా నాశనం చేస్తాడేమోనన్న అనుమానం అతన్ని కలవరప రచింది. ఎలాగైనా సరే పాల్‌ని తన కొత్త వ్యాపారంలో చేర్చుకుని అతణ్ణి ఎంత మాత్రం తీరిక లేకుండా ఎంగేజ్ చేస్తే, అతను బాలూ దరిదాపులకి వెళ్లకుండా చెయ్యొచ్చని, అభిప్రా యపడ్డాడు వీరయ్య.

గతంలోకి మళ్లిన తన ఆలోచనల్ని కూడదీ సుకుంటూ అన్నాడు వీరయ్య పాల్‌తో...

"పాల్! నువ్వు నాతో చెయ్యి కలుపు. నెలకు నాలుగైదు వేలు తగ్గకుండా నీకు ఆదాయం వుండేలా చేస్తాను. కొంతకాలం తర్వాత, నీకు ఇష్టం లేకపోతే మానేసి, వేరే నీకు నచ్చిన వ్యాపారం చేసుకోవచ్చు. నీకిష్టమైతే వివరాలు మాట్లాడుకుందాం!!"

"తప్పకుండా వీరయ్యా! నువ్వింతలా చెపు తుంటే కాదంటానికి నేను మూర్ఖుణ్ణి కా దుగా!!" ఆసక్తిగా అన్నాడతను.

వీరయ్య తన ఊహలను ఒకటొకటిగా అత నికి చెప్పేడు. "ప్రజల్లో ఈ రోజుల్లో డబ్బు సంపాదన ఎక్కువైంది. ఊహించలేని మార్గా ల్లో, ఊహించలేనంత డబ్బు ఎంతమందో సంపాదిస్తున్నారు. ఇది వాస్తవం. తిండికి లేక ఎవరూ చావటం లేదు. అయితే సంపాదిస్తున్న ప్రతీవాడూ, అవసరాలకు మించిన డబ్బు దాచుకోవాలని, ఇంకా ఎక్కువ చేయాలని తాప త్రయపడతాడు. ఆ తాపత్రయాన్నే మనం ఉపయోగించుకోవాలి. అందుకు ఒక జర్న లిస్ట్‌గా, ఒక విద్యాధికుడిగా నీకున్న పరిచయా లను నువ్వు వుపయోగించాలి. వాళ్ల డబ్బు వీరయ్య దగ్గర డిపాజిట్ చేస్తే భద్రంగా వుండ టమేగాక ఆకర్షణీయమైన వడ్డీతో అధిక ధనం స్వల్పకాలంలోనే సంపాదించుకోవచ్చని నువ్వు నచ్చచెప్పగలితే చాలు. వాళ్ళు చేసే డిపాజిట్ల మీద మీకు చక్కటి కమీషన్ నువ్వు వూహించ లేనంత ఇస్తాను నేను. ఆ డబ్బుతో అద్భుతాలు చేయిస్తాను. ఏమంటావు?"

కొంచెం ఆలోచించేడు పాల్.

"అలాగే వీరయ్యా! నేను నా శక్తివంచన లేకుండా పని చేస్తాను. నిజానికి నా అప్పులు తీరాలంటే నాకూ మరో మార్గంలేదు"

"నాకూ తనఖాలు పట్టడం, చిన్నచిన్న వాళ్లతోసహా రోజన్తమానం వడ్డీ వ్యాపారం చేయ డంతో విసుగెత్తిపోయింది పాల్! వ్యాపారంలో మార్పు కావాలనిపిస్తోంది. అయితే అలాగని రైతులను, నా పాత కాతాదార్లను పూర్తిగా విడిచిపెట్టను. వాళ్లను ఆదుకోడం నాకదో తృ ప్తి" లేచాడు వీరయ్య.

★ ★ ★

వీరయ్య తన వ్యాపారానికి ఏజెంట్‌గా పాల్‌ని ఎంచుకోడంలో ఏం పొరపాటు చేయలే దు. పాల్ ప్రతీరోజూ ఎంతోమంది వ్యాపారస్తు లు, ధనవంతుల దగ్గిరకి వెళ్లి వీరయ్య చెప్ప మన్నట్టు చెప్పేవాడు. రకరకాల బ్లాకు మార్కె ట్లు చేసేవాళ్లు, పైన ఒక వ్యాపారం చేస్తున్నట్టు కనిపిస్తూ, చాటుమాటుగా చట్ట విరుద్ధ వ్యాపా రాలు చేసేవాళ్లు. ఆస్తులు విపరీతంగా పెంచు కున్న పెద్దపెద్ద సేట్లూ, కంట్రాక్టు వ్యాపారాల్లో ఆదాయపు పన్నువాళ్లకి తప్పుడు లెక్కలు చూపెట్టి మిగిలిన నల్లడబ్బుని ఏం చేయాలో తెలీక బాధపడుతున్న కంట్రాక్టర్లూ, అలాటివా ళ్లంతా పాల్ మాటలవల్ల ఆకర్షించబడ్డారు. వాళ్లు వీరయ్య దగ్గర తమ డబ్బు డిపాజిట్ చేస్తున్నారని తెలిసి, మధ్యతరగతి వాళ్లు కూడా ఎంతోమంది తాము పొదుపు చేసి కూడబెట్టిన ధనాన్ని వీరయ్య దగ్గిర దాచు కుంటే భద్రతతోపాటు మంచి ఆదాయం లభి స్తుందని విశ్వసించి తండోపతండాలుగా వీర య్య ఆఫీసుకురాసాగేరు.

ప్రజలందరి దగ్గిరా చెల్లాచెదురుగా వున్న డబ్బు అంతా తన దగ్గిర చేరాలన్న తపన వీరయ్యలో అధికమైంది. వర్షపు నీరంతా కాలు వలుగా, కాలువలన్నీనదులుగా మారి నదుల న్నీ సముద్రంలో కలిసిపోయినట్లుగా ధనం వేరువేరు మార్గాల ద్వారా ప్రయాణించి తన దగ్గిర చేరాలనీ, అదే తన ఆశయపరమావధి అనీ అతడు నమ్మేడు. అప్పటికే బాగా ధన వంతుడైన అతను, అపరిమిత భాగ్యశాలిగా గుర్తింపబడాలన్న తీవ్రమైన కోరిక, దుర్వా

హంలా పట్టి పీడించసాగింది. తను సంపాదించిన ధనం అతడికేమాత్రం తృప్తి నివ్వడంలేదు.

వీరయ్య దగ్గిరకి పాల్ తీసుకొచ్చిన మొట్టమొదటి మనిషి గురురాజ్. అతని దుకాణంలో పాల్ చాలాసేపు ఈగల్ని తోలుకుంటూ ఆ మాటా ఈ మాటా మాట్లాడి వీరయ్య తనతో



అన్న పథకం గురించి కొంత చెప్పేడు. ముందు ముభావంగా విన్న అతను తర్వాత, వీరయ్య ఇవ్వజూపిన వడ్డీ రేటు విని కొంత ఆలోచనలోపడ్డాడు. చివరికి వీరయ్యతో మాట్లాడేక ఆలోచిస్తానన్నాడు. దానికి పాల్ అంగీకరించలేదు.

"నేను ముందు మీ సంగతి వీరయ్యతో మాట్లాడతాను. అతను మీలాటి వాళ్ల దగ్గిర్నుంచి డబ్బు తీసుకోవటానికి బహుశా అంగీకరించకపోవచ్చు. నేను వెళ్లిమురోదు మీ గురించి చెప్పేక, అప్పుడు కాదనలేడు. ఏ సంగతీ రేపు మీకు చెపుతాను. అంతవరకు ఆగండి''

ఆ మర్నాడు మళ్లీ అతను గురురాజ్ దగ్గిరకి వచ్చి అతణ్ణి వీరయ్య దగ్గిరకి తీసుకు వెళ్లేడు. వీరయ్య ఓసారి అతన్ని పలకరించి కూర్చోమని చెప్పి, తన పనిలో మునిగిపోయినట్టు నటించేడు.



పాల్ వీరయ్యని పిలిచేడు. "మన స్నేహితుడు గురురాజ్ మీతో కొంత పని వుండి వచ్చేడు వీరయ్యా! అతని దగ్గర కొంత డబ్బుంది. నువ్వు ఏదైనా సలహా ఇస్తే ఆ ప్రకారం చేయాలనుకుంటున్నాడు"

తను చూస్తున్న కాగితాల్లోంచి తలపైకెత్తి అన్నాడు వీరయ్య...

"ఆయనే పెద్ద వ్యాపారస్థుడు కదా పాల్!! ఆయనకు నేనేం సలహా ఇవ్వగలను. నా సలహా ఆయనకేం నచ్చుతుంది"

గురురాజ్ కల్పించుకున్నాడు. "అలాకాదు వీరయ్యగారూ! ఎంతైనా వ్యాపారంలో మీ తర్వాతే మేమెవరైనా. మీరే సలహా చెప్పినా, లాభమే తప్ప, నష్టం వుండదని నా నమ్మకం"

వీరయ్య కాస్తంత ఆలోచించినట్టు నటించి పాల్ వంక ఇబ్బందిగా చూసేడు. పాల్ అది గ్రహించి ఏదో పనున్నట్టు పక్కకి తప్పుకున్నాడు.

గురురాజ్‌ని దగ్గరకు రమ్మని పిలిచేడు వీరయ్య. "మీరు నా దగ్గిర మీ డబ్బు డిపాజిట్ చేస్తారా? అలా అయితే మీ డబ్బు మీద ఠర్టీపర్సెంటు వడ్డీ ఇస్తాను. నెలనెలా ఖచ్చితంగా తీసుకోవచ్చు.

గురురాజ్ నిర్ఘాంతపోయేడు. "థర్టీపెర్సంటా? బేంకుల్లో పదమూడు శాతంకన్నా ఇవ్వరే"

"నాది ఆ బేంకు వ్యాపారం కాదు. నా పద్ధతి వేరే"

"ఎలా ఇవ్వగలుగుతారు వీరయ్యా?"

"అది నా రహస్యం. నాకు అంతకంటే ఎక్కువ వచ్చే వ్యాపారం వుంది కనుక ఇవ్వగలుగుతాను. నా పెట్టుబడుల మీద నాకు ముప్పై ఆరు శాతం వడ్డీ వస్తుంది. నాకు పై ఆరు శాతం చాలు. నాకు కొత్తగా డబ్బు సంపాదించాలనే అవసరంలేదు. నాకు కావలసిన దానికన్నా ఎక్కువే సంపాదించుకున్నాను. నేను పెట్టే పెట్టుబడులు ఎంతున్నా ఫరవాలేదు. కనుకనే తక్కువ కమీషన్‌తో ఎక్కువ మందికి సహాయపడాలనుకుంటున్నాను. ఆపైన మీ ఇష్టం"

సంభాషణ మరికొంతసేపు జరిగేక గురురాజ్ పదివేల రూపాయల నోట్ల కట్టలు తీసి వీరయ్య డెస్క్ మీద వుంచేడు. వీరయ్య వాటిని లెక్క చూసుకుని తన డెస్క్ లోపల పడేసుకున్నాడు. గబగబా ఒక రశీదు రాసేడు.

"ఈ రశీదు జాగ్రత్త. మీకీ క్షణంలో డబ్బు కావాలన్నా మా ఎకౌంటెంటుకి ఈ రశీదు ఇచ్చేసి మీ డబ్బు తీసుకుపోవచ్చు. ప్రతీ నెలా ఒకటో తారీఖున మీ వడ్డీ మీరు తీసుకుపోవచ్చు"

గురురాజ్ మేఘాల మీద తేలిపోతూ, బయటకి నడిచేడు. "ముప్పై శాతం వడ్డీ అంటే మాటలా? రోజుకి ఏభై దుప్పట్లమ్మితే వచ్చే లాభం. ఎలా ఇవ్వగలడబ్బా ఈ వీరయ్య అంత వడ్డీ?" అని ఆలోచించేడుగానీ అతడికేం అర్థం కాలేదు. తర్వాత నెల మొదటి తారీఖు రాగానే అతడు వీరయ్య ఆఫీసులో అడుగుపెట్టేడు. ఎకౌంటెంటు శాస్త్రి అతడి చేతిలో వడ్డీ మొత్తం పెట్టేసరికల్లా ఆశ్చర్యం పట్టలేక...

"ఈ వీరయ్య మహామాంత్రికుడు. ఇతనిక సాధ్యం ఏదీలేదనుకుంటాను" అన్నాడు.

ఆ తర్వాత్తర్వాత అందరూ వీరయ్యను డబ్బు పుట్టించే మంత్రవేత్తగానే భావించారనుకోవచ్చు. అతని పద్ధతులెవ్వరికీ అర్థం కాకుండా వుండేవి. బేంకులు సైతం ఆశ్చర్యపోయేయి. వాటిలోని డిపాజిట్లన్నీ కదిలి వీరయ్య ఖజానాలోకి ప్రవహించడం ప్రారంభించేయి. ఎవరెంత ప్రయత్నించినా వీరయ్య అంతంత వడ్డీ ఎలా ఇవ్వగలుగుతున్నాడో ఊహించలేకపోయేరు. శాస్త్రిగానీ, పాల్‌గానీ ఆ విషయంలో ఎలాటి వివరాలూ చెప్పలేక పోయేవారు. వాళ్లకి మాత్రం వీరయ్య ఏమైనా తెలియనిస్తేగా. మరీ తప్పనిసరి పనులు కొన్ని మాత్రమే వీరయ్య వాళ్లిద్దరికీ అప్పచెప్పేడు. మిగిలిన వ్యవహారాలన్నీ తనే చూసుకునేవాడు.

రాన్రాను ఆ ఊర్లో ఇదో పెద్ద చర్చనీయాంశం అయిపోయింది. డిపాజిటర్లు రోజురోజుకీ పెరుగుతున్నారు. పాల్ ఆ విషయంలో అవిరళంగా కృషిచేసి, రోజుకి డజనుమందిని పైగానే క్లయింట్లను తీసుకు వచ్చేవాడు. అతనికి కూడా మంచి లాభం కలిగింది. ఈమధ్యే ఒక సెకండ్ హేండ్ కారు కూడా కొన్నాడు.

వీరయ్య లెక్కలేసుకునేవాడు. "రోజుకి ఇర

వైవేలు డిపాజిట్లు వస్తే, వడ్డీ లివ్వటానికి పదిహేను వేలుపోయినా ఇంకా అయిదువేలు, నా చేతిలో మిగిలేవుంటాయి''



వీరయ్యకి ఒక సినీ హీరోకుండే గ్లామర్ వచ్చింది. రోడ్డు మీద అతను కనబడగానే అతని వంక ఆరాధనగా చూసి, వేలు చూపి మాట్లాడుకునేవారు ఎక్కువయ్యారు. రోడ్డు మీద నడవటం కష్టమనిపించి, వీరయ్యకి కారు కొనక తప్పలేదు. చిన్న, పెద్ద, తారతమ్యం లేకుండా అన్ని వర్గాల ప్రజలూ అతన్ని చూడగానే వినయంగా నమస్కారాలు చేస్తున్నారు. ఎంతోమంది అతని స్నేహం సంపాదించటానికి ప్రయత్నం చేయసాగేరు. తమ కష్టాలు, బాధలు, అవసరాలు, అతన్తో చెప్పుకుని సహాయం అర్థించేవారికి లెక్కేలేదు. ఇక చందాల కోసం వచ్చేపోయే వారి సంఖ్య ఊహాతీతంగా పెరిగిపోయింది. సమయం, సందర్భం లేకుండా ఇంటి దగ్గర, వీధిలో, ఆఫీసులో ఎక్కడబడితే అక్కడ అతన్ని కలుసుకోవాలనుకునేవాళ్లు ఎక్కువయ్యారు.

వీరయ్యకి దానధర్మాలకోసం వచ్చేవాళ్లని చూస్తే, పట్టరాని ఆగ్రహం కలిగేది.

'నా దగ్గరేమన్నా అక్షయపాత్ర వుందనుకుంటున్నారా వీళ్లు? నేను ఎవరికో దానం చేయటానికని ఇంత కష్టపడటం లేదే... నేను కష్టాల్లో .వున్నప్పుడెవరైనా పలకరించేరా? నేనెందుకు ఇవ్వాలి. ఒక్కపైసా ఇవ్వను...' అని తీర్మానించుకున్నాడు.

ఇంటి దగ్గరా, ఆఫీసులో ఈ రకం దాడిని అతను చాలావరకు సమర్థవంతంగా ఎదుర్కొన్నాడు. ఆఫీసులో వెనగ్గా మరో గది కట్టించి దానిలోకి తన సీటు మార్చుకుని తలుపులు వేసుకునేవాడు. చందా కోసం, లేదా ధర్మం కోసం వచ్చేపోయేవాళ్లని పాల్ ''ఇదేం ధర్మ సత్రంకాదు. బేంక్‌కి వెళ్లండి'' అని బయటికి పంపేసేవాడు. అతను ఒక్కొక్కపుడు అనునయంగా, మరొకప్పుడు అమర్యాదగా, సందర్భాన్ననుసరించి మాట్లాడి వాళ్లని పంపించేవాడు. అతని సలహా మీదనే వీరయ్య కారు కొన్నాడు. కారు అవసరం అతనికి ఇంకో రకంగా కూడావుంది. ప్రతీరోజూ సాయంత్రం అయ్యేసరికి వసూలైన డబ్బు అన్నిరకాల కరెన్సీ నోట్లు ఒక పెద్దతపాలా బేగు వంటి సంచీలో నింపి, దాన్ని భద్రంగా కారులో తీసుకుపోవచ్చనిపించింది అతనికి. ఇంటికి పోగానే ముందు ఆ నోట్లన్నీ అయిదూ, పదీ, ఇరవై, యాభై, వందలుగా వేరుచేసి కట్టలుకట్టి ఆ కట్టలన్నీ బీరువాలో సర్ది తలుపుమూసి, తాళం బిగించేవాడు. ఆ తర్వాతే బట్టలు మార్చుకుని భోజనం చేసేవాడు. ఆ పనంతా పూర్తయ్యేసరికి చాలా రాత్రి అవుతుండేది. మీనాక్షి అంతవరకు ఓపిగ్గా కాచుకుని కూర్చుని భర్తకు వడ్డించి తాను తినేది. వీరయ్య ఆమె అంతవరకు మేలుకొని వుందన్న సంగతి కూడా గమనించేవాడేకాదు. తనేం తింటున్నాడో కూడా అతనికి పట్టేది కాదు. మెదడంతా ఎన్నో అంకెలతో నిండి వుండేది. అతని తిండి కూడా తగ్గిపోయింది. పదేళ్లకుర్రాడు తినే తిండి తినడం కష్టమైపోయింది. మీనాక్షి భర్త ఆరోగ్యం గురించి ఆందోళన పడటం ప్రారంభించింది. ఆమె ఏమన్నా అతను పట్టించుకోకుండా కసిరి పారేసేవాడు. ఆమె మరేం మాట్లాడలేకపోయేది. అతను ఏ వేళకు నిద్రపోయేవాడో కూడా ఆమెకి తెలిసేది కాదు. రాత్రిలో చాలా భాగం అతను రిజిష్టర్లు ముందు వేసుకుని దీర్ఘాలోచనల్లో మునిగిపోయేవాడు. అటువంటప్పుడు భర్తను చూస్తే ఆమెకి జాలి కలిగేది.

''మీ ఆరోగ్యం కాస్త చూసుకోండి'' అనేది ఎప్పుడైనా సాహసించి.

''నా ఆరోగ్యానికేం.. బ్రహ్మాండంగావుంది. నాగురించి నువ్వేం బాధపడకు. నీకేం కావాలన్నా కావలసినంత డబ్బు తీసుకుపోయి

నచ్చింది కొనుక్కో. నన్ను మాత్రం వంటరిగా వదిలిపెట్టు'' చిరాగ్గా అనేవాడు.

ఆమెకీ అదే మంచిదనిపించి అతని గురించి ఆలోచించడం మానుకుంది. కానీ రోజు రోజుకీ చిక్కిపోతున్న భర్త శరీరం, నిరంతర శ్రమవల్ల గుంటలు పడుతున్న కళ్లు చూసి లోలోపల విలవిలలాడేది.

''ఎందుకండీ అంత కష్టపడతారు? మనకున్నది చాలదా? ఇంకా ఏం కావాలని మీ ఆరాటం?'' అన్న మాటలు ఆమె పెదాల వరకు వచ్చి ఆగిపోతాయి. వాటిని బయటకనడం అంటే అతన్లో ఆగ్రహాన్ని కలిగించడమే అని ఆమెకేనాడో అర్థమైపోయింది. ఆ ఇంట్లో ఆ రకంగా నిశ్శబ్దానిదే రాజ్యమైంది.

మొదట్లో రోజుకో బేగుతో డబ్బు తెచ్చేవాడు వీరయ్య. క్రమక్రమంగా బేగుల సంఖ్య పెరిగింది. నోట్లు వేరు చెయ్యలేక అలానే లెక్కపెట్టి, కట్టలుగా కట్టి బీరువాలో సర్దడం ప్రారంభించాడు వీరయ్య. ఆ పని రాత్రి చాలా సేపు పట్టేది. అతని పేరు, అతని వ్యాపారంలో పెట్టుబడి పెట్టిన వాళ్లకి వస్తున్న డబ్బు గురించి విని బాగా వున్నవాళ్లే కాకుండా, చిన్నచిన్న ఉద్యోగులు, కార్మికులు కూడా తమ పొదుపు మొత్తాలను అతని దగ్గరే దాచటం మొదలు పెట్టేరు. వీరయ్య కూడా తన దగ్గరకి వచ్చిన డిపాజిట్ ఎంత చిన్న మొత్తమైనా కాదనకుండా తీసుకునేవాడు.

''నాకు గొప్పా, బీదా తారతమ్యం లేదు. వ్యాపారంలో అందరూ ఒకటే. నా సేవలు అందరికీ సమానమే'' అంటుండేవాడు.

వీరయ్య ఇంట్లోవున్న బీరువా డబ్బుతో నిండిపోయింది. నోట్ల కట్టల్ని లోపలకి నొక్కిపెట్టి మరీ తలుపు వేయవలసివచ్చేది. ఆ తర్వాత తర్వాత ఇంట్లో వున్న అల్మారాలు, టేబుల్ డ్రాయర్లు మంచంకిందున్న ఖాళీ జాగా, గది మూలల్లోనూ నోట్లకట్టలు పేరుకోసాగేయి. గదిలో వున్న ఏ వస్తువు కావాలన్నా మీనాక్షి జాగ్రత్తగా అడుగులో అడుగు వేసుకుంటూ నడవాల్సి వస్తోంది. నేలంతా ఒక అడుగు ఎత్తువరకూ కరెన్సీ కట్టలు దొంతర్లుగా పేర్చి పెట్టేడు. వీరయ్య గదంతా ఖాళీ చేశాడు. గది తాళం పెట్టేడు. గదిలో సామానంతా తీసి ముందున్న కొట్టుగదిలో పడేశారు. మేడమీది గదిలో డబ్బు దాచటం మొదలుపెట్టేడు వీరయ్య. కానీ ఏం లాభం? కొద్దిరోజులు కూడా గడవకముందే ఆ గది కూడా ఖాళీ చేయవలసివచ్చింది. ప్రతీరోజూ బస్తాలతో డబ్బు వచ్చి పడుతుంటే, ఎక్కడ వుంచగలరు? ఎవరైనా?-

''ఈరోజు నువ్వు చూళ్లేదేమో! అయిదు బస్తాలు వచ్చేయి'' భార్యతో అన్నాడు వీరయ్య అన్న.

''నిజంగా అదంతా డబ్బేనంటారా?'' ఉద్విగ్నంగా అడిగిందామె.

వీరయ్య మేడమెట్లెక్కడం, చాలా రాత్రివరకు ఆ మేడగదిలో లైటు వెలుగుతుండటం వాళ్ల దృష్టిని దాటిపోలేదు. వీరయ్య వదిన ఏ చిన్న మాటన్నా వినబడుతుందేమోనని చెవులు రిక్కించి మరీ వింటుండగా వీరయ్య స్వరం వినిపించింది.

''రేపు పైగదిలో పెట్టెలవీ తీసెయ్య మీనాక్షీ... దాన్ని కూడా ఖాళీ చెయ్యాలి తప్పదు''

''వాటన్నిటినీ ఎక్కడ పెట్టుకోమంటారు?'' విసుగ్గా అడిగిందామె.

''అందాకా ముందున్న కొట్టుగదిలో పెట్టుకో''

''కొట్టుగదిలో ఇప్పటికే చాలా సామాను వుంది. అదీగాక వీటిని దాన్లో ఎలా చేర్చడం? నా బట్టలు, నగలూ అన్నీ వున్నాయి, పోతాయేమో...!''

''పోతేపోనీలే... అంతకన్న విలువైనవి దాచేటప్పుడు అవి పోయినా ఫర్వాలేదు''

''మీ ఇష్టం'' అని ఊరుకుందామె.

'ఒక మంచి సేఫ్టీరూం తొందర్లో కట్టించాలి. వీటన్నిటినీ దాన్లో పెట్టుకోవాలి' తృప్తిగా అనుకున్నాడు వీరయ్య. ధనసముద్రం పొంగడం ప్రారంభించేక దానికి మరి చెలియలి కట్టేముంటుంది?

★ ★ ★

సాయంత్రం ఆరుగంటలవుతోంది. వీధి దీపాలు ఇంకా వెలిగించలేదు. వీరయ్య ఒకసారి బయటకి చూశాడు. కళ్లు తిరుగుతున్నట్లనిపించి, చేస్తున్న పని ఆపి కళ్లు మూసుకున్నాడు. అతను చాలారోజుల్నుంచి పొద్దుటి పూట తినడం మానుకున్నాడు. ఆహారం రు

చించడం మానేసింది. పల్చటి మజ్జిగ ఒక గ్లాసు తాగి ఆఫీసుకు వచ్చేస్తాడు. మధ్యలో కొన్నిసార్లు కాఫీ మాత్రం త్రాగి, రాత్రి ఇంటికి వెళ్లిన తర్వాతే కొద్దిగా ఎంగిలిపడి నిద్రపోతాడు.

'తలమీద కొండంత బరువు మోస్తున్నప్పుడు అన్నం తినడానికి తీరికేది?' అన్నది అతని అభిప్రాయం. నిద్రలేచీ లేవడంతోనే హడావుడి పడుతూ గబగబా తెమిలి ఆఫీసుకు వెళ్లిపోతాడు. తిరిగిరావటం ఎన్ని గంటలకన్నది అనిశ్చయమే. అతను తన నశ్యం అలవాటు వదలిపెట్టేశాడు. జీవితంలో మొదటి నుండీ అతనికున్న వ్యసనం అదొక్కటే. దాన్ని కూడా డాక్టరు సలహా పాటించి వదిలేశాడు. ఒకసారి వీరయ్య కాతాదార్లలో ఒకడైన డాక్టర్ సుబ్బరామయ్య ఆఫీసుకు వచ్చేడు వీరయ్యతో పనుండి. అతను పెద్ద పేరున్న డాక్టర్ ఆ ప్రాంతాల్లో. అతన్తో వీరయ్య తన తలవెనక బాగా నొప్పిగా వుంటోందని, ఆ బాధతో రాత్రిళ్లు నిద్రపట్టటం లేదనీ చెప్పుకున్నాడు. సుబ్బరామయ్య అతణ్ణి మామూలుగా పరీక్షించి,

"బహుశా మీరు పీల్చే నశ్యం మీ సమస్యకి కారణం అనుకుంటాను. మీరు నశ్యం అలవాటు మానేసి చూడండి. తగ్గకపోతే ఒకసారి మా క్లినిక్‌కి రండి. తిరిగి మామూలుగా బయటకి పంపిస్తాను" నవ్వుతూ అన్నాడు.

ఫలితంగా అతడు తన అలవాటుకి స్వస్తి చెప్పేడు. కానీ అందుకు ఎంతో శ్రమపడాల్సివచ్చింది. ఒకటే చెప్పుకున్నాడతను. 'ఈ అలవాటు మానకపోతే, రాత్రిళ్లు నిద్రరాదు. రాత్రిళ్లు నిద్రపోకపోతే మెదడు సరిగ్గా పనిచేయదు. అప్పుడు ఏ లెక్కలైనా తారుమారవుతే నా బతుకేమవుతుంది? కనుక మానేస్తున్నాను' అని సరిపెట్టుకున్నాడతను.

సుబ్బరామయ్య వీరయ్యకి మరో సలహా ఇచ్చేడు.

"మీరోమారు కొడైకెనాల్ వెళ్లి కొన్నాళ్లు వుండి రండి వీరయ్యగారూ! విశ్రాంతిగా వుంటుంది. ఆరోగ్యం కూడా కుదుటపడుతుంది. నామాట నమ్మి ముందు మీరు వెళ్లి రండి. అట్నుంచి రాగానే మీరే నామాట నిజమని స్వయంగా నా దగ్గిరకి వచ్చి చెబుతారు"

వీరయ్య విచారంగా తల ఊపేడు, "ఈ జీవితం ఇలాగే గడిచిపోవాలి డాక్టర్‌గారూ! లక్ష వ్యవహారాలు చక్కబెట్టుకోవాలి. ఊపిరి తీసుకునే వ్యవధికూడా వుండటంలేదు. విశ్రాంతి అంటూ నేను కూర్చుంటే వచ్చేవాళ్లు వెనక్కి తిరిగిపోతారు. వాళ్లని నిరాశపరచడం నాకిష్టముండదు. లాభంలేదు డాక్టరుగారూ! నా సంకెళ్లు ఎవరో వేయలేదు. నాకు నేను వేసుకున్నాను"

'శాస్త్రి' డబ్బుకట్టలు లెక్కపెట్టి, ఆ సంచుల్లో సర్దేడు. డబ్బు వివరాల స్టేటుమెంటులు తయారుచేస్తున్నాడు. ఆఖరి కష్టమర్ కూడా వెళ్లిపోయాడు. వీరయ్యకి అస్వస్థతగా అనిపించి, తల రెండు చేతుల మధ్య పెట్టుకుని డెస్క్‌మీద అనించేడు. కేకేసి చెప్పాడు,

"శాస్త్రీ! నీపని తొందరగా కానివ్వు"

ముందు గదిలోంచి శాస్త్రి వెంటనే జవాబు చెప్పాడు.

"చేస్తున్నాను సార్! అబ్బాయిగారొచ్చేరు మీ కోసం"

ఆ మాట వెనకే బాలూ తలుపు తోసుకుంటూ లోపలికివచ్చి తండ్రిముందు చతికిలపడ్డాడు.

"రారా బాబూ!" కొడుకుని చూసి సంతోషించేడు వీరయ్య. పదిహేనురోజులు పైనే అయింది అతను కొడుకుని చూసి.

"ఏరా! ఇంటిదగ్గిర అమ్మాయి, మనవడూ బాగున్నారా?"

"ఆఁ... బాబుకే వంట్లో బాగున్నట్టు లేదు. ఏడుస్తున్నాడు ఊరికే"

"ఇందాకే బృందను అమ్మ దగ్గరికి తీసుకెళ్లాను నాన్నా! నువ్వే ఇంటికి రావడంలేదు"

కొంచెం తడబడ్డాడు వీరయ్య. "నిజమేరా బాలూ! రావాలనే వున్నా ఈ పన్లువల్ల అవడంలేదు. కొంచెం వీలు చూసుకుని వస్తాను. ఆఁ... అన్నట్టు వంటవాడు బాగా పనిచేస్తున్నాడా?"

"వాడిపని నాకేం నచ్చలేదు. తీసేద్దామంటే బృంద వద్దంటోంది"

"సర్లే... అమ్మాయికి నచ్చితే వుండనీ. ఆమె బాగానే ఆలోచిస్తుంది"

ఇంకా మరికొన్ని సాధారణ విషయాలు

మాట్లాడుకున్నారు తండ్రీ కొడుకులిద్దరూ. తర్వాత కాసేపు నిశ్శబ్దంగా గడిచింది.

వీరయ్య డెస్క్‌మీదున్న గుండ్రటి రాయిని తిప్పుతూ హఠాత్తుగా అడిగేడు బాలూ.

"మంచి పేపర్ వెయిట్ కొనొచ్చుకదా! అలాగే కింద కూర్చునే బదులు ఖరీదైన టేబుల్, కుర్చీలు వేయించుకోవచ్చుకదా! ఎందుకు చెయ్యవు?"

వీరయ్య ఆ మాటలకి వివరంగా ఏం చెప్పలేదు. క్లుప్తంగా "నాకు పోకులు కిట్టవురా" అన్నాడు.

డెస్క్‌తాళంవేసి లేవటానికి సిద్ధమవుతూ,

"శాస్త్రీ! స్టేటుమెంట్లు రెడీ అయ్యేయా?"

"అయిపోవచ్చేయి సార్! రెండు నిముషాలు...."

బాలూ గబగబా అన్నాడు, "నీతో ఒక విషయం మాట్లాడాలి" కొడుకు మొహంవంక సాలోచనగా చూశాడు వీరయ్య.

"ఇవాళకాదులే... నాకు కాస్త నలతగా వుంది. రేపు నీ ఇంటికి వస్తాను. అపుడు మాట్లాడుకుందాం"

"నేను ఇపుడే మాట్లాడాలి. నువ్వు వినితీరాలి" బాలూ కంఠం హెచ్చింది.

"అంతేనంటావా?... సరే... అయితే ఒక్క నిమిషం ఆగు" అంటూ శాస్త్రి దగ్గిరికి వెళ్లి, "కేష బేగు అప్పుడే తేకు" అని నెమ్మదిగా చెప్పి, తిరిగి లోపలకి వచ్చేడు. స్థిరంగా కూర్చుని బాలూ చెప్పేది వినడానికి సిద్ధమయ్యాడు.

బాలూ కాసేపు గోళ్లు కొరుక్కున్నాడు. వాడికి ఎలా మొదలుపెట్టాలో తెలీలేదు. తత్తరపడుతూ అడిగేడు,

"నాకు... నాకు కొంత డబ్బు కావాలి"

"అంతేనా!" వీరయ్య తేలిగ్గా ఊపిరి తీసుకున్నాడు. "నేనూ అదే అనుకున్నాను. నా దగ్గిర డబ్బు అడగటానికి సంకోచం ఏమిట్రా బాలూ.... ఎంత కావాలో చెప్పు"

అలా తండ్రి ప్రేమగా అడగ్గానే బాలూకు ధైర్యం వచ్చింది. అయినా ఇంకా వెంటనే తను అనుకుంటున్నది చెప్పలేకపోయాడు.

వీరయ్య వాణ్ణి ప్రోత్సహిస్తూ అన్నాడు.

"చెప్పరా... సిగ్గుపడతావేం. నాకు స్పష్టంగా, ఖచ్చితంగా మాట్లాడేవాళ్లంటేనే ఇష్టం. అయినా నువ్వడిగిందేదైనా నేనెప్పుడన్నా కాదన్నానా బాలూ!"

తండ్రి మాటలు వినిపించుకోకుండానే అన్నాడు వాడు, "అదికాదు... నేను నిన్ను చాలా అడగాలనుకుంటున్నాను. నాకు చాలా డబ్బు కావాలి"

చిరాకునణుచుకున్నాడు వీరయ్య.

"నేను చెపుతున్నదేమిట్రా? నువ్వడుగు ఎంత కావాలో... మరోమాట లేకుండా ఇచ్చేస్తాను. చెప్పు ఎంత కావాలి??"

"అది... అదీ... నీ దగ్గిరెంతుందో అది తెలిస్తేనే కదా నేనడగ్గలను?"

వీరయ్య నొసలు చిట్లించేడు. వాడేం అంటున్నాడో అతనికి అర్థంకాలేదు. అదే అన్నాడు, "ఒరే బాలూ! నువ్వు చెపుతున్నదేమిటో నాకేం అర్థంకావటంలేదు. నాకీరోజు వంట్లో కూడా బాగాలేదు. నువ్వెళ్లి బాగా ఆలోచించుకుని రేపో, ఎల్లుండో, నీక్కావలసిందెంతో తీరిగ్గా చెప్పు" అతనికి స్పష్టంగా ఏ సంగతీ చెప్పలేని వాళ్ళని చూస్తే చెడ్డచిరాకు. కోపాన్ని దిగమింగుకుంటూ లేచి నిలబడి, "నేను ఇంటికిపోయి పడుకుంటాను. వస్తే నాతోరా..." అన్నాడు.

"నేను ఇంటి దగ్గర మాట్లాడను. అమ్మ వింటుంది. అది నాకిష్టంలేదు" బాలూ మొండిగా అన్నాడు.

"శాస్త్రీ! కారు సిద్ధం చెయ్యమను" అంటూ ముందుకు కదిలేడు వీరయ్య. బాలూ చటుక్కున లేచి నిలబడి గుమ్మానికి రెండు చేతులూ అడ్డం పెట్టి తండ్రినాపేడు.

"నేను చెప్పేది వినేవరకూ నువ్వు వెళ్ళొద్దు..." తన ఆఫీసు వాతావరణం పాడుచేయటం వీరయ్య కిష్టం లేకపోయింది. తలతిప్పి శాస్త్రి వంక చూశాడు. అతడు తన ముందున్న కాగితాలు కూడటంలో మునిగిపోయున్నాడు. మరోమాట లేకుండా నిశ్శబ్దంగా పోయి తన జాగాలో కూర్చున్నాడు వీరయ్య. అతన్లో కలవరం కలిగింది. చాలాకాలం తర్వాత బాలూలో మళ్లీ అవాంఛనీయమైన మార్పు అతనికి గోచరించి, భయం కలిగింది. ఈమ

ధ్యకాలంలో వాడు ఇంత దురుసుగా ఎప్పుడూ ప్రవర్తించలేదు. తనైనా వాడడిగిన డబ్బు ఇస్తానసే అన్నాడు కానీ ఇవ్వననలేదు. వీరయ్యా మనస్సు వికలమైంది. శరీరంలో సత్తువ క్షీణించినట్లనిపించింది. వెంటనే పడుకోవాల నుంది అతనికి. ఇంతలో వాడేమైనా త్రాగివచ్చేడేమోననిపించి, గట్టిగా ఊపిరిపీల్చి, అటువంటి వాసనేదీ వాతావరణంలో లేదని గ్రహించేడు. కాస్త మనస్థిమితం కలిగి, జరిగేదేదో జరగనిమ్మని వుదాసీనంగా వుండిపోయేడు. అంతసేపూ బాలూ పెదవి విప్పలేదు.

''ఇప్పుడు టైము ఏడయ్యింది. సరిగ్గా ఏడూ అయిదు అయ్యేలోగా, నువ్వు సంగతేదో చెప్పేవా సరేసరి. లేకపోతే నిన్ను చావగొట్టి మరీ ఇంటికిపోతాను. మొండితనంలో నీకు తండ్రిని నేను... తెలిసిందా?'' అంటూ చేతిగడియారం విప్పదీసి బాలూకెదురుగా తన డెస్కుమీద ఉంచేడు. ఆమాట అన్నాక అతని మనసు తేలికైంది.

బాలూ కొద్దిక్షణాలు గడియారంలో ముళ్ల వంకే తదేకంగా చూసేడు. నెమ్మదిగా అన్నాడు,

''నాకు వాటా కావాలి? ఆస్తిలో నావాటా నాకివ్వు'' వీరయ్య మ్రాన్పడిపోయాడు. వెంటనే ఏం మాట్లాడలేకపోయాడు. ఉధృతమౌతున్న కోపాగ్నినెంతో ప్రయత్నంమీద అదుపులో పెట్టుకుని కళ్లు చిట్లించి ''ఏ ఆస్తి??'' అని అడిగేడు.

''ఏ ఆస్తి అంటే... అదే... మన తాతల నుండీ వస్తున్న ఆస్తి!''

''అలాగా... మంచిది సరే... నీకు ఆస్తెందుకిప్పుడు?''

''నేను మేజర్నయ్యాను. నా వాటామీద నాకు పూర్తి హక్కులు వున్నాయి. ఆ సంగతి నీకూ తెలును''

''ఎవరి ఆస్తి మీదన్నావు'' వీరయ్యకి కొడుకు భావం ఇంకా అర్థమయ్యీ కాకుండా వుంది.

''పిత్రార్జితంమీద'' నొక్కి చెప్పాడు బాలూ.

బాలూ ఆ మాట అనగానే వీరయ్య జేబులో చెయ్యిపెట్టి అర్ధరూపాయి నాణెం బయటకి తీసేడు. దాన్ని డెస్కుమీద పెట్టి బాలూ ముందుకు నెట్టేడు.

''అదిగో... అదే తీసుకో. మీ తాత నాకు వదలివెళ్లిన ఆస్తిలో సరిగ్గా సగం తీసుకుని, ముట్టినట్టు నాకు రశీదు ఇవ్వు''

బాలూ దాన్ని చేతిలోకి తీసుకుని తండ్రి వంక సూటిగా చూసేడు. ''ఇదా ఇదేనా... స్థిరచరాస్తులలో, నా వాటా మొత్తం''

''ఏవీ? స్థిరచ చరాస్తులా?'' వీరయ్య తన్ని తాను మరచిపోయాడు. ఆవేశం అతన్ని ఊపేసింది.

''స్థిరాస్తి, చరాస్తుల లెక్కలు కావాల్రా నీకు? అంతేకదా! సరే అయితే విను. చెప్తాను'' గొంతు వణికిపోతుండగా పూర్వీకులనుంచి తనకి సంక్రమించిన ప్రతీదీ పేర్కొన్నాడు. ఉన్న ఏకైక ఇంటిని, దాన్ని తన అన్న కుట్రకి బలైపోకుండా రక్షించుకోవటానికి తాను పడ్డ శ్రమ, కోర్టుచుట్టూ, లాయర్ల చుట్టూ తిరిగిపడ్డ బాధలు, పూట బత్తెంకోసం, తాను, తన భార్య అనుభవించిన మనస్తాపం కొడుకుతో చెప్పుకుంటుంటే అతని స్వరం పూడుకుపోయింది. బాలూలో చలనం లేకపోయేసరికి, వాడు పశ్చాత్తాపపడుతున్నాడనుకుని తాను అనవసరంగా ఆవేశపడ్డానేమో అనుకున్నాడు. లేచి ''పదరా! ఇంటికిపోయి మాట్లాడుకుందాం. ఇప్పుడు అవేవీ మాట్లాడుకోవలసిన సందర్భం, సమయం కాదు'' అనునయంగా అన్నాడు.

''వీల్లేదు. నన్ను మభ్యపెట్టొద్దు'' మొండిగా అన్నాడు బాలూ. ''ఈ మొండితనం నీకెక్కడి నుంచి వచ్చిందిరా? చెపుతుంటే వినవేం?''

నేనేం చిన్నకుర్రాణ్ణి కాను. నాకన్నీ తెలును. నువ్వు వెంటనే కనక ఆస్తి పంచకపోతే, నేను కోర్టుకి వెళ్లి తేల్చుకుంటాను''

''సరే... అలాగే వెళ్లు. నేనేం చెప్పేదిలేదు'' బయటకి కదిలేడు వీరయ్య చిరాగ్గా. ఈసారి కూడా బాలూ లేచి తండ్రిని వెళ్లనివ్వకుండా అడ్డుకున్నాడు. మరిక ఓర్పు నశించిపోయింది వీరయ్యలో.

సహించలేక వాడి చెంపమీద బలంగా కొట్టేడు.

''అడ్డులేరా గాడిదా! చంపేస్తాను'' ఉగ్రంగా అరిచేడు. బాలూ చేతులు చెంప



మీద పెట్టుకొని ఏడ్వటం మొదలుపెట్టేడు వాడి ఏడుపువిని వీరయ్య గుండె నీరయ్యింది. అతనికళ్లల్లో కూడా నీళ్లు వచ్చేయి. తన చేయి వాడి భుజంచుట్టూ వేసి దగ్గరగా పొదువుకున్నాడు.

“నిన్నెవరో చెడగొడుతున్నారు. బహుశా ఎవరో లాయరైవుంటాడు. తండ్రీ కొడుకుల మధ్య తగువుపెట్టి వాడి జేబులు నింపుకోవాలని అనుకుని వుంటాడు. నువ్వు ఎవరి మాటలూ వినే అవసరంలేదు. నేను నీకు పరాయివాణ్ణిరా! మీ నాన్ననిరా! బాలూ! నీ కోసం ఏదైనా చేయగలిగే నాన్నరా ఈ వీరయ్య. నీకేం కావాలో ఎంతకావాలో అడుగు అంతే...”

“నీ ఆస్తిలో వాటా ఇవ్వు”

“ఇంత మూర్ఖుడివేంరా నువ్వు, మనకున్న ఆస్తెంత?”

“నువ్వెంత సంపాదించేవో, దాన్లో సగం నాకివ్వు”

“నీదెలా అవుతుంది... నేసంపాదిస్తే”

“ఎందుకవ్వదు? పిత్రార్జితంనుంచేగదా నువ్వు వ్యాపారం చేసేవు. న్యాయంగా నీ సంపాదనలో సగం నాది కాదా?”

“నువ్వుండటానికి ఇల్లిచ్చేను. నెలనెలా నీకు హాయిగా గడపటానికి ఎంత కావాలంటే అంత డబ్బు ఇస్తున్నాను. ఇంకా ఎక్కువ కావాలంటే చెప్పు పెంచుతాను”

వాడు తల అడ్డంగా ఊపేడు, "నాకలా వద్దు... నాకు ఆస్తే కావాలి"

"సరే... ఎందుకో చెప్పు"

"నేనొకటి కొనాలనుకుంటున్నాను" అంతలోనే మాట మార్చేశాడు. "నేను కొన్ని పనులు చెయ్యాలనుకుంటున్నాను" వీరయ్య శాంత స్వరంతో వాడికి నచ్చచెప్పటానికి మరోమారు ప్రయత్నించేడు.

"నా సంపాదనంతా నీదేనురా! నాకున్న ఆస్తంతా నా వారసుడిగా నీకే వస్తుంది. ఇంకెవరికిస్తాను. చెప్పు. నా తర్వాత దీనికి పూర్తి హక్కుదారుడివి నువ్వే"

"నీ తర్వాత అంటే ఎప్పుడు?"

"నేనెప్పుడు చస్తానా! అని చూస్తున్నావురా బాలూ!"

తండ్రి కంఠంలోని ఆర్తి బాలూని కొంచెం కదిలించింది.

"నా ఉద్దేశం అదికాదు. నాకు అత్యవసరంగా ఆస్తి కావాలి కనుక అడుగుతున్నాను"

"నీకంత అవసరమేమిటో చెప్పవు. ఆస్తి కావాలంటావు. నేను విషం తాగి చస్తే నీ అవసరం తీరుతుందన్నమాట. నీ సంతోషం కోసం కన్నతండ్రి చచ్చినా పర్వాలేదన్నమాట నీకు. చాల్రా! నాకు భగవంతుడు చక్కని కొడుకునిచ్చేడని నాకు చాలా ఆనందంగా వుంది"

బాలూని పక్కకి తోసి ముందుగదిలోకి వచ్చేడు. "శాస్త్రీ ఆ సంచులు కార్లో పెట్టు. ఆ స్టేట్‌మెంట్లు నా చేతికియ్యి" అంటూ నడిచివెళ్లి కార్లో కూర్చున్నాడు.

బాలూ మెట్లమీద నిలబడి అచేతనంగా చూస్తూవుండగా వీరయ్య వెళ్లిపోయాడు.

★ ★ ★

వీరయ్యకి చాలా అశాంతిగా అనిపించింది. ఇంటికి చేరగానే గబగబ డబ్బు లెక్కలు చూసుకుని ఏదో ఇంత ఎంగిలిపడ్డాడు. తర్వాత బట్టలు వేసుకుని బయల్దేరుతూ

"తలుపేసుకో మీనాక్షీ... నేను బయటకు వెళుతున్నాను" అన్నాడు.

"ఇప్పుడా!?" అంటూ ఆమె ఏదో అడగబోయింది. వినిపించుకోకుండా అడుగులు వేసేడు.

కారు డ్రైవరు తాళంపెట్టి, ఇంటికి పోయేడు. నల్లటి ఆకాశంలో నక్షత్రాలు ఏదో రహస్యం చెప్తుతాము రమ్మంటున్నట్టుగా మిణుకు మిణుకుమంటూ వెలుగులీనుతున్నాయి. రోడ్లన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి. వీరయ్య నడక సాగించక తప్పలేదు. కొన్ని నెలలయింది. అతను అలా నడిచి అందువలన నడకలోని సుపరిచితమైన హాయిని ఆస్వాదిస్తూ ముందుకు కదుల్తున్నాడు లాల్జీ ఎక్స్‌టెన్షన్‌లో వున్న కొడుకు బంగళావైపు.

"నేను వాడితో సవ్యంగా మాట్లాడలేదు. వాడి అవసరమేమిటో ప్రేమగా కనుక్కోవలసింది. వాడికి నిజంగా ఎంతో అవసరమైతే గాని అంత పట్టుపట్టే మనిషికాదు. మరింక ఉపేక్షించితే లాభంలేదు. మంచి మాటలాడి మెల్లగా వ్యాపారంలోకి దించితే, వాడే దారిలోకి వస్తాడు"

వేళకాని వేళలో తాను అలా రావటం చూసి కొడుకేమనుకుంటాడో అని, కాసేపు ఆలోచించేడు. అయినా ఇప్పుడేకదా తనకి తీరిక దొరికేది. తెల్లారి లేస్తే మళ్లీ పనే నేను వాడి ఇంటికి వెళ్లి మనవణ్ణి చూడనందుకు వాడికి కోపం వచ్చి వుంటుంది. సహజమే. అదేం తప్పుకాదు. బాలూ పుట్టినప్పుడు తన చిన్నాన్న రాలేదని తనకెంత కోపం వచ్చింది. అయినా ఈ రోజెందుకు వాడు ఆఫీసుకి రావాలి? అసలే తన ఒంట్లో బాగాలేదు. పైగా వచ్చి వాటా అడగటమేమిటి? బుద్ధిలేని పని కాకపోతే.

సడెన్‌గా అడుగులు వేయడం ఆపి, పునరాలోచన చేశాడు.

తనెందుకు వాడి దగ్గరికి వెళ్లాలసలు?

బుద్ధిలేని ఆ గాడిద వాటా అడుగుతాడా?

ఏం.... వాటా?

దేన్లో వాటా...?

సరిగ్గా సమాధానం చెప్పేను వెధవకి.

ఎలాగూ వచ్చేనుకదా ఇంత దూరం మళ్లీ వీలుచిక్కదు. వాడి సమస్యేమిటో తెలుసుకుని నేను చేయాల్సింది చేస్తాను. బృంద మంచి పిల్ల. ఆ అమ్మాయిని చూసి కూడా చాలా రోజులైంది.

ఇలా అనుకుని మళ్ళీ ముందుకు కదిలేడు.

లాల్‌జీ రోడ్‌లోకి తిరిగేడు. రాత్రి సుమారు ఒంటిగంట కావస్తూంది. నాలుగవరోడ్‌లో పది హేడవ నంబరు ఇంటిముందు ఆగేడు. అదొక చిన్న అందమైన భవనం. గేటుమీద ఆర్చీగా జూకామల్లె తీగె పెరిగివుంది. లోపలగా వున్న వరండాలో జీరోవాట్ బల్బుకాంతి ముందున్న పూచలగుండా కొద్దిగా పడుతోంది. ఒక్క నిమిషంపాటు గేటుముందు నిలబడి తను సంపాదించిన ఆ ఇంటివంక తృప్తిగా చూసుకున్నాడు. చెక్కగేటు తోసుకుని లోపల అడుగుపెట్టేడు. లోపలెక్కడా అలికిడిలేదు. బహుశా నిద్రపోయుంటారనుకున్నాడు. కాసేపు వాళ్లని లేవకుండా వెళ్లిపోదామా అనిపించింది. కానీ కర్ర గేటు శబ్దానికి లోపలెవరో లేచినట్టున్నారు. వరండాలో లైటు వెలిగింది. గది తలుపు చప్పుడుతోబాటు "ఎవరూ?" అన్న బృంద స్వరం వినిపించింది.

"నేనమ్మా! బృందా!" వీరయ్య పలికేడు. లైటుకాంతిలో కళ్లు చిట్లిస్తూ అతనివైపు చూసిందామె. సౌందర్య దేవతలా వున్న కోడలిని చూసి వీరయ్య మనసు ఆనందంతో నిండిపోయింది.

'ఇలాంటి కోడలు దొరకటం చాలా అదృష్టం. ఆ సిద్ధాంతి మాటలు వినకపోవటం మంచిదైంది'

"ఈ రాత్రివేళ నడుచుకుంటూ ఇంత దూరం వచ్చేరా? మామయ్యా?" కారు శబ్దం వినపడకపోవడంవల్ల ఆశ్చర్యంగా అడిగింది.

"ఏం చేయనమ్మా! ఇప్పటికి తీరికైంది. నా చిట్టితండ్రి పడుకున్నాడా?" అంటూ లోపలికి నడిచి మనవడు పడుకున్న వుయ్యాలలోకి తొంగి చూసేడు. వాడి బుగ్గలు మృదువుగా నిమిరేడు.

బృంద కొడుకుని గురించి మురిపెంగా అంది, "వాడి అల్లరి భరించలేకపోతున్నాం మావయ్యా! చీమ చిటుక్కుమంటే లేచి కూర్చుంటున్నాడు"

"లేస్తే ఏమమ్మా? హాయిగా ఆడుకోనివ్వండి"

"ఆడుకుంటేగా! ఎప్పుడూ ఎత్తుకోమంటాడు" బృంద ఎప్పుడు మామగారితో మాట్లాడినా ఎంతో వినయం ప్రదర్శిస్తుంది. వీరయ్య ఆమె చూపే ఆ మన్ననకి ముగ్ధుడవుతుంటాడు.

"బాలూ కూడా చిన్నపుడంతేలేమ్మా! వీడూ తండ్రినే పోలాడన్నమాట. ఇంతకీ బాలూ ఏడి?" కొడుకు కనిపించక అడిగేడు.

జవాబు చెప్పటానికి కొంత సంకోచిస్తూ "ఆయనింకా రాలేదు" అంది.

"ఎక్కడికెళ్లేడు?" నొసలు చిట్లించి అడిగేడు. ఆమె సమాధానం వెంటనే చెప్పలేదు. వీరయ్యకేదో అనుమానం కలిగి మళ్లీ అడిగేడు.

"సినిమాకెళ్లివుంటారు" అంది.

"సినిమాకా? అర్థం లేకపోతేనరి! ఇంత రాత్రపుడేం సినిమా? నిన్నూ చంటివాణ్ణీ ఒంటరిగా వుంచి తిరగడమేమిటి?" వీరయ్య ప్రశ్నల్లో సానుభూతికి బృంద ఇంక ఆపుకోలేకపోయింది. కన్నీళ్లు పెట్టుకుంది.

అతనికేం చెయ్యాలో తోచలేదు. ఆ పరిణామం అతడు ఊహించనిది. తేరుకుని అన్నాడు, "కూర్చో బృందా! కూర్చుని వివరంగా నాతో సంగతేమిటో చెప్పు"

మామగారిముందు కూర్చోలేక ఆమె అతడు కూర్చున్న మంచాన్నానుకుని నిలబడింది. తల దించుకుని చెప్పింది, "ఈరోజే కాదు మావయ్యా! రోజూ ఇంతే. నేనే మీదగ్గరికి వచ్చి చెప్పాలనుకున్నాను. ప్రతీరోజూ రెండుదాటాకే ఇల్లు చేరుతున్నారు. నేనేమన్నా అంటే ఆయన... ఆయన... నాకు అడగడానికి భయం వేస్తోంది"

ఆ తర్వాత విషయాలన్నీ నెమ్మదిగా ఒకటొకటిగా ఆమె నోటినుండి విన్నాడు వీరయ్య. డాక్టర్ పాల్, బాలూ ఇద్దరూ విడదీయలేనంతగా స్నేహితులయ్యారు. వాళ్ళిద్దరూ ఇంకా మరికొందరూ కలిసి ఒక థియేటర్ యజమాని బిల్డింగ్ అద్దెకు తీసుకుని, దాన్లో చాలా రాత్రయ్యేవరకూ రకరకాలుగా కాలక్షేపం చేస్తుంటారు. వీరితో కొందరు చిల్లర సినిమా నటీమణులు కూడా వుంటారన్న సంగతి బృందకు తెలిసింది. బృంద ఇంట్లో పనిచేసే పనిమనిషి భర్తే ఆ ఇంట్లో కూడా పనిచేస్తుండటంవల్ల ఈ విషయాలన్నీ బృందకి ఆమెద్వారా తెలిసేయి. ఇంచుమించు ప్రతి రోజూ ఏదో ఒక వేళలో పాల్ తన కారులో వచ్చి

బాలూని తీసుకెళుతూవుంటాడు. తిరిగి వచ్చేది మళ్ళీ రాత్రి ఏ రెండుగంటల తర్వాతో మాత్రమే. అంతేకాక ఒక్కోసారి బాలూ విపరీతంగా తాగి కూడా వస్తున్నాడట.

తలవని తలంపుగా ఆవేళప్పుడు తమ ఇంటికి వచ్చిన మామగారిముందు బృంద తన ఆవేదనంతా బయటపెట్టింది. బాలూ వాళ్లు చేయబోయే ఏదో వ్యాపారంలో పార్ట నర్‌గా చేరాలనుకుంటున్నాడన్న సంగతి కూడా ఆమె చూచాయగా వింది. బాలూ తను రోజూ లేటుగా రావటానికి కారణం ఆ వ్యాపారం వ్యవహారాలే అని ఆమెతో చెప్పాడు.

"ఆయన తప్పేంలేదు మామయ్యా! అంతా ఆ పాల్‌వల్లే జరుగుతోంది. అతన్ని మీరు దూరంచేస్తే ఆయన నా మాట తప్పకుండా వింటారు!" నమ్మకంగా అందామె. అంతా విని వీరయ్య అడిగేడు, "ఎన్నాళ్ళబట్టి జరుగుతోందమ్మా ఇదంతా!"

"కొన్ని నెలలవుతోంది" భయపడుతూ అంది.

"మరి నాకెందుకు చెప్పలేదు ఇంతకాలం? కనీసం మీ అత్తయ్యతోనైనా చెప్పివుండవలసింది" మందలిస్తున్నట్టుగా అన్నాడు.

"చెప్పడానికి భయంవేసింది మామయ్యా! ఇప్పుడైనా నేను చెప్పేననిమాత్రం మీరు ఆయన్తో చెప్పొద్దు" అర్థించిందామె.

వీరయ్యకి తాను అంధకార కూపంలోకి జారిపోతున్న అనుభవం కలిగింది. ఇప్పుడు అతనికి తన కొడుకు ఆస్తిలో వాటా అడగటానికి కారణమెవరో స్పష్టంగా తెలిసిపోయింది.

డాక్టర్ పాల్... డాక్టర్ పాల్... తనేం చెయ్యగలడు? పాల్‌తో విరోధం తెచ్చుకుంటే తనకెంతైనా అపకారం చేయగలడు. అతనేపనైనా చేయగల సమర్థుడు.

క్షణంలో సగం గడకవముందే అతను నిర్ణయం తీసుకున్నాడు. ఆ పామువడగనీడలో బాలూనెంతమాత్రం వుండనివ్వకూడదు. అందుకు అతనికెటువంటి అనుమానం రాకుండా, బాలూనుంచి దూరంగా పంపెయ్యాలి. ఎంత ఖర్చైనాసరే... తరువాత తను, బృందా కలిసి వాణ్ణి సరైన మార్గంలోకి మళ్ళించటం పెద్ద సమస్యేంకాబోదు.

కోడలు మామగారి మొహంలోకి ఆశగా చూస్తోంది. వీలైనంత మార్దవంగా ఆమెతో అన్నాడు,

"నువ్వు పోయి పడుకో అమ్మా! నేనిప్పుడు ఇంటికి వెళతాను. దీని సంగతి రేపు చూస్తాను. నువ్వేం విచారించకు. అన్ని విషయాలూ నేను సరిచేస్తానుగా... నీకేమైనా కావాలా? నాతో నిర్భయంగా చెప్పు... మనవడు జాగ్రత్త... అన్నట్టు రేపు పొద్దున్నే మీ అత్తయ్యను పంపుతాను. నీకు కాస్త తోడుగా వుంటుంది. మరి నేను వెళతాను. తలుపులు వేసుకో"

చెక్క గేటు తీసుకుని వీరయ్య బయటకు అడుగుపెట్టబోయి అడుగు వెనక్కివేశాడు. బృంద వరండాలో లైటు తీసేసి తలుపులు గడియ పెట్టుకుంది. అదేక్షణంలో ఒక కారు రివ్వున దూసుకుంటూ వచ్చి ఆ ఇంటిముందు ఆగింది.

పాల్ ఫియట్‌కారు అదని వీరయ్య వెంటనే గుర్తుపట్టాడు. కొంచెం వెనక్కి తగ్గి నిలబడ్డ వీరయ్య ఎవరికీ కనిపించలేదు.

బాలూ కార్లోంచి దిగి ఫ్రంట్‌సీట్ డోర్ దగ్గరికి వచ్చి విండోమీద మోచేయినాన్చి అస్పష్టంగా ఏదో అన్నాడు. దానికి పాల్ వగలబడి నవ్వేడు స్టీరింగు దగ్గర్నించి. వెనకసీట్లోంచి కిలకిలా నవ్వుతున్న ఆడగొంతుకలు వినిపించాయి.

అప్పటివరకు ఎంతో జాగ్రత్తగా పథకం ప్రకారం పాల్‌ని బాలూనుంచి వేరుచేయాలనుకున్న వీరయ్య వివేచనని ఒక్క నిముషంపాటు ఆవేశం జయించగలిగింది. ఆ ఆవేశమే తర్వాత జరిగిన అనర్థానికి మూలకారణమైంది.

ఒక్క వుదుటున ముందుకి దూకి, కారు అవతలవైపుకి చేరుకున్నాడు వీరయ్య.

చేరుతూనే ఫ్రంట్‌డోర్ తెరిచి పాల్ కోటు కాలర్ పట్టుకుని బలంగా అతన్ని బయటకి గుంజేడు.

అవతలిపక్కనుంచి బాలూ గుడ్‌నైట్ చెపుతున్నాడు. ఎవ్వరికీ ఏం జరిగిందో అర్థం కాలేదు. ముందుగా తేరుకున్నవాడు పాల్.

అతనేదో అనబోతుంటే, వీరయ్య అతన్ని తన కాలిజోడు తీసి ఎంత బలంగా కొట్టాడంటే, పాల్ కనీసం 'అమ్మా!' అని అనలేకపో

యేడు. వరుసగా దెబ్బమీద దెబ్బ, ఇక్కడ, అక్కడా, అని చూడకుండా వీరయ్య కొడు తుంటే, అతని కళ్ళు బయర్లుకమ్మేయి. మొ హంలో తగిలిన గాయాలనుంచి రక్తం కారడం ప్రారంభించింది. కార్లో వున్న అమ్మాయిలు కెవ్వుమంటూ అరవసాగారు. బాలూ గబగబా ముందుకి వచ్చి తండ్రిని గదమాయించేడు.

"నీకేమైనా పిచ్చి పట్టిందా? పాల్‌ని విడిచి పెట్టు!" అంటూ విడిపించబోయేసరికి వీర య్య వాడివంక తిరిగి ఒకచేత్తో వాడి మెడ పట్టుకుని గేటువైపు విసురుతూ తోసేశాడు.

"నాకు అడ్డంరాకు పనికిమాలిన వెధవా! చంపుతాను జాగ్రత్త!"

బాలూ తల వెళ్ళి గేటు స్థంభానికి గుద్దు కుంది. వాడు మూలుగుతూ చతికిలపడ్డాడు. ఈ గలాభాకి ఎప్పుడు వచ్చిందో బృంద, బాలూని లేపింది. ఇంతలో లోపల్నుంచి కొ డుకు ఏడుపు వినిపించడంతో లోపలకు పోతూ భర్త చేయి పట్టుకుని లాక్కుపోయింది. గుడ్డిగా ఆమెననుసరించాడు బాలూ.

కారు వెనకసీట్లో వున్న అమ్మాయిలు హిస్టీ రిక్‌గా అరవటం సాగించేరు "హెల్ప్... హె ల్ప్..." అంటూ.

వీరయ్య తల కిటికీలోంచి లోపలికి పెట్టి భీకరంగా గద్దించేడు, "నోర్మూయ్యండి... దొంగ ముండల్లారా!"

అతని ముక్కుకి వాళ్ళు వాడిన సెంటు పరిమళం ఘాటుగా తగిలింది.

"మీరెవరు?" అని మరోమారు గద్దించేడు.

వాళ్ళు భయపడ్డారేమో జవాబు చెప్పలేదు.

"చెపుతారా? రెండు తగలాలా?" అని తీవ్రంగా అడిగేసరికి,

"మేం సినిమావాళ్ళం" అన్నారు.

"మీ మొహాలకి సినిమాల్లో వేషాలు కూడానా? మీరెవరో, వృత్తేమిటో తెలుస్తూనే వుంది. మళ్ళీ ఈ ఛాయల కనిపించారో శిగలు తెగ్గోస్తాను. ఖబడ్దార్!"

ఇంకా అతని మాటలు పూర్తికానేలేదు. ఎలాగ వదిలించుకున్నాడో కానీ పాల్, వీరయ్య పట్టు విడిపించుకుని చటుక్కున కార్లోకి దూకి, కారుని ముందుకి దూకించేడు. వెనక్కి తిరిగి ఒక మాట వీరయ్యనుద్దేశించి అన్నాడు,

"ఒరే పిసినారి ముసలి నక్కా! నీ సంగతి నేను చూస్తానురా. నీ అంతు చూడకపోతే నేను పేరు మార్చుకుంటాను. చూద్దువుగాని ఈ పాల్ తడాఖా"

దూరంగా కారు రియర్‌లైట్లు ఎర్రగా మెరు స్తూ వంపుతిరిగి అదృశ్యమైపోయేయి. కాసేపు ఏ ఆలోచనా తోచక వీరయ్య రోడ్డుమీదే నిలు చుండిపోయాడు. మనసెంతో తేలికపడ్డట్టని పించింది. కొడుకు దగ్గిరకి వెళదామా అనుకు నేటప్పటికి తలుపు గడియ వేసి, లైటు తీసేసి కనబడింది.

'ఇదో శుభసూచన' అనిపించిందతనికి.

వెనక్కి తిరిగి ఇంటివైపు నడవటం మొద లుపెట్టాడు.

ఆ తర్వాత జీవితంలో వీరయ్య తనారోజు ఆపని చేయకుండా కోడలుతో మాట్లాడి తిన్నగా ఇంటికి వెళ్ళిపోయివుంటే పరిస్థితి ఎలా వుండే దోనని వూహించుకునేవాడు. పాల్ ఫియట్ కాస్త ఆలస్యంగా వచ్చినా, అతనాపని చేయ కుండా వుండేవాడు. తన పగతీర్చుకోవ డంకోసం పాల్ అంత పనిచేసేవాడుకాదు.



పాల్ ఒక పద్ధతి ప్రకారం కూల్‌గా తన కసి తీర్చుకున్నాడు.

ముందు అతను తిన్నగా పోలీస్‌స్టేషన్‌కి వెళ్లి వీరయ్య తనని అవమానపరచినట్లు కేసు రికార్డు చేయించేడు. కార్లోకూడా వున్న నటీమ ణులిద్దర్నీ బాలూనీ సాక్షులుగా నమోదు చే యించేడు. ఆమర్నాడు అంతా అతను ఊరికే వుండలేదు. బాలూని తన కార్లో ఎక్కించుకుని

తన పరిచయస్తులందరిదగ్గిరికి యధాలా వంగా వెళ్లినట్టు వెళ్లేడు.

ముందుగా అతను వెళ్లింది గురురాజ్ దగ్గిరికి.

"మొహంమీద ఆ ప్లాస్టరేమిటి డాక్టర్? ఎక్కడైనా పడ్డారా ఏమిటి?" ఆదుర్దాగా అడిగాడు.

చూపులు విచారంగా పెట్టి తల కిందకి దించాడు పాల్. "అంతా నా ఖర్మ... నేనూ, నా పుస్తకాలూ తప్ప లోకం సంగతి తెలుసుకోలేక పోయేను. అనవసరంగా రొంపిలోకి దిగేను. ఎవర్నీ నిందించలేను... స్వయంకృతాప రాధం"

"అబ్బ... ఏంజరిగిందో చెపుదురూ చంపక" చనువుగా విసుక్కుంటూ అడిగేడు గురురాజ్.

తల అడ్డంగా ఊపుతూ బదులిచ్చేడు పాల్, "ఉహు... నావల్లకాదు గురురాజ్. నన్ను మరి బలవంతం చేయకండి. నా నోటితో ఆ విషయం నేను చెప్పలేను. స్నేహితులని నమ్మినందుకు నాకు జరగవలసిందే జరిగింది. తప్పంతా నాదే"

"ఎందుకలా పదేపదే అనుకుంటారు డాక్టర్! మీ మంచితనం మాకు తెలీదా? విషయం ఏదీ చెప్పకుండా మిమ్మల్ని మీరే ఎందుకలా కించపర్చుకుంటారు?...చెప్పండి... దెబ్బ ఎలా తగిలింది?"

అప్పుడు చెప్పేడు పాల్ గొంతు తగ్గించి "మీరు నమ్మరు. కావాలంటే బాలూనడగిండి. వీరయ్య నన్ను వాళ్లబ్బాయి ఇంటి దగ్గిరకొట్టేడు"

"ఏమిటీ...? ఎందుకటా?"

"నేనెలా చెప్పేది. కొన్ని రోజుల్నించి చూస్తున్నాను. మీరు గమనించారో లేదో... మనిషి అదోరకంగా వుంటున్నాడు. అతని స్వంత కొడుకు ఏదో విషయం అడగాలని దగ్గరికి వెళితే దవడమీదలాగి కొట్టేడు. కావాలంటే బాలూనడగండి. ఆ తర్వాతవంతు నాదయ్యింది. అతనెందుకో చాలా కలవరపడుతున్నట్టున్నాడు. వ్యాపారం తిరకాసైందో ఏమో..."

"ఆఁ.. ఆఁ..." నోటమాట రానట్టయిపోయేడు గురురాజ్.

★ ★ ★

పొద్దున్నే వీరయ్యను ఇంటి దగ్గిర కలుసుకున్న వాళ్లల్లో మొదటివాడు గురురాజ్.

"నాకు డబ్బు అవసరమైంది వీరయ్యగారూ! మా అమ్మాయి పెళ్లి నిశ్చయమయింది..." బలవంతంగా నవ్వు తెచ్చుకుని, చేతులు నులుపుకుంటూ అడిగేడు. వీరయ్య తనకిచ్చిన రశీదు తీసి అతనిముందు పెట్టేడు గురురాజ్.

"మా ఎకవుంటెంటును చూడండి... లెక్కలన్నీ అతనికే అప్పగించేను"

దెబ్బ తిన్నట్టు చూసేడు గురురాజ్.

"డబ్బు చాలా అవసరం... నాకు వెంటనే కావాలి"

"ఈ నెల వడ్డీ కూడా తీసేసుకున్నట్టున్నారు"

"తీసుకున్నానులెండి... అసలిచ్చేయండి"

"సరే... మీకంతగా అవసరమైతే తీసుకోండి... మీ డబ్బేకదా" వీరయ్య లోపలికి వెళ్లి నోట్లకట్టతో తిరిగి వచ్చేడు.

అతను డబ్బు లెక్కపెట్టుకుంటుంటే "మీరు చాలా తెలివైనవారు. వడ్డీ బాగానే లాగేరు. అసలు కూడా తీసేసుకుంటున్నారు. మీ తెలివి అందరికీ రాదు" నవ్వుతూ అన్నాడు వీరయ్య. ఆ కాంప్లిమెంటు సంతోషంగా స్వీకరించి బయటకు నడిచాడు గురురాజ్.

అది మొదలు వీరయ్య మరి ఆఫీసుకి వెళ్ళలేకపోయాడు. ఒకరితర్వాత ఒకరు రశీదులు చేతపుచ్చుకుని రావటం మొదలుపెట్టారు. మారుమాట్లాడకుండా వాళ్ళందరికీ డబ్బు చెల్లించేడతను. క్రమక్రమంగా ఆ వీధిలో జన సమ్మర్థం మొదలైంది. జనం... ఎక్కడ చూసినా జనమే. ఇళ్ళ అరుగులమీదా, మెట్ల మీదా రశీదులు చేతపుచ్చుకుని ఒకర్నొకరు తోసుకుంటూ నిలబడ్డారు. వీధి తలుపులు బలంగా బంధించి, కిటికీలోంచి డబ్బు చెల్లించసాగాడు వీరయ్య.

మీనాక్షి భయంతో వణికిపోతోంది. శిలావిగ్రహంలా గంభీరంగా కూర్చుని డబ్బు చెల్లిస్తున్న భర్తతో అంది "ఏమైందండీ? ఎందుకింత మందొస్తున్నారు?"

"వాళ్ళ డబ్బు వాళ్ళకిమ్మని వస్తున్నారు మీనాక్షీ"

"మీరేం చేస్తారిప్పుడు?"

"ఏంచేస్తాను... ఇచ్చేస్తున్నాగా..."

"ఈరోజంతా ఏం తినలేదు మీరు"

"నాకు ఆకలి వెయ్యడంలేదు" నిజమే... అతని మనసంతా శూన్యమైపోయింది. డబ్బు మీద వ్యామోహం నశించిపోయింది. ఆ జీవంలేని కాగితం కట్టల వెనక పరుగులు తీసి, ధనసముద్రం చేరుకున్నాడు అతను. ధన కెరటాల వెల్లువలో తనివితీరా స్నానం చేసి వున్నాడు. ఇక అతనికా ధనంతో మరి పనిలేదు. ఆ ఆట ముగిసిపోయింది. ఆ సంగతి అతనికర్థమయ్యేక మనసెంతో తేలిక పడింది.

అతనికి చాలా నీరసంగా వుంది. అయినా ఏం తినాలని లేదు. రశీదులను పరిశీలించ డంలో కళ్ళు నొప్పిపుట్టసాగేయి. డబ్బు లెక్కపె ట్టి, లెక్కపెట్టి అతని మణికట్లలో నలుపు ప్రారంభం అయింది. శాస్త్రి తనపక్కనుంటే బాగుణ్ణు అనుకున్నాడు.

తలెత్తి చూస్తే కిటికీలోంచి దూరంగా జనంమధ్య శాస్త్రి తల కనిపించింది. అతను వాళ్ళమధ్యనుంచి దారి చేసుకు రావటానికి తంటాలు పడుతున్నట్టున్నాడు. కొంతమంది అతన్ని గుర్తుపట్టినట్టున్నారు. వాళ్ళు అతని వంక తిరగడం, అతన్ని కొట్టడం చూశాడు వీరయ్య.

"నాకేం తెలీదు. నన్ను కొట్టకండి. ఏ వొట్టు పడితే ఆ వొట్టు. నా పిల్లలమీద ప్రమాణం చేస్తున్నాను. నన్ను కొట్టకండి. నిజంగా నాకే సంగతీ తెలీదు" ఏడుస్తూ ప్రాధేయపడుతు న్నాడతను.

అతని చెవులదగ్గిర ఎవరో గట్టిగా అరిచేరు, "నా రక్తం, మాంసం కరిగించి కూడబెట్టుకు న్నానురా! నా డబ్బు పోయింది. నేను బుక్కా ఫకీరునయ్యాను. దానికేమంటావ్!"

అతణ్ణి వాళ్ళంతా అటూ, ఇటూ లాగి కింద తోసేశారు. అతనికి కళ్ళద్దాలు దుమ్ములో పడి పోయేయి. ఎవరో వాటిని తొక్కేశారు. అతని చెప్పులు ఎక్కడో రాలిపోయాయి. ఆ ముసలి దేహం వణుకుతూ వుండచుట్టుకుని కిందపడి వుంది. ఇంతలో ఒక పోలీసు ఎక్కడినుంచో వచ్చి శాస్త్రిని లేవదీసి నెమ్మదిగా నడిపించు కుంటూ దూరంగా తీసుకుపోయాడు.

నాలుగు గంటలయ్యేసరికి ఇంట్లో నిండిపో యివుండిన డబ్బంతా అయిపోయింది. కిటికీ లోంచి చూసేడు వీరయ్య. కళ్ళు చెదిరిపో యాయి. ఒకటికాదు, అనేక సముద్రాలు ఎత్తివ చ్చినట్టు, అనంతవాహినిగా జనం కదులుతు న్నారు. కెరటాల్లా చలిస్తున్నవాళ్ళ తలలు, కనుచూపు అనినంతవరకు దిక్చక్రందాకా నిండిపోయి కనిపిస్తున్నాయి. వాళ్ళ మొహాల్లో గోచరిస్తున్న క్రౌర్యం, క్రోధం వీరయ్యలో భీతాహం పుట్టించాయి. వాళ్ళ తిట్లూ, శాపనా ర్థాలూ కలిసిపోయి పెద్ద ఘోషలాగా చెవులు బద్దలు కొడుతున్నాయి. అదృష్టవశాత్తూ ఇంటి ముందు ద్వారం నూరేళ్ళకిందటిదైనా చాలా బలంగా వుంది. ఉట్టిచేతులెన్నైనా దాన్ని పగ లకొట్టడం వీలుపడదు. ఇంటిముందు అంగుళం ఖాళీ లేకుండా మనుషులు చేరి గోలగా అరుస్తున్నారు. వాళ్ళందరూ ఒకేమాట అంటున్నారు,

"నా డబ్బు... నా డబ్బు... నాకిచ్చెయ్"

కిటికీ దగ్గిర కుర్చీలో కూచోలేకపోయాడు వీరయ్య. లేచి వెళ్ళే ఓపిక కూడా లేక, కిటికీ పక్కనే గోడవారగా పడుకున్నాడు. గాలి లేక ఊపిరి పీల్చటం కష్టంగా వుంది. భర్త పరిస్థితి కి, ఇంటిచుట్టూ జనం ముట్టడికి మీనాక్షి ఎన్నడూ లేనంతగా బెదిరిపోయింది. అతని మీదకి వంగి అడిగింది,

"ఏమండీ... ఏం చెయ్యమంటారు? చె ప్పండి... ఏదో ఒకటి చెప్పండి. నాకేం తోచ టంలేదు" దండం పెడుతూ భోరుమంది.

"అన్న... అన్నని పిలు..." బలహీనంగా అన్నాడు వీరయ్య.

ఆమె పెరట్లోకి పరుగెత్తుకు వెళ్ళింది. అయిదు నిముషాలు కాకుండానే అతను తన ఇంటి బాత్‌రూం గోడ ఎక్కి, దానిమీంచి వీరయ్య డాబా పిట్టగోడమీంచి, జనం కంటప డకుండా దిగి వీరయ్యముందు వాలేడు.

"ఏం జరిగిందిరా తమ్ముడూ! ఈ గోలంతా ఏమిట్రా?"

"నేను అలిసిపోయాను. నావల్ల కాదురా అన్నయ్యా! తొందరగా పోలీసులకి కబురు

చెయ్యి. లేదంటే ఇల్లు ముక్కలైపోతుంది. మన్ని చంపేస్తారు. ఇంటికి నిప్పంటించేస్తారు"

"ఇంకా వాళ్ళందరికీ నువ్వు డబ్బివ్వాలా?"

"వాళ్ళకే కాదు, ఇంకా ఎంతమందికో ఇవ్వాలి. రేపు ఇంకా చాలామంది వస్తారు. ఇంకా, ఇంకా వస్తూనే వుంటారు. మనం బతకాలంటే అర్జెంటుగా పోలీసుల్ని లాయర్నీ పిలువు ఇన్‌సాల్వెన్సీ ఫైలు చేయాలి... వెంటనే"

"కుటుంబం పరువేం కావాలిరా... ఇన్‌సాల్వెన్సీ అంటున్నావు!"

"తప్పదురా! మరో దారిలేదు"

అతని అన్న ఆపదల్లోనే బంధువుడు, నిలబడి ఆలోచించసాగేడు. బయట గందరగోళం క్షణక్షణానికీ పెరిగిపోతోంది.

"తొందరగా వెళ్ళు. అన్నా... మనందరం ఒక్కరు మిగలకుండా పోతాం. ఇది వరదకన్న భయంకరమైన పరిస్థితి. పరుగెత్తు... ఆలోచించకు. నువ్వే చెయ్యాలి. చెయ్యగలవు" మరింక మాట్లాడలేక నీరసంగా కళ్ళు మూసుకుని వుండిపోయాడు వీరయ్య. మరింక ఆలస్యం చేయలేదతను. మీనాక్షిని చూసి "వాడికేదైనా ఇవ్వు. చాలా నీరసంగా వున్నాడు" అన్నాడు.

ఆమె ఏడుస్తూ అంది, "నేనేం చేసేది. ఇవ్వడానికేంలేవు. పాలమనిషి రాలేకపోయింది. పొద్దున్నుంచి ఇద్దరం తినడానికే వీలు లేకపోయింది"

"సరే... అయితే ఇప్పుడే వస్తానుండు" అంటూ పరుగెత్తి తొందరగా ఒక గిన్నెతో వేడి కాఫీ, తినడానికేదో కొంత తెచ్చిచ్చేడు. తమ్ముడికి ఆవిధంగా సహాయపడగలగడం అతనికెంతో సంతోషంగా వున్నట్టుంది.

"వాడికి తొందరగా తినడానికి పెట్టి, వేడిగా కాఫీ ఇవ్వు. మీ అక్క వంట చేస్తోంది. అవగానే పంపిస్తాను. నేను వెళ్ళి పోలీసుల్ని సహాయం తీసుకువస్తాను. అలాగే లాయర్ని కూడా. ఈ ఇంటికేం కాకుండా నేను చూసుకుంటాను. మీరు నిశ్చింతగా వుండండి" అంటూ పెరట్లోకి పడివడిగా ఆ పనులు చేయటానికి కదిలేడు.

★ ★ ★

ఆ జనం వెనక్కి తగ్గడం ఒక్కరోజులో జరగలేదు. రెండుమూడు మాసాలయ్యేవరకు, కోర్టులూ, లాయర్లూ, పోలీసులూ వీళ్ళమధ్యే వుంటూ, వీళ్ళతోడిదే లోకంగా వుంటూ, ఎన్నో ఇబ్బందులపాలయి, తప్పించుకోగలిగేడు వీరయ్య.

అతన్లో పెనుభారం దిగిపోయిన భావం



కలిగింది. తన నట్టింట్లో చాపమీద కళ్ళు మూసుకుని పడుకునివుంటే అన్నాళ్ళుగా తాను కోల్పోయిందేదో తిరిగి లభించినట్లయింది.

మీనాక్షి వంటింట్లో పని చేసుకుంటోంది. ఇంటిముందు రిక్షా ఆగిన చప్పుడైంది.

ముందు బాలూ, వెనకనే బాబుని ఎత్తుకుని బృంద లోపలకి అడుగుపెట్టేరు.

రిక్షావాడు రెండు పెట్టెలూ, బెడ్డింగూ, గది మూలకి చేర్చి వెళ్ళిపోయాడు.

వీరయ్య మనవణ్ణి ఒకసారి ఎత్తుకుని ముద్దాడాడు. వెంటనే బృంద వాణ్ణి ఎత్తుకుని వంటింట్లోకి మీనాక్షి దగ్గరకు వెళ్ళింది. బాలూ ఏం చెయ్యాలో తోచక కాసేపు నిలబడిపోయా డు. చాలా రోజులైంది వీరయ్య వాడితో మాట్లా డి. గది గుమ్మంలో నిలబడి ఏం తోచక దిక్కులు చూస్తున్న బాలూవంక చూశాడు వీరయ్య. తండ్రి అడిగినంత డబ్బిస్తున్నప్పుడు అతన్లో వుంటూ వచ్చిన విసురుగానీ, మొ హంలో ఆ పెంకితనంగానీ నేడేమాత్రం కనిపించడంలేదు.

కొడుకుమీద అవ్యాజానురాగం కలిగింది వీరయ్యకి.

బయటకి కనిపించకుండా వెలుతురు పంచే మణిదీపంలా డబ్బు మనిషిలో తేజస్సును, ఆత్మధైర్యాన్ని కలిగిస్తుంది. అది లేకపోవడంవల్ల తేజస్సు కోల్పోయింది బాలూ మొహం. తండ్రి తనవంకే చాలాసేపట్నుంచి చూస్తుండటంతో తానేదో చెప్పాలేమో అనుకుని,

"వాళ్ళు ఆ ఇల్లు తీసేసుకున్నారు. అందుకే వచ్చేశాం" అన్నాడు.

"ఇంట్లో వస్తువులు కూడానా... అనుకున్నాలే..."

"మా బట్టలు బృంద నగలు తీసుకురా





వటం కష్టమైపోయింది''

''నాకదీ తెలుసు... ఇటురా బాలూ!''

బాలూ తండ్రిదగ్గరికి నడిచి అతనిపక్కనే చాపమీద కూర్చున్నాడు. చేతిని వాడిచుట్టూ వేశాడు వీరయ్య.

''అక్కడున్న ఆ పెట్టె చూశావా?'' పోయిందేమో అనుకున్నాను. కానీ పోలేదు. నిన్ననే దొరికింది''

సంవత్సరాలకిందట అతడు కో-ఆపరేటివ్ బాంకు ఆవరణలో చెట్టు నీడలో కూర్చుని పనిచేసుకున్నప్పుడు, తన సరంజామా అంతా దాన్లో పెట్టుకునేవాడు. ఆ చిన్న రేకుపెట్టె సొట్టలుపడి, రంగుమారి, ఒక మూలగా పడి వుంది.

''అదేం పాడవలేదురా... సిరాబుడ్డి కూడా పగిలిపోలేదు. నువ్వు నన్ను ఆస్తి ఇమ్మని అడిగావు గుర్తుందా? అదేరా నా ఆస్తి. నువ్వే తీసేసుకో... పొద్దున్నే భోజనం చెయ్యి. ఆ పెట్టె తీసుకుని కోపరేటివ్ బాంకు దగ్గిరకి వెళ్లు. బహుశా ఆ చెట్టుకూడా ఇంకా వుండే వుంటుంది. అక్కడకి చేరుకో. అంతవరకే నేను చెప్పగలను. తర్వాత ఏమైనా కావొచ్చు. ఏరా? ఏమంటావు? నీకో దారి చూపిస్తున్నాను? నువ్వా దారిలో నడవగలవా?''

బాలూ మొహంలో కూలిపోయిన ఆశాసౌధపు శిథిల ఛాయలు త్వరత్వరగా కదలాడాయి. ఎలాగో గొంతు పెగల్చుకొని అనగలిగేడు, ''నేను వెళ్ళి ఎలా కూర్చోగలను? చూసేవాళ్ళేమనుకుంటారు?''

తేలిగ్గా నవ్వేశాడు వీరయ్య. అతనికెందుకో చాలా ఆనందంగా వుందారోజు.

''సరేరా! నువ్వు వెళ్ళలేకపోతే నేను వెళతాను. కాస్త నా వంట్లో సర్దుకుంటే మళ్ళీ పాత వీరయ్యనవుతాను. అదిసరేగానీ, నువ్వెళ్ళి చిన్నాణ్ణి తీసుకురా. వాడితో కాసేపు ఆడుకుంటాను. వాడు లేకపోవడంవల్ల ఇంట్లో అసలు సందడే లేకుండాపోయింది'' అంటూ కాళ్ళు బార్లజాపాడు వీరయ్య.

★

## జంతువుల సంస్మరణార్థం...

"పుడితే గొప్పోరింట్లో కుక్కగానైనా పుట్టుగానీ, పూరిగుడిసెలో మడిసిగా మాత్రం పుట్టకు" అన్నాడో రచయిత. ఆ మాట నిజమేనన్పిస్తోంది. తమకు ఆప్తమిత్రుల్లా మసలిన జంతువుల సంస్మరణార్థం చిరస్థాయిగా నిలిచే కట్టడాల్ని నిర్మింపచేసి వాటి చరిత్రను అజరామరం చేశారు ఒకప్పటి చక్రవర్తులూ, మహారాజులు. అక్బర్ పాదుషావారి విషయానికే వస్తే - అపారమైన ఆయన గజబలంలో ఆయనకెంతో ప్రీతిపాత్రమైన ఆడ ఏనుగు ఒకటి ఉండేది. ఎన్నో సందర్భాలలో అది తన ప్రాణాల్ని కాపాడినందుకు కృతజ్ఞతగా దాని సంస్మరణార్థం ఓ కట్టడాన్ని నిర్మించాడాయన. అదే ఫతేపూర్ సిక్రీలోని 'హిరన్‌మినార్'!

తన ప్రాణాల్ని రక్షించాలనే తపనతో నలభై అడుగుల వెడల్పున ఉన్న కాలువను లంఘించి అశువుల బాసిన 'చేతక్' అనే అశ్వరాజానికి గుర్తుగా రసపుత్రవీరుడు రాణా ప్రతాప్ చితోడ్‌ఘర్‌లో ఓ కట్టడాన్ని నిర్మింపచేశాడు. అనేక సందర్భాలలో తన ప్రాణాల్ని కాపాడిన 'పెంపుడు కుక్కపట్ల ఛత్రపతి శివాజీ




ఎనలేని వాత్సల్యాన్ని కురిపించేవాడు. ఆ కుక్క కూడా శివాజీ అంటే ప్రాణం పెట్టేది. దానికెంత అభిమానం అంటే తన యజమాని మరణానంతరం అతని 'చితి'లోనే దూకి ఆత్మార్పణం చేసేసుకుంది. ఆ శునకరాజు త్యాగానికి మురిసిపోయిన శివాజీ కుటుంబసభ్యులు ఓ అందమైన సమాధిని దాని సంస్మరణార్థం కట్టించారు. రాయగఢ్ కోటలో ఇప్పటికీ

ఆ సమాధి చెక్కుచెదరకుండా ఉంది.

చెప్పుకుంటూపోతే ఇలాంటి సంఘటనలె న్నో ఉన్నాయి. అయితే విశ్వాసపాత్రంగా ఉంటూ తమకెంతో సేవచేసిన జంతుజాలానికే 'సంస్మరణచిహ్నాలు' నెలకొల్పిన 'ధర్మప్రభువులు' అంతకంటే ఒద్దికగా ఉంటూ తమ జీవితాల్నే అంకితం చేసిన 'సేవకుల'కోసం స్మారకచిహ్నాంగా ఎక్కడైనా ఏ ఒక్కటైనా కట్టడం నిర్మించారంటారా?

## విచిత్రస్నేహం

ఏదో పత్రికలో కలంస్నేహం కాలమ్‌లో ఓ అమ్మాయి అడ్రస్ కన్పిస్తే ఉబుసుపోక సరదాగా ఉత్తరం రాశాడో కాలేజీ కుర్రాడు. ఆ అమ్మాయి ఉండేది అమెరికాలో. పేరు ఎలీసా.




కొన్నాళ్ళకి ఆమె నుంచి జవాబు వచ్చింది. తాను ఏ పెన్‌ఫ్రెండ్స్ క్లబ్‌లోనూ తన పేరు నమోదు చేయించలేదనీ, అయినా అతనితో స్నేహం చేయడానికి తనకెలాంటి అభ్యంతరం లేదనీ రాసింది.

అలా ప్రారంభమైన వారి కలం స్నేహం కొంతకాలం జోరుగానే సాగింది. ఎలీసా నుంచి తరచూ ఆ కుర్రాడికి ఏవో గిఫ్టులు అందుతుండేవి. అవి చూసుకుని మురుస్తూ అతనేవేవో రొమాంటిక్ కలలుకనే వాడు. తన శక్త్యానుసారం ఏవో చిన్నాచితక బహుమతులు ఆమెకు పంపేవాడు. అయితే ఆమె వయసు ఎంత అనేది అతనికి పెద్ద పజిల్‌గా ఉండేది. అలా సూటిగా అడిగితే బాగోదుగనుక ఆమె ఫొటో పంపమని ప్రతి ఉత్తరంలోనూ రాసేవాడతను. కాని ఆమె పంపేదికాదు. ఓసారి ఫొటో రెడీగా లేదని మరోసారి చాలామంది అమెరికన్ అమ్మాయిల్లా తాను అందగత్తెను కానేమోనని అనుమానమనీ అందుకే ఫొటో పంపి నీ స్నేహాన్ని దూరం చేసుకోలేననీ ఏదేదో రాసేది.

తర్వాత ఆ అబ్బాయికి పెళ్లయింది. క్రమేణా ఇద్దరు బిడ్డల తండ్రి కూడా అయ్యాడు. బరువు బాధ్యతలూ పెరిగాయి. అయినా మొదట్లో అంత జోరుగా లేకున్నా మొత్తానికీ వారిద్దరి మధ్య ఉత్తరాలు సాగుతూనే ఉన్నాయి. ఆ అబ్బాయి భార్యా బిడ్డలు కూడా

ఎలీసా ఉత్తరాలకోసం ఆసక్తిగా ఎదురు చూసే వారు. అలా 20 సంవత్సరాలు గడిచింది. ఓనాడు ఎలీసానుంచి ఓ పెద్దపాకెట్ అందింది ఆ అబ్బాయికి. తెరిచి చూసి ఆశ్చర్యపోయాడతను. అందులో 78 ఏళ్ళ ఎలీసా చూపుసరిగా ఆనక ఇటీవలే కారుక్రిందపడి మరణించిందనీ ఆమె ఫొటోతోపాటు కొన్ని విలువైన పుస్తకాలు ఆమెకు గుర్తుగా మీకు పంపుతున్నామనీ, ఆమె మీరు చూపే స్నేహంపట్ల ఎంతో ప్రేమనీ ఆనందాన్ని సదా వ్యక్తం చేస్తుండేదనీ ఆమె కుటుంబ సభ్యులు రాసిన ఉత్తరం ఉంది.

అంతటి పెద్ద వయసు స్త్రీతో తను ఇరవై ఏళ్ళుగా పెన్‌ఫ్రెండ్‌షిప్ చేశానా అని ఆశ్చర్యపోతున్నాడా అబ్బాయి. నిజం తెలిశాక అతనికి ఆమె పట్ల ప్రేమాభిమానాలు పెరిగాయే తప్ప తరగలేదు. ఈ అనుభవం ఓ బొంబాయి వాసికి జరిగింది.

## నగ్నఅందాల విందు!

ఆ వధూవరులిద్దరూ తమ మేరేజి రిసెప్షన్ పార్టీని కనీవినీ ఎరుగని రీతిలో జరిపి ప్రపంచాన్ని దిగ్భ్రాంతిలో ముంచెత్తారు. సుమారు 25 మంది అతిథులు, ఆహూతుల సమక్షంలో వారు ఎవ్వరూ ఊహించని విధంగా చకచకా గుడ్డలు విప్పేసి చిరునవ్వులు చిందిస్తూ నగ్నంగా నిలబడ్డారు. ఆ హఠాత్పరిణామానికి తెల్లబోయి నిలువుగుడ్లేసుకు చూస్తూన్న అతిథులవంక చిలిపిగా చూస్తూ "బట్టల చాటున అందాల్ని బంధించడం తప్పు. కనీసం ఈ ఆనంద సమయంలోనైనా వాటికి స్వేచ్ఛ ప్రసాదిద్దాం రండి. మీరూ మాలాగే తయారవండి. ఎంచక్కా ఎంజాయ్ చేద్దాం" అన్నారువారు.

అంతే! స్త్రీ పురుష భేదం లేకుండా అతిథులంతా క్షణాలమీద తమ ఉడుపుల్ని విసర్జించి, ఒంటిమీద నూలు పోగులేకుండా జాగ్రత్తపడి పార్టీకి వన్నె తెచ్చారు. ఆ తర్వాత నవ్వులు కేరింతల మధ్య పార్టీరంగరంగ వైభవంగా జరిగిపోయింది. కార్యక్రమం అయిపోయాక ఎవరి బట్టలు వాళ్లు కట్టుకుని ఆ గమ్మత్తయిన అనుభూతిని మననం చేసుకుంటూ ఇళ్లదారి పట్టారు.



కెన్- లైక్ హారిసన్‌ల వివాహాన్ని పురస్కరించుకుని సిడ్నీలోని రీఫ్‌బీచ్‌లో ఏర్పాటైన రిసెప్షన్ పార్టీలో జరిగిందీ సంఘటన. డ్రమ్మర్‌గా వాసికెక్కిన కెన్, లిటరేచర్‌లో డాక్టరేటయిన హారిసన్‌ని అంతకు కొద్ది రోజుల ముందే సిడ్నీలోని తన స్వగృహంలో పెళ్లాడాడు.

ఈ సంఘటన తెలిశాక పిలిచినా పిలవకపోయినా ఈసారి ఆ దంపతులు ఏర్పాటు చేసే పార్టీకి వెళ్లాలని నగరంలో చాలామంది ఉవ్విళ్లూరుతున్నారట.

## ప్రపంచయాత్రలో పెళ్ళిళ్ళ సందడి

**మార్కో** అంటానియో అనే పెద్దమనిషికి ప్రపంచమంతా చుట్టిరావాలనే కోరిక చిన్నతనంలోనే మనసులో బలంగా నాటుకుపోయింది. కోరిక ఉంటే చాలదుగదా అనుకూల పరిస్థితులూ కావాలిమరి! ఎలాగైతేనేం, తన నలభై ఒకటవ ఏట ఓ మామూలు సైకిలుపై ప్రపంచ ప్రదక్షిణకు బయలుదేరాడతను. తండ్రిగారి సాహసయాత్ర విషయం తెలుసుకుని "మేమూ నీతో వస్తాం డాడీ" అంటూ చెరో సైకిల్ తీసుకుని వెంటపడ్డారతని ఇద్దరు పిల్లలు. ఆరకంగా యుక్తవయస్సులో ఉన్న కుమార్తెను, కుమారుడ్ని వెంటపెట్టుకొని '[illegible] రంగా' అంటూ మూడు సైకిళ్ళపై ప్రపంచ యాత్రకు శ్రీకారం చుట్టాడు మార్కో అంటానియో.




అవిధంగా అమెరికానుంచి బయలుదేరిన ఆ తండ్రీబిడ్డలు దేశదేశాలు పర్యటించి నాలుగేళ్ళు గడిచేసరికి యూరప్‌కి చేరుకున్నారు. వారు యూరప్‌లో పర్యటించే సమయంలోనే కొడుకుకూ, కూతురికి మంచి సంబంధాలు దొరకడంతో పెళ్ళిళ్ళు చేసేశాడు అంటానియో. పెళ్ళయిన మరుక్షణం బిడ్డలిద్దరూ ప్రపంచ యాత్రకు స్వస్తిచెప్పి తమ లైఫ్‌పార్టనర్లతో కల్సి స్వదేశానికి వెళ్ళిపోయారు.

అయినా మార్కో అంటానియో డీలాపడిపోలేదు. ఒంటరిగానే ప్రపంచ పర్యటన పూర్తిచేయాలనుకున్నాడు. అయితే శారీరకంగా అప్పటికే అలసిపోయి ఉన్నందువల్ల సైకిల్‌కు

బదులు స్కూటర్‌పై తన సాహసయాత్రను కొనసాగించాడు. ఒకానొక సందర్భంలో నిద్రాహారాలు లేకుండా ఏకబిగిని 114 గంటల ఇరవై నిముషాలపాటు (అంటే సుమారు 5 రోజులపాటు) స్కూటర్‌పై అతను ప్రయాణం చేయవల్సి వచ్చిందట. తన పర్యటనలో భారతదేశాన్ని కూడా సందర్శించిన మార్కో అంటానియో ప్రపంచ ప్రదక్షిణాన్ని పూర్తిచేసుకుని సుమారు పదమూడేళ్ళ తర్వాత స్వగృహానికి చేరుకున్నాడు.

## ప్రాణాలు కాపాడిన ఏనుగు

ఏనుగులు ప్రాణాలు కాపాడ్డం, కుక్కలు ఫైటింగులు చేయడంవంటి దృశ్యాలు మనం తరచూ సిన్మాల్లోనే చూస్తుంటాం. అయితే అలాంటి సంఘటన తమిళనాడులోని తంజావూరుజిల్లాలో నిజంగానే జరిగిందట.



రాజగోపాలస్వామి ఆలయానికి చెందిన పట్టపుటేనుగును ఎప్పటిలాగే స్నానం చేయించడానికి బావి దగ్గరికి తీసుకొచ్చాడు మావటి సుబ్రహ్మణ్యం. ఆరోజు అతను వచ్చేనరికి అతని భార్య అక్కడ నీళ్లుతోడుకుంటోంది. వాళ్ళ అబ్బాయి కూడా ఆ పరిసరాల్లోనే ఆడుకుంటున్నాడు. అయితే ఉన్నట్లుండి కాలు జారడంతో సుబ్రహ్మణ్యం భార్య కాస్తా నూతిలో పడిపోయింది. భార్యను రక్షించాలనే తొందరలో పరుగున వెళ్ళి తనూ నూతిలోకి దూకేశాడు సుబ్రహ్మణ్యం. అయితే నీళ్ళు చాలాలోతుగా ఉండడంవల్ల అతనికది దుస్సాధ్యంగా తోచింది. అంతేకాదు తను ప్రాణాలతో తిరిగి బయటపడడం కూడా అసంభవమే అనుకున్నాడతను.

తల్లిదండ్రులిద్దరూ నూతిలో పడిపోవడంతో ఏడుస్తూ తనూ అందులోనే దూకబోయాడు వాళ్ళ అబ్బాయి. అయితే ఇదంతా గమనిస్తూ ఉన్న గజరాజు చటుక్కున ఆ కుర్రాణ్ణి తొండంతో వడిసిపట్టి ఇవతలకి లాగేసింది. అంతేకాదు దిక్కులు పిక్కటిల్లేలా ఘీంకరించి చుట్టుపక్కల వారందరినీ బావి దగ్గరకు వచ్చేలా చేసింది. ఏనుగు గోలకు ఏమిటా అని అక్కడికి చేరిన జనం అసలు విషయం గ్రహించి మావటిని అతని భార్యను సకాలంలో రక్షించారు 'ఈ ఏనుగు పుణ్యమా అని మేమంతా మళ్లీ బతికి బట్టకట్టకల్గుతున్నాం' అని ఆ మావటి కుటుంబం ఇప్పటికీ చెప్పుకుంటూనే ఉంది.

# ఏరిన ముత్యాలు

★ కొత్త భాషను ఎవడో ఒక మనిషి ఒకచోట కూర్చొని సృష్టిస్తాడనుకుంటాం. ఒకడుగాని, వదిమందిగాని భాషల్ని సృష్టించలేరు. కొన్ని తరాలు తమ జీవితక్రమంలో భాషల్ని సృష్టించుకుంటూ వెళ్లిపోతాయి.

— **రాహుల్ సాంకృత్యాయన్**

★ ఊరికి కరణం, భాషకు వ్యాకరణం శత్రువులు.

— **నవకవి బాలగంగాధర తిలక్**

★ భాష ఒక నగరంలాంటిది. ఆ నగరం నిర్మించడానికి ప్రతి వ్యక్తి ఒక్కొక్క రాయితెచ్చాడు.

— **ఎమర్సన్**

★ వరి పొలానికి పెట్టే నీటివల్ల కలుపుమొక్కలు కూడా బతుకుతాయి. అలాగే మంచి వారిమధ్య చెడ్డవారు కూడా ఉపకారం పొందుతారు.

— **అవ్వయ్యార్**

★ మంచితనమే హుందాతనం.

— **టెన్నీసన్**

★ అభిరుచుల్నిబట్టి మనిషి గుణగణాల్ని నిర్ణయించవచ్చు. చెడు అలవాట్లున్నవాడు విధిగా దుర్గుణాలుకలవాడై ఉంటాడు.

-- **బోనీ**

★ మనస్థాయికి మించిన అలవాట్లను ఎన్నడూ అలవర్చుకోరాదు. ఒకరోజు పెద్ద బంగళాలో ఉంటే, మరోరోజు గుడిసెలో ఉండటానికి కూడా సిద్ధంగా ఉండాలి.

-- **గాంధీజీ**

★ సంతోషం అనాకారితనాన్ని సమాధి చేస్తుంది. అందాన్ని మరింత మెరుగుదిద్దుతుంది.

— **ఎమియల్**

★ సందేహం స్నేహానికి విషంవంటిది.

— **అగస్టిన్**

★ మంచివాడెప్పుడూ అకస్మాత్తుగా ధనవంతుడు కాలేడు.

— **సైరస్**

★ చాలామంది తత్వవేత్తలవలె మాట్లాడలేరు. మూర్ఖులవలె జీవిస్తారు.

— **ఆంగ్లేయ లోకోక్తి**

సేకరణ: **నలబెల్లి శ్రీమన్నారాయణ**

# 'టీనేజ్' పై చతుర సమీక్షలు

జూన్ చతురలో ప్రచురితమైన **కాళ్లకూరి కృష్ణ** నవల **'టీనేజ్'**పై మాకందిన ఉత్తమ సమీక్షలను ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## 'కనువిప్పు'

*(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)*

'టీనేజ్' నవల తెలిసీ తెలియని వయసులో ఆకర్షణలలోపడి జీవితాల్ని నాశనం చేసుకునే అమాయకపు ఆడపిల్లలకు కనువిప్పు కలిగించేలా ఉందనడం అతిశయోక్తి కాదు.

అర్ధరాత్రి భార్యను 'యవ్వనారంభంలో నువ్వెవరినైనా ప్రేమించావా?' అని అడిగి, భార్య సమాధానాన్ని సహృదయంతో అర్థం చేసుకునే భర్తపాత్ర రావులాంటివారు నిజజీవితంలో ఎంతమంది? మనదేశంలో చాలామంది భార్యలు టీనేజ్‌లో ఎవర్నో ఒకర్ని ప్రేమించినవారే అయివుంటారు. తొలివలపు కొందరికి వరం, మరికొందరికి శాపమే కావచ్చుగానీ ఎంతమంది భర్తలకి రావులాగా ఆ ప్రశ్న అడిగే ధైర్యం, భార్య చెప్పిన సమాధానం సరదాగా తీసుకునే మనస్తత్వం ఉందనేది ఆలోచించవలసిన విషయమే.

టీనేజ్‌లో అంతర్గత సౌందర్యం గురించి అవగాహన లేని శ్యామలలాంటి ఆడపిల్లలు అందంగా, ఆకర్షణీయంగా ఉన్న మగవాళ్ళని ఆరాధిస్తారు. వాళ్ళని హీరోలుగా భావిస్తారు. దాన్నే ప్రేమని, తమ ప్రేమ దేవదాసు-సావిత్రి, లైలా-మజ్నూ, సలీం-అనార్కలి మొదలైన వారి ప్రేమవంటిదని భావిస్తారు. అది సహజమే. తప్పటడుగు వేసే వయసులో ఆ ఆడపిల్లలకి తారసపడే మగవాడు వాసుదేవరావు లాంటి వ్యక్తి కాక సౌమిత్రిలాంటివాడయితే ఆడపిల్లల జీవితం నరకం అవుతుంది. ఈ నవల ప్రలోభాలకి లొంగిపోయే టీనేజ్ ఆడపిల్లలకి ఒక హెచ్చరికవంటి

కథకి అనుబంధంగా రచయిత సృష్టించిన 'స్వరాజ్యం' పాత్ర హరికథల్లో చెప్పే పిట్టకథ వంటిది. కళావంతుల కుటుంబంలో పుట్టి పరిస్థితులకు లొంగి వేశ్యావృత్తిని చేపట్టే యువతులు మనదేశంలో ఎంతోమంది ఉన్నారు. వీరిని ఉద్ధరించాలంటే ఏ ఒక్కరివల్లా కాదు. ప్రభుత్వమే ముందుకు రావాలి. 'వేశ్యలకు నాణ్యమైన కండోమ్సు సరఫరా చేస్తాం' అనే నాయకులున్న రాజకీయ వ్యవస్థ మనది. ఇంక వ్యభిచారాన్ని ఏం అరికడతారు? వేశ్యలనేం ఉద్ధరిస్తారు? కనుక వేశ్యలు వారిని వారే బాగుచేసుకోవాలి. ఇలా తపించే స్వరాజ్యం పాత్ర జాలిగొలుపుతుంది. ఎంతమంది స్వరాజ్యంలాంటి స్త్రీలు ఇష్టం లేకపోయినా ఆ వృత్తి స్వీకరించి ఈ నరకకూపంలో మగ్గిపోతున్నారో! అయితే ఇక్కడ ఆలోచించవలసిన విషయం మొదటినుంచి ఈ వృత్తిని అసహ్యించుకుని,

మగవారి బారినుంచి తప్పించుకోవడానికి శత విధాల ప్రయత్నించిన రాజ్యం అంత తేలిగ్గా సౌమిత్రిని నమ్మడం ఆశ్చర్యంగా ఉంది. అంతేకాక టెన్త్‌వరకు చదివి, టీచర్ ట్రైనింగ్ అయ్యే ఆమెకి కొంతయినా జనరల్ నాలెడ్జి ఉండదని రచయిత భావించి రిజిష్ట్రార్‌గారు, ఆ ఆఫీసరు సిబ్బంది ఇంటికి రావడంవంటి సంఘటన సృష్టించి పాఠకులని పిచ్చివాళ్ళని చేశారు.

ఏది ఏమైనప్పటికీ ఆడపిల్లలకు కనువిప్పు కలిగించేదిగా ఉన్న ఈ నవలను రచయిత కృష్ణగారు ఆకర్షణీయంగాను, అద్భుతంగాను మలిచారనడంలో సందేహంలేదు.

-ఎం.పద్మారమేష్
నూజివీడు

## 'సందేశాత్మకం'

*(ద్వితీయ బహుమతి*
*రు. 75/- పొందిన సమీక్ష)*

**సా**ధారణ శైలి, అసాధారణ భావ వ్యక్తీకరణ, జూన్ నెల 'చతుర' నవల 'టీనేజ్' హైలైట్స్. మనిషి ఆలోచనాసరళి, ప్రవర్తనలపై టీనేజ్ ప్రభావాన్ని శ్యామలద్వారాను, టీనేజర్స్‌పై సంఘం, సాంప్రదాయాల ప్రభావాన్ని స్వరాజ్యం పాత్రద్వారాను చిత్రీకరించడంలో రచయిత చాలావరకు సఫలీకృతులైనారు. నవలలో కొన్ని అంశాలపై రచయిత తన నిర్దిష్ట అభిప్రాయాలను వెలిబుచ్చడంకోసం సృష్టించుకున్న పాత్రలు, సన్నివేశాలు అద్భుతంగా వున్నాయి. నేటి విద్యావ్యవస్థ, గురుశిష్య సంబంధాన్ని వివరించిన దీక్షితులు వంతులు, బ్రాడ్‌మైండెడ్‌నెస్‌కు మరోపేరైన శ్రీనివాస రావు, ఆడపిల్లలకు చిన్న వయసులో పెళ్ళివల్ల కలిగే దుష్పరిణామాలను చెప్పిన విన్సెంట్.. ఇలాంటివి.

వాసు శ్యామలకు రాసిన ఉత్తరం టీనేజ్ యిన్‌ఫాట్యుయేషన్‌లో కొట్టుకుపోతున్న శ్యామలలాంటి అమ్మాయిలకి కనువిప్పు కాగలదు. స్వరాజ్యం పాత్ర చిత్రీకరణ హృద్యంగా వుంది. కేవలం టీనేజ్ లవ్, ఎట్రాక్షన్‌లకు పరిమితం కాకుండా సాంఘిక దురాచారాలనుసైతం స్పృశించడంతో నవలా పరిధి విస్తృతమైంది.

కథ వర్తమానంతో ప్రారంభమై, రెండుతరాల గతాన్ని మోసుకురావడంతో కథనం ఎగుడుదిగుడుగా సాగింది. రాజ్యలక్ష్మి బయోగ్రఫీ కథలో కంటిన్యూటీని దెబ్బతినిపించి పాఠకుడికి రెండు పేరలల్ కథలు చదువుతున్న ఫీలింగ్ వచ్చేలా చేసింది. కథంతా ఫ్లాష్ బ్యాక్‌లో నడవడంతో సినిమాల్లో జరిగేటటువంటి పొరపాట్లు యిందులో కూడా జరిగాయి. ఈ నవలాకథంతా శ్యామల తన భర్తతో చెబుతోంది. కథాగమనం ప్రకారం వాసు, విన్సెంట్‌ల మధ్య జరిగే సంభాషణ శ్యామలకు తెలిసే అవకాశం లేదు.

టీనేజర్స్‌కు, వారి గురువులకు, తల్లిదండ్రులకు ఓ సందేశమీ నవల.

-పి.వెంకటరామిరెడ్డి
చిత్తూరు

## ఆశావాదానికి జోహార్లు

*(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

**టీ**నేజ్‌లో ప్రేమించాము అని ఒక్కసారైనా అనుకోని వ్యక్తి బహుశా ఎవరూ ఉండరేమో. ఆ ప్రేమ ఫలించినా లేకున్నా కొందరికది ఓ తీపిగుర్తుగా జీవితాంతం మిగిలివుంటే, మరి కొందరికి మాయని మచ్చగా మిగిలి జీవితాన్నే వికృతంగా మార్చటం కూడా జరుగుతుంది.

ప్రతి మనిషి జీవితంలోనూ అతిముఖ్యమయిన, మధురమైన టీనేజ్‌ను కాళ్లకూరి కృష్ణగారు సబ్జెక్ట్‌గా తీసుకోవటం బావుంది. ఇది ఒక 'కథ' విషయంగా బావుండటమేకాక, పాత్రల పరంగా కూడా అన్నింటికి పరిమితులమేరకు న్యాయం చేకూర్చడం జరిగిందనే చెప్పవచ్చు. కథను రచయిత నడిపినతీరు బావుంది. మన సమాజంనిండా ఉన్నది 'సౌమిత్రి'లాంటి స్వార్థపరులే తప్ప వాసులా నిస్వార్థంగానూ, బాధ్యతాయుతంగానూ ఆలోచంచగల యువకులు అరుదనే చెప్పాలి. టీనేజ్‌లో శ్యామలలా ఉపాధ్యాయులంటే ఆరాధన, అభిమానం చూపించే పిల్లలు కోకొల్లలు- అటువంటి అమాయకమయిన ఆరాధనను ఆసరా చేసుకుని ఆడపిల్లల జీవితాలతో ఆడు

కునే ఉపాధ్యాయులు, ఫలితంగా జీవితాలనే నష్టపోయిన బాలికల ఉదంతాలు కొన్నయినా ఉన్నాయి... ఆ ప్రవాహంలో కొట్టుకుపోయే ఒకరయినా ఈ నవలవలన ఒక్కక్షణం ఆత్మప రిశీలన చేసుకుని జీవితాన్ని దిద్దుకోగలిగితే, నిజంగా అది ఆనందించదగ్గ, అభినందించ దగ్గ విషయమే!

'రాజ్యలక్ష్మి' పాత్రను మలచిన విధానం సహజంగా ఉంది- తను అనుకున్నది సాధించటంలో విఫలమైనప్పటికీ, ఒకవ్యక్తిగా, గౌరవప్రదంగా మనుగడ సాగించటంకోసం తన పరిధిలో ఆమె చేసిన ప్రయత్నం పరిస్థితులతో జరిపిన పోరాటం మాత్రం ప్రతి ఒక్కరూ హర్షించదగినది. ఆమెను తనవారితో కలిపిన విధానం కాస్త డ్రమెటిగ్గా అనిపించినప్పటికీ ఆమె కథను చదివిన ఎవరికయినా 'అయ్యో' అనిపించకమానదు.
చివరగా కథను సుఖాంతం చేయటం- రచయితకు జీవితాలపట్ల, సమస్యల పరిష్కారంపట్ల ఉన్న ఆశావాద దృక్పథానికి నిదర్శనం- ఈ నవల ఫార్ములా నవలల్లా మూసపోసిన విధానంలో కాకుండా ప్రత్యేకంగా ఉందని చెప్పవచ్చు.

ఈ విషయంలో ఎప్పటిలా 'చతుర' తన ప్రత్యేకతను నిలుపుకుంది.

-బి. కృష్ణ
ఖమ్మం

## పరిష్కారం ఏమిటి?

*(నాలుగవ బహుమతి రూ. 25/- పొందిన సమీక్ష)*

**కొ**ల్లకూరి కృష్ణగారి 'టీనేజ్' నవల ప్రారంభదశలో కాసింత ఎబ్బెట్టుగా వున్నా స్కూలు వాతావరణం ఆహ్లాదపరిచింది. ఎవ్వరికైనా బాల్యం హేమంతం, బాధ్యతలింకా నెత్తికెక్కని యవ్వనపురోజులూ... కలలూ... కలహాలూ లాంటి తీపిజ్ఞాపకాలు ఎన్నో గుర్తుకు తెప్పించారు రచయిత్రి. కొన్ని సినిమాటిక్ సన్నివేశాలూ వున్నాయి. కొత్త మాస్టారు వచ్చీరావడంతోనే శ్యామల అల్లరిని గుర్తించడం; హోంవర్కు చేయలేదని మొదటిరోజే 'గెట వుట్ ఫ్రం ది క్లాస్' అని అరవడం ఇలాంటివే.

ఈ నవలలో ఆసక్తిదాయకమైన పాత్ర స్వరాజ్యానిది. మంచి వైవిధ్యమున్న ఈ పాత్ర చిత్రణ కూడా బావుంది. పురుషాధిక్య ప్రపంచంలో స్త్రీ ఎదుర్కొంటున్న సమస్యలను రచయిత తనదైన బాణీలో నడిపించి కృతార్థులయ్యారు. ముఖ్యంగా సౌమిత్రి పెళ్లి అనే బంధంతో స్వరాజ్యాన్ని వాడుకొన్నతీరు పాఠకుల్ని కదిల్చివేసింది. ఒక్క వసుపుతాడుతో పురుషుడు స్త్రీ మీద అధికారం సంపాదించుకొంటాడు. స్త్రీ ఆ అధికారానికి లోబడాలి. స్వరాజ్యం జీవితంలో చదువు, పెళ్లిలాటివే ముఖ్యమైన మలుపులు కాలేదు. శ్రీనివాసరావు పరిచయం నాటకీయంగా జరిగినా జీవిత విధానాన్నే మార్చేసిందని చెప్పాలి. విష్ణుకి వయస్సుకు మించిన వ్యక్తిత్వాన్ని నింపి ఆ పాత్రను వాస్తవికతకు కొంతదూరం చేశారు. ఇవి నిజజీవితంలో అరుదు.

రాజ్యలక్ష్మి మేడం స్వీయకథను వాసు, విష్ణు, రాధ ఇలా ఏకబిగిన చదివి తమవంతు భాగాన్ని పూరించటంతో కథలో దాదాపు ప్రతి సంఘటనను నాటకీయంగా మార్చేశారు. విశేషమేమిటంటే కథలో ఎవరికెవరూ తెలుస్తున్నా ఎవరూ ఎలాంటి ఉద్వేగాన్ని పొరటను అనుభవించకపోవటం ఈ కథ ప్రత్యేకత. ముగింపు సీదాసాదాగా వుంది. ప్రేమలోపడ్డ టీనేజ్‌లో వున్న రవళిని ప్రేమ సమస్యనుండి తప్పించాలని ప్రారంభించబడిన ఈ కథకి ఎలాటి పరిష్కారం చూపకుండానే ముగుస్తుంది. మరి ఈ విషయాన్ని రచయిత మరిచారేమో!

యద్దనపర్తి సుబ్రహ్మణ్యం
మొగల్తూరు

## 'విభిన్న విషయాల సంగమం'

*(అయిదవ బహుమతి రూ.25/- పొందిన సమీక్ష)*

**'టీ**నేజ్' నవలలోని విషయం ఆ పేరుకు అతికినట్లు సరిపోయింది. పూర్వకాలపు ఉపాధ్యాయ విద్యార్థులకు, ఇప్పటి వారికి మధ్య సాన్నిహిత్య భేదాన్ని దీక్షితులుగారి మాటల్లో

స్పష్టంగా వివరించారు. కోరమీసాలు, గళ్ల లుంగీలుగల వాళ్లవలన మాత్రమే మోసపోతా మని భావించే స్వరాజ్యలక్ష్మివంటి అమాయకు లు ఆత్మీయతా భావన కలిగించి చేసేవంచ నకు ఏవిధంగా మోసపోతారో చక్కగా వివ రించారు. సౌమిత్రి వంటి నయవంచకులు, రవి, రాజయ్యవంటి కాముకులతోపాటు వాసు, విష్ణు, శ్రీనివాసరావు, లీల, రాధవంటి సున్నిత హృదయులు, రసహృదయులు కూడా ఉంటా రన్నది వాస్తవం. రసావేశం, భావావేశాల మేలుకలయిక ఈ 'టీనేజ్'.

రాజయ్య మాటల్లో 'నలుగురు నడిచిన నేలలో గడ్డి కూడా మొలవదు' అన్నట్లు వేశ్య అయిన స్వరాజ్యంకు శ్రీనివాసరావుతో ఉన్న రోజులలో మాత్రమే సంతృప్తి కలగడం, కడుపు పండటం వంటివి సైన్సు ప్రకారం నిజం కాకపోయినా పరిశీలనాత్మకంగా ఉన్నాయి.

విద్య, ఉద్యోగాల విషయంలో విన్సెంట్ అభిప్రాయాలు విద్యార్థుల, నిరుద్యోగులకు కొంతవరకు నిరాశా, నిస్పృహల్ని కలిగిస్తాయి. ప్రేమించిన వాళ్లను పెళ్లి చేసుకోలేక, పెళ్లి చేసుకొన్న వాళ్లను ప్రేమించలేక విన్సెంట్ తీసుకొన్న నిర్ణయం నిజాయితీని లోపింపజే స్తూ ఇద్దరికీ అన్యాయం చేస్తున్నట్లు తోస్తుంది. శ్యామలవంటి పిల్లలు ఆకర్షణలకు లోనవటం ఎంత సహజమయినా తప్పటడుగు వేయకూ డదనే సందేశం కూడా అంతర్లీనంగా కను పిస్తోంది. రచయిత కాళ్లకూరి కృష్ణగారికీ, నవల అందంగా అందించిన 'చతుర'కు హృదయపూర్వక అభినందనలు.

-బి.వేణుగోపాలరావు
శ్రీరాంనగర్

## 'అన్నిటా అద్భుతం'

*(ఆరవ బహుమతి రూ.25/- పొందిన సమీక్ష)*

'టీనేజ్'లో తొలివలపుని తీపిగా పవర్‌ఫుల్‌గా చెప్తూనే, మరోపక్క ఇంచుమించు ప్రతివాళ్ల హైస్కూల్ రోజుల్నీ పదిలంగా జ్ఞప్తికి తెచ్చే ప్రయత్నంలో రచయిత కృతకృత్యులయ్యారు. నవలలో ఆద్యంతం కన్పించీ, కన్పించకుండా హృదయాన్ని పిండేసే బాధని కొత్త అనుభూ తితో మనముందు పరిచే స్వరాజ్యం ఉరఫ్ రాజ్యలక్ష్మి పాత్రని రచయిత్రి చాలా ఉన్న తంగా తీర్చిదిద్దారు. దీనికి పారలల్‌గా విష్ణుపా త్ర కూడా అలాగే వెలుగునీడల్లో మనసుని కుదిపేస్తుంది. ముఖ్యంగా స్వరాజ్యం పిల్లాణ్ణి అప్పగించేసి, తన స్థానంలోనే ఆగిపోయిన తర్వాత, అతడుతన భార్య రాధ దగ్గర ఆ పిల్లాణ్ణి (వాసుని) చేర్చిన తీరు. ఇక్కడ రాధ పాత్ర ఔన్నత్యం కూడా తక్కువదేం కాదు. "మీరెటువంటివారైనా కానీ మీ తప్పులతో సహా నాకు ప్రేమాస్పదులు" అనే రకం.

కాస్సేపే కన్పించినా విన్సెంట్ ప్రవర్తన కూడా ఓ పాఠంలాంటిదే. వివాహేతర సంబంధాలపై కామెంట్ చేస్తూ "నీ ప్రియు రాలే నీ భార్య కావాలంటే ఆ అదృష్టానికి పెట్టిపుట్టాలి బ్రదర్! స్నేహమూ, ప్రేమా, దాంపత్యం మూడూ ఒకచోట ముడిపడిన పెళ్లే నిజమైన పెళ్లి" అనే వాక్యాలు పదే పదే మననం చేసుకోదగ్గవి! ప్రతి దాంపత్యం ఈ మేరకు పరిపూర్ణతపొందుతోందా అని ఎవరికి వారు ప్రశ్నించుకోదగ్గవి.

పాత్రల గురించికానీ, సంఘటనల గు రించికానీ, ఏకబిగిన చదివించే గుణం విష యంలోకానీ అన్నిటా అద్భుతంగావున్న 'టీ నేజ్' నవల వయోభేదం లేకుండా అందర్నీ అలరిస్తుందనడంలో సందేహంలేదు. ఉత్తమా భిరుచిగల 'చతుర' ఈ నవలని పాఠకులకు అందించడంద్వారా, తమదైన ప్రత్యేకతనీ, ఉత్తమ ప్రమాణాలున్న నవలల్ని ఎంపిక చేసే బాధ్యతనీ పరిపూర్ణంగా నిర్వర్తించింది.

-హరిచందన
కుషాయిగూడ

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 290328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

CHATURA Telugu Monthly Hyderabad – 500 482 Regd. No. H/HD/

